
ఫిబ్రవరి
1975
భారతి
వ్యవస్థాపకులు:
దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు
వెల రూపాయిన్నర

తారకరామా పిక్చర్స్ వారి

# కథానాయకుని  కథ



దర్శకత్వం: డి. యోగానంద్

నిర్మాత: కె. డి. వి. ప్రసాద్, బి.ఎ.

విజయాకంబైన్స్

VIJAYA

# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

★

ఫిబ్రవరి 1975

సంపుటము : 52 : సంచిక : 2 :

విడిప్రతిక వెల రూపాయిన్నర

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1975

# "నిరీక్షణ"

"సాంధ్యశ్రీ"

"ఇన్నినాళ్ల నీ జాడ ఎక్కడ ?"
అని
ఎన్నినాళ్ళో వేచి వేచి
అడిగిన ప్రశ్న యిది.
ఈ వియోగ విరహ వర్షంలో తడిసి
నీ కోసం
నే వెదికే దెక్కడ ?
తార కడపటి మెరుపులో
కడలి కెరటాంచలంలో
గతంలో
నా స్వగతంలో
ఎన్నిరూపాల్లో నిన్ను చూశానో తెలుసా .?
ఊటీ లోయల్లో
సెలయేటి పాయల్లో
కదలాడే యూకలిప్టస్‌గాలి
ఏ దివ్య సందేశాన్ని
తెరలు తెరలుగా మోసుకొస్తోందో
ఎవరూహించగలరు — ?
మందార తుందిల గంధం
నా మనసుకు బంధం వేసినప్పుడు
నాటి
వెన్నెల సెలయేటి నడుమ
నక్షత్రాల పాలరాళ్ల మీదుగా
మబ్బుకుచ్చెళ్ల గాగరనెత్తి
ఓరగా, జారగా నడుస్తున్నప్పుడు
నా గుండె
ఏ అనుభూతికి లొంగి
ఎక్కడెక్కడ విహరించిందో
ఎలా చెప్పను ?
ఏ మాటలతో ఆ భావం విప్పను ?
వాంఛా మధువు
నా ఎడద అంచులు పొంగి
పై కుబికి చింది
అధరాలనంటి
రసనాగ్రంతో రహస్య సమాలోచనం చేయటం
మునిపంటితో
సుధజారిన అధరాధరం
చా సీతి బంధం వేయటం
ఏ చిత్రకారుడు ఏ రంగుల్తో విదిలించగలడు. ?
ఎడారి నగ్నదేహం
వెన్నెల్లో స్నానం చేస్తుంటే
నా బిడార మెక్కడని
నీ నగ్నత్వాన్ని నే స్పృశిస్తుంటే
ఏ నరాల తీగల స్వరాలు సాగాయో
ఏ సంగీత చక్రవర్తికి తెలుసు...?
నీ తొగరు గాగరవర్ణ కిరణాల తడిసి
మంద మంజిష్ఠ కాంతులీను
నీ చిగురు పాదాలమీద
నా శిరసు నుంచి
నీ పల్ల వాంగుళుల స్పర్శ
నా నీలి వెంట్రుకుల తాకినప్పటి
నా పార వశ్యతను
ఏ శబ్దాల సంకేతించగలను...?
విచ్చల విడిగా
ఈ ఉద్రేకం కొనసాగి
గతాన్ని వర్తమానాన్ని

తనలో ఇముడ్చుకొన్న భవిష్యత్తు వైపులాగి
నిన్ను—నీ ఆలోక మూర్తిని
నిరంతరంగా తలచే నా ఆత్మను
ఏ ముగింపుతో మలుపు తిప్పను...?
అంచులేని
ఆలోచనా రుంఝు వీచి
అనాలోచితంగా
స్వయం ప్రవర్తకమైన చేతో
నా జాటు ను నేనే సరిచేసుకుంటూ
గగనంలోను—
లోయలు ధరించిన శిఖరాలలోను
నీ గీయని చిత్రంలో, పికాసోను
నీ చెక్కని శిల్పంలో, మైకేల్ ఏంజిలోను
ఊహిస్తూ గడిపే కాలాన్ని
ఏ గడియారం బాహువులతో బంధించను...?
నగమోహిని
తల పాపిట జలపాతం కలహాంతరిత
జారే జాలు జాలిలో
దృక్కులు క్షణం తడిసి
నా కనుకొలుకుల్లో
నిలచిన నీ ఊహా నిజాన్ని నీవే చూస్తావని
నే ననుకొనటం
కల కాదని
ఏ మెలకువతో వాపోవను ...?

చైతన్య ప్రాతస్సంధ్య
మేల్కొలిపిన కిరణ రుతంతో
నా లోపలి ధ్యాస లేచి - ఆశ లేచి
నీ భావనా దృశ్యం చూచి
నా శాంతి పాడే బలమైన గీతాన్ని
దిక్కులు పరుచుకుంటూ
విన్నానో
వేల వత్సరాల
కోర్కెల భవిష్యత్కాల గమనాన్ని
క్షణంలో పొందిన అనుభుక్తిని పొదివి
మరెన్నో
భవభూతి అనుభూతి తరంగాల్ని
నా అంతరంగంలో పదిలపరచుకొని
ఓ ... రమా ... !
నా సుషమా !
ప్రకృతీ
ఓ నా హృత్కృతీ
దైవ సమాన హేతురాహిత్యం నువ్వు
పార లౌకిక వేదసాహిత్యం నువ్వు
సత్యం నీవు
నిత్యం నీవు...
నీ ఒడిలో—
నీ కన్నుల మెరుపుతడిలో
కరగాలని.........

---



# కవిత్వంలో అనుసరణ

యు. ఏ. నరసింహమూర్తి

అనుసరణ ఒక సహజాతం. కవిత్వం వ్రాయాలనే ఆలోచనలోనే అనుసరణ ఇమిడి ఉంది. అందుకే విశ్వనాథవారు

"ఈ సంసార మిదెన్ని జన్మలకు నేని మాని వాల్మీకి భా
షా సంక్రాంత ఋణంబు దీర్పగలదా! సత్కావ్య నిర్మాణ రే

ఖా సామగ్రి ఋణంబు దీర్పగలదా!" అంటారు ప్రాచీనాలంకారికులలో కవిత్వంలో అనుసరణను గూర్చి విపులంగా చర్చించినవాడు రాజశేఖరుడు. అతడు అనుసరణను హరణమని పేర్కొన్నాడు. ఇతర కవులు ప్రయోగించిన శబ్దార్థములను ఉపనిబంధనం చేయడం హరణమని కావ్య మీమాంస చెప్తుంది. రాజశేఖరుడు హరణాన్ని ఎప్పుడూ దోషంగా పరిగణించలేదు. హరణంలో ఉండే వివిధ పద్ధతులను విశదీకరించి ఉదాహరణపూర్వకంగా సమన్వయించి ఉత్తమ, మధ్యమ, అధమ రీతులను నిర్ణయించాడు.

"నాస్త్య చౌర కవిజనో నాస్త్యచౌరో వణిగ్జనః
స నందతి వినా వాచ్యం యో జానాతి నిగూహితుమ్
ఉత్పాదకః కవిః కశ్చిత్ కశ్చిచ్చ పరివర్తకః
ఆచ్ఛాదక స్తథా చాన్యస్తథా సంవర్గకోపరః
శబ్దార్థోక్తిషు యః పశ్యేదిహ కించన నూతనమ్
ఉల్లిఖేత్కించన ప్రాచ్యం మన్యతాం స మహాకవిః"

(కావ్యమీమాంస—ఏకాదశాధ్యాయము)

(చౌర్యము లేని కవిగాని వర్తకుడుగాని లేడు. ఎవ్వడు గూఢముగా దాచవలసిన దానిని దాచగలడో అతడానందమునకు పాత్రుడు. కవులలో నొకడు ఉత్పాదకుడుగను, మఱియొకడు పరివర్తకుడుగను, వింక నొకండు ఆచ్ఛాదకుడుగను, మరియు నొకడు సంపుటీ కర్తగను నుండును. శబ్దార్థములలో నూత్న విశేషములను కనిపెట్టువాడును, ప్రాచీన సూక్తులలో గల కొంత వైశిష్ట్యము నపేక్షించువాడును నగు వాడే మహాకవి యనదగును

— శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి)

పై ప్రాత కవిత్వంలో అనుసరణ తప్పనిసరి అని, కేవల ప్రతిభావంతుడు మాత్రమే అనుసరణను విడచి కొత్త లోవ తొక్కగలడని చెప్తుంది.

అనుసరణను దృష్టిలో పెట్టుకుని రాజశేఖరుడు కవులను నాలుగు విధాలుగా వర్గీకరించాడు భ్రామకుడు, చుంబకుడు, కర్షకుడు, ద్రావకుడు—అనే నాలుగు విశేషములైన కవిగణము లౌకికమని, వారికంటె భిన్నుడైనవాడు అలౌకికుడని కావ్యమీమాంస చెప్తుంది. పాతదైన కథా విషయాన్ని గ్రహించి దానిని అన్య దృష్టమైనదానిగా భ్రమింపజేసేవాడు భ్రామకుడు. ఇతరుని మాట అందమైన తన మాటలతో కలిపి కొంచెం కొంచెం కొత్తగా ప్రదర్శించేవాడు చుంబకుడు. పాత వాక్యాలనే పోల్చుకోడానికి వీలు కాకుండా తన వాక్యాల ద్వారా మూలార్థంలో ద్రవింపజేసినవాడు ద్రావకుడు. ఇతరుని వాక్యాన్ని తెచ్చి తన మాటలలో ఇమిడ్చి ఏదో విధంగా చెప్పేవాడు కర్షకుడు. ఈ విధంగా రాజశేఖరుడు తన నిశిత పరిశీలన ద్వారా అనుసరణశీలం గల కవులను వర్గీకరించడమే గాక, అనేక విధాలైన శబ్దార్థహరణోపాయాలను సోపపత్తికంగా నిరూపణ చేసేడు. ఆసక్తి కలవారి కది ప్రత్యేకంగా తెలుసుకోదగ్గ విషయం. ఈ వ్యాసంలో అనుసరణను గూర్చి ప్రస్తావించే ఎన్నో విషయాలు రాజశేఖరుణ్ణి దగ్గర పెట్టుకుని వ్రాసినవి కావు. కాని ఇందులోని విషయాలు తప్పనిసరిగా రాజశేఖరుడు చెప్పిన విషయంలో గతార్థం కాగలవు. రాజశేఖరునిది కూలంకషమైన చర్చ. ఇది రేఖామాత్రమైన స్పర్శ.

ఒక కవి పూర్వులను అనుసరించడానికి (1) గౌరవం (2) సమకాలీన ఆలోచనా ధోరణి (**Contemporary thought**), (3) వ్యామోహం (4) ప్రత్యేక ప్రయోజన సాధన (5) సాహిత్యంపై గల అధికారం (6) ఆసక్తి— మొదలైన అంశాలు కారణాలుగా కన్పిస్తాయి. కవి ప్రతిభావంతుడైతే అనుసరణ కూడా శోభిస్తుంది. ప్రతిభాలోపంతో కూడిన అనుసరణ నీరసంగా కనిపిస్తుంది.

కాళిదాసు భాస మహాకవి ఎడల తనకు గల గౌరవాన్ని ప్రకటించాడు. అంతేకాక తన రచనలో అనేక స్థలాలలో భాసుణ్ణి అనుకరించాడు. ఒక మహాకవి —మరొక మహాకవిని అనుసరించే పద్ధతి ఎలాగుంటుందో ఈ క్రింది విధంగా గమనించవచ్చును. భాసుడు నాటకకర్త అయినా వర్ణనాప్రీతి గలవాడు. అతడొక అసాధారణమైన వర్ణన చేయదలచాడు. మహోన్నతమైన పర్వత శిఖరం నుండి భూమిమీద నుండే వస్తువులను చూస్తే ఎలాగుంటుందో వర్ణించాలనుకున్నాడు. అవిమారక నాటకంలో ఏకాంతంలో కురంగీ విరహాన్ని భరింపలేక ఆత్మహత్య చేసుకోదలచి అవిమారకుడొక పర్వత శృంగాన్ని అధిరోహిస్తాడు. ...మయినాని కన్యకొక విద్యాధరుడు ప్రియురాలితో కలిసి వస్తాడు అతడు

ఆకాశయానం చేస్తూ తన ప్రియురాలికి భూమిమీద నుండే వస్తువులను చూపిస్తాడు.

"విద్యాధరః— (ఆకాశయానం నిరూప్య) సౌదామని! పశ్య పశ్య! వసుంధరాయాః దూరస్థాం దర్శనీయాకృతిమ్. తథాహి—

శైలేంద్రా కలభోపమా జలధయః
క్రీడా తటాకోపమా
వృక్షాః శైవల సన్నిభాః
క్షితితలం ప్రచ్ఛన్న నిమ్న స్థలమ్
సీమంతా ఇవ నిమ్నగాః
స విపులా సౌధాశ్చ బిందూపమా
దృష్టం వక్రమివాభిభాతి సకలం
సంక్షిప్త రూపం జగత్.

ఈ వర్ణనను పరిశీలిస్తే భాసుడు ఎన్నడో ఒకనాడు ఎత్తయిన పర్వతాగ్రం నుండి తాను చూసిన ప్రకృతిని యథాతథంగా వర్ణించాడని అనిపిస్తుంది. కాళిదాసు ఈ వర్ణన చాలా ఆకర్షించింది. అతడు ఇంకా మీదకు పోయాడు. అందు కతనికి తగిన అవకాశం లభించింది. దుష్యంతుడు దుర్జయాది దానవగణాన్ని సంహరించడంలో ఇంద్రుడికి సహాయం చేసి స్వర్గం నుండి తిరిగి వస్తున్నాడు. ఆకాశం నుండి నేల కవతరిస్తున్న దుష్యంతుడు అక్కడ నుండి భూమిని చూచి ఆ సుందర దృశ్యాన్ని గురించి ఇలా చెప్తాడు.

రాజా— (అధోఽవలోక్య) వేగావతరణా దాశ్చర్య దర్శన స్సంలక్ష్యతే మనుష్యలోకః. తథాహి:—

శైలానా మవ రోహతీవ శిఖరా
దున్మజ్జతాం మేదినీ
పర్ణాభ్యంతర లీనతాం విజహాతి
స్కంధోదయా త్పాదపాః
సంతానాత్తనుభావ నష్ట
సలిలా వ్యక్తిం భజంత్యాపగాః
కేనాప్యుత్ క్షిపతేవ మర్త్యభువనం
మత్పార్శ్వ మానీయతే".

ఆకాశం నుండి అధిక వేగంతో భూమికి దిగుతూన్నప్పటి దుష్యంతుడి అనుభవాన్ని కాళిదాసు అనన్యసామాన్యంగా వూహించాడు. ఇందులో భాసుణ్ణి అనుసరించిన తీరు స్పష్టంగా కన్పిస్తూన్నా, ఒక కొత్త భావనతోపాటు, "కేనాప్యుత్ క్షిపతేవ మర్త్యభువనం మత్పార్శ్వ మానీయతే" అనే పాదంలో కాళిదాసుని సహజ ప్రజ్ఞ సాక్షాత్కరిస్తుంది. గౌరవంతో కూడిన పూర్ణ ఇలాంటి అనుసరణను ప్రేరేపిస్తుంది.

ఒక్కొక్క కవి స్వకపోల కల్పనా చాతుర్యం కలిగిన వాడైనప్పటికీ పూర్వ సాహిత్యంలో తనకు నచ్చిన భావాలను గూర్చి ఆలోచిస్తూ ఉంటాడు. తన హృదయంలో పొదుకొని ఉన్న భావాన్ని సమయానుగుణంగా తన రచనలో ఉపయోగించుకోడానికి వెనుకాడడు. కాని తన రచనలో అనుసరణ లేనట్లు చూపించడానికి ప్రయత్నిస్తాడు.

"వెన్నుని కున్న మచ్చ యరవిందము
రత్నము భోగిలక్షణం
బెన్నంగ నీదు మచ్చ యదియేమొ
కళంకము, నిచ్చకాలనన్
దిన్నగ నిట యుండుము గదే!
గిరి కవ్వము దూసి చన్న నీ
యున్నవ మచ్చ నెవ్వరెటులాడి

నమున్ మనకేమిలే సఖా!'— కవి చంద్రుణ్ణి సంబోధించి, వెన్నుని కున్న మచ్చను స్తుతించి నీ మచ్చను కళంకమని జనం చెప్తున్నారు. నీలోనున్నది కళంకము కాదు. సముద్ర మథన సమయంలో గిరి కవ్వము దూసుకొనిపోయిన మచ్చ ఇది. ఎవరేమనుకుంటే మనకేమిలే'— అని చెప్తున్నాడు. నిజానికి ఈ పద్యంలోని వూహ పూర్తిగా కవి స్వంతంకాదు. కువలయానందంలో అపహ్నుత్యలంకారాని కిచ్చిన ఈ ఉదాహరణ శ్లోకాన్ని చూస్తే ఆ విషయం తెలుస్తుంది.

"మంథాన భూమి ధర మూల శిలా సహస్ర
సంఘట్టన వ్రణకిణాః స్ఫురతీందు మధ్యే
ఛాయా మృగః శశక ఇత్యతి పామరోక్తి

స్తేషాం కథం చిదపి తత్రహి న ప్రసక్తిః — ఈ శ్లోకాన్ని దృష్టిలో పెట్టుకొని కవి పై పద్యాన్ని కల్పించి ఉంటాడు. శ్లోకంలోని పూర్వార్థం పద్యంలో ఉత్తరార్థంగా మారింది. శ్లోకంలోని ఉత్తరార్థాన్ని కవి పూర్తిగా మార్చడం జరిగింది. కాగా అనుసరణ అంత రసవంతంగా కొనసాగలేదని అనిపిస్తుంది. "మంథాన భూమి ధరమూల శిలాసహస్ర సంఘట్టన వ్రణకిణాః' అనే మూలంలోని భావ తీవ్రత 'గిరి కవ్వము దూసి చన్న నీ యున్నవ మచ్చ' అనడంలో తేలిపోతూంది. 'ఇచ్చకాలనన్ దిన్నగ నిట్ల యుండుము గదే!' అనే స్థలంలో 'తిన్నగ' అనే పదానికి ప్రాస తప్ప పరమార్థంలేదు. శ్లోకంలోని ఛాయా, మృగః, శశకః అనే మూడు పదాలకు బదులుగా పద్యంలో 'వెన్నుని కున్న మచ్చ యరవిందము, రత్నము, భోగి లక్షణము' అని ఊహించడం జరిగింది. మూలంలోని 'అతిపామరోక్తిః' అనే భావనకు బదులుగా కవి "ఇచ్చకాలనన్ దిన్నగ నిట్ల యుండుమ గదే!' అని వ్రాయడం జరిగింది. 'ఎవ్వరెటులాడినమున్ మనకేమిలే సఖా!' అనే చోట గల సముచ్చయం, గతికి అవరోధంగా, ప్రయోజనశూన్యంగా కనిపిస్తుంది. మొత్తంమీద శ్లోకాన్ని—పద్యాన్ని పరిశీలించిన తరువాత గౌరవంతో తాను అనుసరించిన భావాన్ని అనుసరణగా రూపించకుండా గోపనం చేయడానికి కవి ప్రయత్నించిన తీరు విశదమవుతూంది. ఇది మాధ్యమిక స్థితి.

ఒక్కొక్క కవి తాను మనసారా మెచ్చుకొన్న పద్యాన్ని ఎత్తుగడ, గమనము, ముగింపులలో ఈషణ్మాత్రమైనా భేదాన్ని చూపకుండా, స్వచ్ఛందంగ

అనుసరిస్తాడు. అందుకు అనువైన సన్నివేశం కోసం నిరీక్షిస్తూ ఉంటాడు. పూర్వ సాహిత్యంలో ఒక అక్క చెడు నడత గలిగిన తన తమ్ముణ్ణి ఇలా మందలించింది.

"నాదు సహోదరుండు మజనస్తవనీయ నయప్రసక్తి బ్ర
హ్మాదుల మెచ్చఁ జేసతని యజ్ఞమునం గడుఁ బూజ్యురాలనై
వేది యలంకరింతునని వేపురి లోపల నాడికొందు నీ
కేదియు లేక సర్వగుణ హీనుఁడ వౌట యెఱుంగఁ దమ్ముడా!"

ఆధునిక సాహిత్యంలో ఒక అన్న—శృంగార జలధిలో మునుకలు వేస్తున్న తమ్ముణ్ణి భవుద్ధ ధర్మంవేపు మరలించాలనుకుంటూ ఇలా అంటాడు.

"నా తమ్ముండు దయాపయోధి, శ్రితచింతారత్న, మాపన్న ర
క్షాతాత్పర్యుడు, బౌద్ధ ధర్మలతికన్ సాకంగలాడంచు నే
చేతఃప్రీతిగ నెంచికొందు గద యుస్సీ! పుష్పబాణాగమా
ధ్యేతృ ప్రాథమికుండవై, తిరుగఁ జన్నే నీ కిటుల్ సోదరా!"— ఈ పద్యంలోని ఎత్తుగడ, గమనము, ముగింపు— వీసం పొల్లు పోకుండా పూర్వ పద్యాన్ని అనుసరించడం జరిగింది 'పుష్పబాణాగమాధ్యేతృ ప్రాథమికుడు' 'కామ శాస్త్రోపాధ్యాయి'ని జ్ఞాపకం చేస్తాడు ఈ అనుసరణకు కారణం కేవలం గౌరవమే అనడానికి సందేహించనక్కరలేదు. కాని తనకుండే గౌరవం ఎలాటిదైనా ఈ విధమైన అనుసరణ కవిప్రజ్ఞను కించపరుసు ంది.

సమకాలీన ఆలోచనా ధోరణి (**Contemporary thought**) అనుసరణకు గల ప్రధాన కారణాలలో ఒకటిగా కనిపిస్తుంది. ఇది ఒక్క కవిత్వంలోనే గాక ఇతర కళలలోను, లౌకిక వ్యవహారాలలోను కనిపిస్తుంది. దీనినే మనవారు యుగధర్మం అన్నారు. ఒక యుగంలో ఐతిహాసికానువాదం, ఒక యుగంలో పురాణ ప్రబంధాలను వ్రాయడం, ఒక యుగంలో ప్రబంధ రచన కొనసాగించడం, ఒక యుగంలో లఘు ప్రబంధ నిర్మాణం వైపు దృష్టి మళ్లించడం— ఇలా ఆలోచిస్తూ పోతూ ఉంటే ఒక్కొక్క కాలంలో ఒక ప్రత్యేక సాహితీప్రక్రియ పరంపరగా కొనసాగడానికి అనుసరణ కారణమనిపిస్తుంది. ఒక సాహితీ ప్రక్రియ ఒక ప్రత్యేక సమయంలో వెల్లువలా విరుచుకు పడడం సామాన్య విషయంగా గ్రహించినా— సామూహిక చర్యగా అంగీకరించినా— వైయక్తిక లక్షణాలైన శైలీ విన్యాసము, భావనా ధోరణి, వర్ణనా ఫణితి మొదలైన విషయాలలో కూడా ఇంచుమించుగా సమకాలీనులైన కవులు ఒకరిని పోలి ఒకరు వ్రాయడం కొంత ఆశ్చర్యమనిపిస్తుంది. ఉదాహరణగా శ్రీనాథ యుగంలోని ఒక వర్ణనను గ్రహించి చూద్దాం.

శ్రీనాథుడు సింగనమంత్రి కీర్తిని వర్ణిస్తూ —

"గగన కల్లోలినీ కల్లోల మాలికా
హల్లీసకములతో సవఘళించి
చరమ సంధ్యాకాల సంఫుల్ల మల్లికా
స్తబక పంక్తుల తోడ సరసమాడి
శరదాగ మారంభ సంపూర్ణపూర్ణిమా
విమల చంద్రికలతో వియ్యమంది" (శృం. నై)—

ఇత్యాదిగా వ్రాస్తాడు. అన్నయమంత్రి కీర్తిని వర్ణిస్తూ —

"ముక్కంటి దరహాసంబున కనుప్రాసంబు
మిన్నేటి నీటికి మిక్కుటంబు
శారదజ్యోత్స్నా ప్రసాదంబునకు వీప్స
నలువ శుద్ధాంతంబున కను భాష" (భీమ)—

ఇత్యాదిగా వ్రాస్తాడు. పోతన శారద ఆకారాన్ని వర్ణిస్తూ —

"శారద నీరదేందు ఘనసార పటీరమరాళ మల్లికా
హార తుషార ఫేన రజతాచల కాశఫణీశ కుందమం
దారసుధాపయోధి సితతామర సామర వాహినీ శుభా
కారత" (భాగ) అంటాడు. "అంబ నవాంబుజోజ్జ్వల కరాంబుజ శారద చంద్ర చంద్రికాడంబర చారుమూర్తి" — అంటూ వర్ణిస్తాడు.

కొఱవి గోపరాజు శివుణ్ణి వర్ణిస్తూ —

"కాశాబ్జ మల్లికా కలికా శారద నీరదేందు కైరవ హంసా
కాశాపగాంబు హిమసంకాశాంగ వికాసిత ప్రకాశు గిరీశున్" (సిం. ద్వా) అంటాడు.

అనంతుడు "వేలుపుటేటి ఫేనములు, వెన్నుని పాక్కటి తమ్మిరేకులు" అంటూ దేనినో వర్ణించడం ప్రారంభిస్తాడు.

గౌరన కీర్తిని గూర్చి చెప్తూ "శారద చందన శారదాంభోద మల్లికా కర్పూర మాలికా యశుని" అంటాడు.

ఈ విధమైనదే వేరొక వర్ణనను కూడా గ్రహించవచ్చును.

(1) "పూర్వ సంధ్యాంగనా ఫాల భాగంబున జెలువారు సింధూర తిలకమనఁగ
వైసేసి పురుహూతు గారాబుటిల్లాలు పట్టిన రత్న దర్పణ మనంగ"
(శ్రీనాథుడు)

(2) "ప్రాచీవధూటికాఫాలభాగంబున పెట్టిన కెంపుల బొట్టనంగ"
"అపరాబ్ధిఁ గ్రీడించు నంబర స్త్రీ యొద్ద నిద్దమౌ కుంకుమ ముద్ద యనఁగ" (కొఱవి గోపరాజు)

(3) 'అపర దిక్కామిని యమరంగఁ గనుగొను పద్మరాగంపు దర్పణమనంగ
పశ్చిమ దిక్కాంత ఫాల భాగంబును బొలుపొందు జేగురు బొట్టనంగ'
"కైసేసి పూర్వదిక్కామినీ మణి మాచు పద్మరాగంపు దర్పణమనంగ"
(జక్కన)

(4) "కమనీయసురన భాగార మధ్యమునకు దీపించు మాణిక్యదీపమనఁగ
"శృంగారసరసి రాజీవకాననమున విచ్చిన కనకారవింద్రమనఁగ"
(పిల్లలమర్రి)

దిగ్గంతులైన కవులంతా ఈ విధంగా ఒకరిని పోలి ఒకరు వ్రాయడం యుగధర్మంగా గ్రహించి ఆదరించాలో, వర్ణనా వ్యామోహంలోపడి భావ దాస్యానికి పాల్పడ్డారని అనుకోవాలో అర్థంకాదు. ఏది ఏమైనా ఈ ధోరణి తెలుగ

సాహిత్యమంతటా కనిపిస్తుంది ప్రతిభావంతుడైన వాడొకడు కొత్త పుంత తొక్కగానే మిగిలినవారంతా నిస్సంకోచంగా ఆ త్రోవలో సాగిపోతున్నారు. మరొక ప్రతిభావంతుడు అవతరించినాడు యుగం మారుతూంది. సాహిత్య గతి మారుతూంది.

అనుసరణను ప్రోత్సహించే మరొక గుణం వ్యామోహం. ఒక కవి అవలంబించిన ప్రత్యేక పద్ధతి మీద మోజుపడి ఇతరులు దానిని అనుసరించడం జరుగుతుంది. శ్లేష కావ్యాలు, ద్వ్యర్థి—త్ర్యర్థి— చతురర్థి కావ్యాలు, అచ్చ తెనుఁగు కావ్యాలు— మొదలైన రచనలీ కోవకు చెందుతాయి. కేవల వ్యామోహంతో కూడిన అనుసరణ చేయి తిరిగిన కవులను కూడా పెడత్రోవ పట్టిస్తుంది.

"దత్తాంశాలను పరిశీలించండి
చిన్న చిన్న చీమలూ ఏగ్జైరా
అడుగు భుజం అనుకోండి
బలవంతమైన సర్పం
గ్రటా ఎట్‌సెట్రా
అడుగు భుజం ఉత్పత్తి చేసే
ఆహారం మీద ఆధారపడ్డం వల్ల
లంబం అవదా మరి?
ఈ భుజాల
పరస్పర సంఘర్షణ ఫలితం
కర్ణం మీది చతురస్రం
అవునా? సరి
ఈ చతురస్రపు వైశాల్యం
ఇ జీ క్వ ల్టూ
రెండు విభిన్న భుజాలపై
గల చతురస్రాలలోని తమిస్రం
థిసిస్ యాంటీ థిసిస్‌ల మిశ్రం
రెండు భిన్న పక్ష సంజ్ఞల పోరాటం
అవగా ఒక నూతన అవస్థ
ఒక పునీత వ్యవస్థ
అవి ఉపపాద్యం."

పైథాగరస్ థిరం తీరానికి తీసుకెళ్ల గలదనుకున్న అభ్యుదయకవి ఆకారేఖాగణితం ద్వారా, అభ్యుదయ బీజ గణితం ద్వారా సమస్యను పరిష్కరించబూనుకోవడం ఇక్కడ కనిపిస్తుంది. సిద్ధాంతాన్ని ఋజువు చెయ్యడంలో దత్తాంశం, ఉపపాద్యం, నిర్మాణక్రమం ఇత్యాదిగా విభజన జరుగుతుంది. పైథాగరస్ సిద్ధాంతం 'లంబకోణ త్రిభుజంలో కర్ణము మీది చతురస్ర వైశాల్యం మిగిలిన భుజాల మీది చతురస్రాల వైశాల్యాల మొత్తానికి సమానం' అని చెప్తుంది. అందుచేత దీనికి దత్తాంశం ఒక త్రిభుజం లంబకోణ త్రిభుజం కావడం. ఉపపాద్యం కర్ణంమీది చతురస్రం మిగిలిన భుజాలమీది చతురస్రాల మొత్తానికి సమానం అనేది. ఇదే విషయాన్ని కవి సామ్యవాదానికి చక్కగా అన్వయించాడు. ఈ పద్ధతి చేత ప్రభావితుడై ఇదే విధంగా గణిత శాస్త్ర సంకేతాల ద్వారా అభిప్రాయ ప్రకటన చెయ్యాలనే వ్యామోహం మరొక కవి వ్రాసిన ఈ క్రింది రచనలో కనిపిస్తుంది.

"ఆదర్శాల ధనరాసిలో తారతమ్యాల ఋణరాసి తీసేసి
రెండు రెట్లైన ఫలితాల గిడ్డంగులు పంచుతాను
జగతిమూల మూలల జనాభా నా భాజకం
అణచేస్తాను నిమ్నోన్నతాల అరాజకం
వివిధ వర్గాల ధృవ రేఖలు కలిసిన బిందువు మీద
నా పాటల అర్థాలు వ్యాసంగా
నవలోక వృత్తాలు గీస్తాను"— ఇక్కడ కనబడే ప్రధానమైన లోపం ఇందులోని చరణాల మధ్య ఐక్యత లేకపోవడం బావం ఎక్కడి కక్కడ తెగిపోతుంది. అప్పు - డన్వయం కోసం చూస్తే అన్నీ సందేహాలే! ధనరాసి లోంచి ఋణరాసిని తీసేస్తే ఫలితాలు రెండు రెట్లు కాగలవా? కవి పంచే గిడ్డంగు లేవి? జనాభా భాజకమైతే విభాజ్యమేది? భాగించేవారు జనమైతే భోగించే దెవరు? గణిత శాస్త్ర సంకేతాలతో కూడిన చరణాల మధ్య 'అణచేస్తాను నిమ్నోన్నతాల అరాజకం' అనే చరణం ఏ విధంగా ఇమడగలదు? వివిధ వర్గాలంటే ఏవి? ధృవ రేఖలు కలసిన బిందువు మీద వృత్త నిర్మాణం సాగుతుందా? — ఈ విధమయిన ఆలోచన ఫలితంగా ఇటు బీజగణితంతోగాని, అటు రేఖా గణితంతోగాని చక్కగా సమన్వయించే పోలికతో ఈ కవిత్వం ఆవిర్భవించలేకపోయిందని గ్రహించవచ్చును కవి తనకున్న గణిత పరిజ్ఞానంతో, సామ్యవాద సిద్ధాంతాలను సమన్వయించబోయి అవస్థపాలైన సంఘటన ఇది విషయ పరిజ్ఞానంతో కాక వ్యామోహంతో కూడిన అనుసరణ ఈ విధంగా విరసంగా ఉంటుంది.

గౌరవం, సమకాలీనత, వ్యామోహం— అనే వానివల్ల కాకుండా ఒక ప్రత్యేక ప్రయోజన సాధన కోసం కూడా అనుసరించడం జరుగుతుంది. ముఖ్యంగా ఇది పేరడీ కవిత్వంలో హెచ్చు ఉదాహరణకు— ఒక కవి సంఘ సంస్కరణను దృష్టిలో పెట్టుకొని సందేశాత్మకంగా ఒక కవిత వ్రాస్తాడు. అది బహుళ ప్రచారంలోకి వస్తుంది. జనం దాన్ని పదే పదే స్మరిస్తారు. కాని కాలం గడుస్తున్నకొద్దీ తన కవిత ద్వారా ఏ సంస్కరణనైతే కోరేడో అది చేకూరకపోగా, సాంఘిక స్థితి మరింత అధ్వాన్నంగా తయారవుతుంది అంటే ఆ కవి సందేశం వ్యర్థమయిందన్నమాట ఆ సందర్భంలో సన్నిహితమయిన హాస్య ధోరణిలో సంఘానికి చురకపెడుతూ ఆ కవిని అనుసరించే కవిత వస్తుంది అది జనానికి తాము విస్మరించిన కర్తవ్యాన్ని జ్ఞప్తికి తెస్తుంది 'దేశభక్తి' అనే గేయం.

"దేశమును ప్రేమించుమన్నా
మంచి యన్నది పెంచుమన్నా
ఒట్టి మాటలు కట్టిపెట్టోయ్

గట్టి మేల్ తలపెట్టవోయ్"— అని చెప్పింది ఆ గేయం జనం నాలుకలో నలిగింది అంతా దానిని ఆమోదించేరు కాని ఆ కవిత వ్రాయబడి శతాబ్దాలు గడచినా నేటి సాంఘిక పరిస్థితి ఎంతో దుర్భరంగా తయా

రంసింది అంటే ఆ కవితలోని ప్రబోధాన్ని ప్రజలు పెడచెవిని పెట్టారన్న మాటల విషయాన్ని జ్ఞప్తికి తెస్తూ "ద్వేష భక్తి" అనే వ్యంగ్య రచన వెలువడింది. ఆ కవి

"ద్వేషమును ప్రేమించుమన్నా
మంచి యన్నది త్రుంచుమన్నా
గట్టి మాటలు చెప్పవలెనోయ్

పొట్టి మేల్ తలపెట్టవోయ్" — అంటాడు ఇక్కడ కవి చెప్పదలచిందంతా అతని ఆదర్శంకాదు సాంఘిక ఆవరణలలో నిలిచిన సత్యం. తన జాతి అభ్యుదయానికి మేలుకొలుపులు పాడిన కవి ప్రబోధాన్ని వమ్ముచేసిన జనం గుండెల్లోకి విసిరిన వెంత్తని కత్తులు పై చరణాల్లో తళతళలాడుతున్నాయి. అంటే ఇది ప్రయోజనంతో కూడిన అనుసరణ కాగలదు. ఇటువంటి వ్యంగ్యం లేకపోయినా బాగా ప్రచారంలోకి వచ్చిన పూర్వ కవి రచనను అనుసరించడం ద్వారా తన ప్రయోజనాన్ని నెరవేర్చుకోవాలనే పద్ధతి కూడా కనిపిస్తుంది.

భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగ దూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు

పితుకుచున్నారు మూతులు బిగియగట్టి" — అనే పద్యం జాతీయోద్యమ కాలంలో మంచి ప్రచారంలోకి వచ్చింది. ఆంగ్లేయుల దోపిడీ విధానాన్ని నిరసిస్తూ, భారత జాతీయ వాదాన్ని ప్రోత్సహిస్తూ వ్రాయబడిన ఈ పద్యం ఎందరికో స్ఫూర్తి నిచ్చింది. ఒక అభ్యుదయ పాఠకుడు దీన్ని అనుసరించడం జరిగింది.

"భరతఖండము నేడొక వంటశాల
వండుచున్నాము తీయని పిండి వంట
విందు దినుసులోన వో వెర్రివాడ

వేయకలదయ్య చాటుగా విషపు బొట్టు" — ఈ అనుసరణలో వ్యంగ్యం ... ఉండకపోయింటే వ్యంగ్య ధోరణంతా లభించేది ... వ్రాయడం ... కని పించింది కాని ... విధమైన అభిప్రాయం ఉన్నట్లు దాఖలా లేదు ... బాగా ఎరిగిన పద్యపు ఛాయలలో ... భావాన్ని నడిపిస్తే వేగంగా వారి గుండె కెక్కుతుందనే అభిప్రాయం స్పష్టంగా కనిపిస్తుంది. ఇక్కడ కవి ఉద్దేశించిన పిండి వంట సామ్యవాదం. ఆ పిండి వంటను విషపూరితం చేయవద్దని కవి సందేశం. అందుచేత నిది ప్రయోజనంతో కూడిన అనుసరణ అయింది. ఆధునికులలో కొన్ని నిర్దిష్ట స్థలాలలో పూర్వులను అనుసరించడమే గాక చరణాలకు చరణాలే వాడుకోవడం కూడా ఒక టెక్నిక్‌గా భావించే వారున్నారు. "టి. యస్. ఇలియెట్ అంతటి కవి, తన కావ్యాలలో పూర్వ కవుల కావ్యాలలోని చరణాలకు చరణాలే వాడుకున్నారు. అది ఒక టెక్నిక్"
(రమణారెడ్డి . కారు చీకట్లో కాంతి రేఖలు)

ఒక్కొక్క చోట కవి తనకు తెలియకుండా పూర్వులనుగాని, సమకాలికులను గాని అనుసరించడం జరుగుతుంది. అందుకు సాహిత్యంపై వారికుండే ప్రభుత కారణంగా వూహించడం జరుగుతూంది. పూర్వకవులలో శ్రీనాథుడి కోవకు చెందినకవి శ్రీనాథునిరచనలలో బాణుడు, మయూరుడు మొదలైన సంస్కృత కవుల రచనల రచనలలోనిభాగాలు యథాతథంగా దొర్లిపోతూ ఉంటాయి. కథా సందర్భాలను బట్టి నన్నయాదుల రచనలు కూడా తొడవులు మార్చుకుని కనిపిస్తాయి. కొందరు విమర్శకులీ విషయాన్ని అప్రయత్న సాధిత చర్యగా భావించినా నావంటి వాళ్లకొక సందేహం కలుగుతుంది. శ్రీనాథుని రచనలలో కొన్ని— ముఖ్యంగా హర విలాసం— ధన సంపాదన కోసం— తొందరగా వ్రాసినట్లు కనిపిస్తుంది. అందుచేత తాను వేరుగా ఆలోచన సాగించేటంతటి తాలిమి లేక తన జిహ్వాగ్రం మీద అనునిత్యం తుళ్లింతలాడే పూర్వ కవుల రచనలలోని భాగాలను, భావాలను సమయానుకూలంగా ఉపయోగించుకున్నాడనిపిస్తుంది. ఇది కేవలం ఒక వూహ మాత్రమే. ఇక ఆధునికులైన అభ్యుదయ కవులు కొందరి రచనలలో నిర్దుష్టమైన ప్రబంధ పదజాలం, సాంప్రదాయిక కల్పనలు చోటు చేసుకోటం వారు గుర్తించలేని అనుసరణ అని అనక తప్పదు. ఆధునిక కవులమనుకున్నవారు పూర్వ కవులను అనుసరించిన తీరు కవిత్వం వ్రాయడంలో కవియొక్క అంతశ్చేతనకుండే ప్రాధాన్యాన్ని విశదం చేస్తుంది.

"ఈ కెలన శరత్పూర్ణిమా వృత శశాంక
లలిత రోచిర్వితాన, మాకెలన ఘోర
ఘనతరాంధకారచ్ఛటా క్రాంత భూమి

అందు సగ మిందు సగముంటి నౌర! నేను" — ఈ పద్యంలో ఒక విధమైన ద్వైధీ భావనకు లోనైన వ్యక్తి సంఘర్షణలో పతమతమవుతూ ఎటూ తేల్చుకోలేని స్థితి వ్యక్తం చేయబడింది.

"అటు చూస్తే అప్పులవాళ్ళు
ఇటు చూస్తే పిల్లల ఆకలి
సముద్రమున పడిపోవడమో
ఉరిపోసుకు చనిపోవడమో

సమస్యగా ఘనీభవించిందొక సంసారికి" — పై పద్యంలో సుఖము—దుఃఖము కన్పిస్తాయి. ఇందులో కేవలం దుఃఖం మాత్రమే కన్పిస్తుంది. మిగిలినదంతా ఒకటే. ఇదెలా సంభవం? పరస్పర విరుద్ధమైన లక్ష్యాలు గల ఇద్దరు ప్రతిభావంతులలో ఒకరినొకరు ఉద్దేశపూర్వకంగా అనుసరించేరని అనగలమా? అందుకే ఒక్కొక్క సమయంలో కవికి తెలియకుండానే అనుసరణ కొనసాగుతుందని అనుకోవలసి వస్తుంది. ఇటువంటి స్థలాలలో కవి అంతశ్చేతన బయటపడుతుంది.

నూతన భావ కల్పనకు శక్తిగాని, శ్రద్ధగాని లేకపోవడం చేత మాత్రమే కొనసాగే అనుసరణ ఒక్కొక్క పద్యాన్ని మేడిపండులా తయారు చేస్తుంది. పద్యాన్ని చదవడం ప్రారంభిస్తే ధారాపాతంగా సాగిపోతుంది. లలితమైన కల్పన చూస్తే మనసు మోహపడుతుంది. సమాన చాలనము, రస వ్యక్తీకరణ మొదలైన ఆలంకారిక సామగ్రి అంతా మనకు లభిస్తుంది. కాని అది కేవలం ప్రతి

ంబనే కాని మూరి కాదని తెలిపోయేసరికి ఉత్సాహం నీరుకారిపోతుంది. ఈ క్రింది పద్యం అలాంటిది.

“నీ నామామృత సేవకు న్మరగనే
నిన్ మానవుం డన్యమున్
నం గోరడు సుమ్ము మానస సరో
వాటిక వాకాదనే
వ్యాపీతంబగు రాజహంస మది గాం
చం గోరునే వత్తలన్
కూవీంద్రార్చిత పాదపద్మ! యలమే
ల్మంగా మనోనాయకా!”

ఇది ఏ పద్యానికి ప్రతిబింబమో తెలుగు సారస్వత విద్యార్థికి చెప్పనక్కరలేదు. అదే ఈ పద్యం పౌక్కస్థాయిని నిర్ణయిస్తుంది. ఇటువంటి రచనలు ఎన్నో ఉన్నాయి. వాటిని దృష్టిలో పెట్టుకొని రాజశేఖరుడు “కవేరకవిత్వదాయా సర్వథా ప్రతిబింబకల్పః పరిహరణీయః” అన్నాడు.

అనుసరణకు దారితీసే కొన్ని కారణాలను హేతుబద్ధంగా నిరూపణ చేసే ప్రయత్నం ఈ వ్యాసంలో జరిగింది. ఇందులోని ఔచిత్యాన్ని సహృదయులు నిర్ణయించగలరు. ఫలితార్థమేమంటే అనుసరణకు లోనుకాని కవులు అరుదు. వారి కవిత్వం మాత్రమే అనుసరణ యోగ్యమైనది.

“శబ్దార్థ శాసనవిదః కతి నో కవంతే
యద్వాఙ్మయం శ్రుతిధనస్య చకాస్తి చక్షుః
కిం త్వస్తి యద్వచసి వస్తు నవం సదుక్తి
సందర్భిణాం సధురిణః తస్యగిరః పవిత్రాః

—రాజశేఖరుడు

---



# ప్రభాతము

## శ్రీ పోతుకూచి సాంబశివరావు

ఇది ప్రభాతము వేళ
ఉషఃకాంత కదలి
తన కాంతి చుంబనల కదల్చి
నవజీవన రాగములు తొణికించువేళ
చిరు పసి వెలుగులు
జీవన వృక్ష పత్రముల
క్రొత్త కదలికలు పుట్టు వేళ
బరువు బాధల వాలి సోలిన మనసు
తమసులు ఛేదించు వేళ
ఇది ప్రభాతము వేళ
ఇనుడు తన కర కిరణాల
భువిని తన తొలి వెలుగుల
నూత్న చిత్రముగ తీర్చి దిద్దెడి వేళ
సర్వ జీవజాలము
చైతన్య స్రవంతిని ప్రసరించువేళ
ఇది ప్రభాతము వేళ—
క్రొత్త వెలుగులు పాల నురగలో యున
బాల లుయ్యాల లాడుకొనెడివేళ
పసి మనసుల వెలుగు కన్నెలు
దిన మొలలతో నవ్వుల
యౌవన కలలు కనెడి వేళ
ఒడల బడలికలు వదలక
ప్రేయులు గాఢపరిష్వంగముల
విడి విడక బాధ పడెడువేళ
వయసు జారిన వృద్ధులు
తమ పరమ దండిసెలు
తెలుసుకొనెడు వేళ
ఇది ప్రభాతము వేళ
బంగరు కాంతుల పంట చేల
పచ్చని తివాసీలపై
ప్రకృతి కాంత సొగసుల పయనించువేళ
ఆనంద మధు సమన్విత మెరుపు
మంచు పన్నీరులో తానమాడుచు
పువ్వు జవ్వనులు నవ్వులు రువ్వువేళ
తరుణ తలిరెకుల దీపహారతిపట్టి
జగము నగవులు చిలికి, క్రొత్త నర్తనల నడిచి,
దేవదేవుని భక్తితో కీర్తించువేళ
ఇది ప్రభాతము వేళ
సర్వమును మరిచి
సరిక్రొత్త లోకమును చూచి
విద్యుదుత్తుంగ జీవన కల్పనా
తరంగముల కదలి
మనసు వేగము దాటి
మహిత శక్తిని పొంది
ఆత్మజ్యోతిని నిలిపి
అమర గండము పట్టి
నేను పూని నవభావ నర్తనా
విశ్వరాగ మాలపించువేళ
మదీయ కవితా దివ్య
సమారాధనవేళ
ఇది ప్రభాతము వేళ

న్నాల్నీ, ముద్దుమురిపాలతో అలరించే దాసదాసీ జనాన్ని, సకల భోగభాగ్యాల్నీ వదలి పెట్టి— రామచిలుక ఎందుకు పారిపోయింది? దేనికోసం? పాపం, ఈ కోడిపిల్లకు 'అది' కావాలని వుండదూ? ఇలా కాలికి తాడేసికట్టి పడెయ్యడం అన్యాయం కదూ ?

వాడు దానికి గింజలు వేసేవాడు. తింటున్న అన్నంలోంచి కొన్నిమెతుకులు దానిముందరవేసి, అది గబాగబాతింటుంటే, తాను తినడం మరిచిపోయి చూస్తూ నిలబడేవాడు. మంచం మీద కూర్చుని, దాన్ని తన ఒడిలో కూర్చోబెట్టుకుని, రాయంచకు అభయ మిచ్చిన బాలగౌతముడిలా రెక్కలు నిమిరేవాడు.

మొదటిరోజు, కోడిపిల్ల మనుష్యుల్నిచూచి బెదరి, కీచుకీచు మంటూ గల్లంతు చేసేది. కట్టుత్రాడుతో అడ్డదిడ్డంగా ఎగిరి,బోర్లపడేది. దాని కంగారు తగ్గటానికి ఒక రోజు పట్టింది.

గాంధీ దాన్ని తన ఒడిలో పెట్టుకున్నప్పుడు అది వాడికళ్ళలోకి విశ్చలంగా చూసేది. ఆ గాజు కళ్ళలోని చూపులకు అర్థమేమిటో ఎవరికి తెలుసు? అయితే, గాంధీ ఆ చూపులకు కదలిపోయేవాడు. 'నువ్వు, మీ అమ్మ, మీనాన్న కలిసి నా గొంతు కోసేస్తారు కదూ?'అని అది దిగులుగా అడుగు తున్నట్టు, 'బాబ్బాబూ! నీకు పుణ్యం వుంటుంది. నన్ను విడిచిపెట్టేయరాదూ ? ఏ అడవికైనా పారిపోయి స్వేచ్ఛగా తలదాచుకుంటాను'అని జాలిగా వేడుకుంటున్నట్టు అనిపించేది వాడికి.

ఆఖరికి ఒక నిర్ణయానికి వచ్చాడు గాంధీ. రోజూ పెందరాలే నిద్రపోయేవాడు, గతరాత్రి అందరూ నిద్రపోయేదాకా మేలుకున్నాడు. చప్పుడు గాకుండా దొడ్లోకి వెళ్ళాడు. గంపతిరగేశాడు. కోడికాలికున్న దారాన్ని విప్పేశాడు. కోడిని రెండు చేతులతో పైకెత్తి, దొడ్డిగోడకు అవతల విసిరేశాడు. పిల్లిలా నడిచివెళ్ళి గప్‌చిప్‌మంటూముసుగు తన్నాడు. హాయిగా నిద్రపోయాడు.

ఉదయం మెలుకువ వచ్చింది మెలుకువతోబాటు కోడిపిల్ల జ్ఞప్తికి వచ్చింది. పడక మీదినుంచి లేవడానికి భయం వేసింది గాంధీకి. గబుక్కున ముఖం మీద మళ్ళీ ముసుగేసుకున్నాడు.

అమ్మకేకలు చెవిని బడతాయని ఎదురుచూస్తున్న గాంధీకి —దొడ్లో కోడిపిల్ల అరవులు వినిపించాయి. వాడికి ఆశ్చర్యం వేసింది. గబుక్కున ముసుగు తీసి, చెవులు రిక్కించాడు. ఆ అరవులు దానివేనా?. . . .గాంధీ దొడ్లోకి పరుగు తీశాడు.

తులసికోట ప్రక్కనే —కోడిపిల్ల గింజలు ఏరి తింటోంది.

నూతివద్ద నీళ్ళు తోడుతున్న తల్లిని అడిగాడు వాడు. 'అమ్మా! ఆ కోడిపిల్ల మనదేనా ?'

'అవునురా! ముమ్మాటికీ ముమ్మూర్తులా మనదే! అది ఎంత గొడవ చేసిందో తెలుసా ? తెల్లారేసరికి కట్టుతాడు విప్పుకొంది, గంపతిరగేసేసింది. గంప పైకెత్తి దాన్ని బయటికి తీద్దామని దగ్గరికి వెళితే, గంప తిరగబడి వుంది. గంపపక్కనేకోడి పిల్ల ముడుచుకుని వుంది' అంటూ నవ్విందామె.

గాంధీ ఈ కథ చెప్పి, ఏదో తమాషా చెప్పి ముగించినంత ఉత్సాహంగా నవ్వాడు.

'నువ్వు కోడిపిల్లను తరిమేసిన సంగతి మీ అమ్మకు చెప్పావా?' అని అడిగాను.

చెప్పానండీ! 'అరి బడుద్దాయ్!' అంటూ నవ్వింది "తింటానికితిండీ, ముడుక్కోటానికి గూడూ, హాయిగా తిరగటానికి మైదానమంతదొడ్డీ. . .ఇవన్నీ ఒదలిపెట్టి వెళ్ళిపోయేంత తెలివితక్కువది కాదులేరా ఈ కోడిపిల్ల. . .' అంది మేష్టారూ!'

. . . .నా ఆలోచనలకు అంతరాయంగా "పాట ఒప్పజెప్పమంటారా మేష్టారుగారూ ?' అన్నాడు గాంధీ.

'తరువాత చెబుదూగానీలే, కూర్చో!' అన్నాను.

ఒక నిమిషంపాటు ఆలోచనల వెంట పరుగెత్తి నన్నునేను మరచిపోయాను. పిల్లలు —చీమచిటుక్కుమంటే వినిపించేంత నిశ్శబ్దంగా వున్నారో, లేక చెవులు చిల్లులు పడేట్లుగా గోలచేస్తున్నారో నాకు తెలియ లేదు.

పంజరంలో చిలకకు బందీ అని పేరు పెట్టింది మనమేకదా? తాను బందీఅని చిలక బాధపడుతుందా? అక్కరు చేతిమీద కూర్చున్న పెంపుడు చిలక ఆకాశపుటంచులకు ఎగిరిపోతుందా?నేను చెప్పిన రామచిలుక సర్వస్వమూ వదులుకుని, నిజంగా పారిపోయిందా?. . . .అవన్నీ కథలు! కథ గుంత్రాయిలాంటిది! ఎటు తిప్పితే అటు దొర్లుతుంది.

గాంధీ చెప్పింది కథకాదు, వాస్తవం!

ఆ కోడిపిల్ల పీక కత్తి అంచున వుందన్న మాట నిజం. అయితే ఆ విషయం దానికి తెలుసునా, తెలియదా అన్నదికాదు ప్రశ్న. ఎన్నిజన్మలైనా, ఎన్ని ప్రాణాలైనా సంతోషంగా ధారపోసి సంపాదించదగిన స్వేచ్ఛను —ఆ కోడిపిల్ల ఎందుకు కాలదన్నేసింది? దాని స్వేచ్ఛకోసం తహతహలాడిపోయిన గాంధీని యింత గమ్మత్తుగా ఎందుకు వెక్కిరించింది? అలవాటైన పరిస్థితులతోనే తన బ్రతుకును ఎందుకు సర్దుకునేసింది? స్వేచ్ఛకంటే ఎక్కువగా దాని విశ్వాసాన్ని చూరగొనగలిగినదీ, స్వేచ్ఛ యివ్వలేని సంతృప్తిని దానికి యిచ్చినట్టుంటిదీ ఏది? దాని పేరేమి ?

---

# శ్రీ ధర్మపురి లక్ష్మీనరసింహస్వామి క్షేత్రము

శ్రీ శ్రీధర్మపురిక్షేత్రము గోదావరితీరమునందు కరీంనగర్ జిల్లాలో జగ ద్విఖ్యాతిమై వెలుగొందుతోంది హైదరాబాదు నగరానికి ఈ క్షేత్రం 142 మైళ్ళు. రోజూ బస్సులు వెడుతాయి. మంచిర్యాల రైల్వేస్టేషన్‌లో దిగి కూడా యాత్రికులు వెడుతూ ఉంటారు. ఇచ్చటి క్షేత్రాధిదైవతము శ్రీ లక్ష్మీనరసింహస్వామి. ఇక్కడ గోదావరి దక్షిణ వాహిని. స్వామిసేవలో సంతతము నిమగ్నమై జీవితాలను ధన్యం చేసుకొన్న మహాపండితులైన బ్రాహ్మణులు ఇక్కడ అసంఖ్యాకంగా ఉన్నారు. సంస్కృతాంధ్ర వేద కళాశాలలు, పాఠశాలలు అన్నసత్రం, ఒక యాత్రిక సదనం ఉన్నాయి. ఏడేళ్ళ క్రితం అప్పుడు మంత్రి తరువాత ముఖ్యమంత్రి పదవులను నిర్వహించిన మాజీముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు తిరుమల తిరుపతి దేవస్థానం సత్రానికి వేసిన పునాదిరాయి పునాది రాయిగానే మిగిలి పోయింది ఇంతవరకు చలనం కలుగ లేదు.



శ్రీధర్మపురి లక్ష్మీనృసింహుని ఆలయం

## పునరుద్ధారం

కొన్ని సంవత్సరాల క్రితం జగద్గురు శ్రీ శృంగేరిస్వాములవారు ఈ క్షేత్రాన్ని దర్శించి స్వామికి ఎన్నోకానుకలు సమర్పించారు. గాలి గోపురం నిర్మాణానికి అంకురార్పణ చేశారు దేవస్థానం నిర్వాహకులు ఆ కార్య క్రమాన్నిపూర్తి చెయ్యాలని ఇంతవరకు పట్టించుకోలేదు. స్వామి గర్భాలయంలో మటుకు వైశాల్యాన్ని పెంచాలని కొంత మార్పుచేసి ద్వారం కూడా పెద్దది చేశారు. సంప్రదాయజ్ఞులను ఇందులో ఎంతవరకు సంప్రదించారో తెలియ రాదు. కేవలం స్థపతి సూచనలేగాక, సంప్రదాయము తెలిసిన ఆగమశాస్త్ర పండితులను దేవాదాయ అధికారులు పునరుద్ధరణ కార్యక్రమంలో దృష్టిలో వుంచుకోవడం అవసరం.

ఈ క్షేత్రోద్ధరణ కార్యక్రమం ఈ మధ్యకాలంలో డా మర్రి చెన్నారెడ్డి ఆర్థికమంత్రిగాయుండగా గ్రామ ప్రముఖుల తోడ్పాటుతో ధర్మపురి వాస తైన శ్రీ కె. వి కేశవులు ప్రభృతులతో ప్రారంభమైంది తరువాత ధర్మ కర్తల మండలి వచ్చింది. శ్రీ వేంకటేశ్వర ఆలయం ఉద్ధరణ జరిగింది కొత్త నరసింహస్వామి ఆలయం, శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం కొంతబాగుపడినవి. ఇంకా బాగుచెయ్యాలి. శ్రీ నరసింహస్వామి విగ్రహం భక్తులకు భయదాశ్చర్య ములు కలిగించి గగుర్పాటు కలిగించేదిగా ఉంటుంది. స్వామికి వామభాగములో చెంచులక్ష్మియున్నది విడిగా ఆదిలక్ష్మియున్నది. దశావతారాలు ఉన్నాయి ఆలయంలో వేదఘోష దశదిశల ఘూర్ణిల్లుతూ ఉంటుంది. స్వామి ప్రాకారంలో అష్టదిక్కులా శ్రీ ఆంజనేయస్వామి విగ్రహాలు స్థాపించబడియున్నాయి. యాగమండపమున్నది. ద్వారం వెలుపల శ్రీ యమధర్మరాజు విగ్రహం యున్నది

## ఆలయాలు - తీర్థాలు

ఈ ఆలయానికి సమీపంలోనే శ్రీ రామచంద్రప్రభువు ప్రతిష్ఠిత మైన శ్రీ రామలింగేశ్వరాలయం ఉన్నది హేరంభభైరవుని ఆలయం కూడా ఈ ఆలయ ప్రాంగణంలోనె యున్నది ఈ క్షేత్రంలో గౌతమేశ్వరాలయం, బ్రహ్మ పుష్కరిణి, సత్యవతీమందిరం, రాజేశ్వరాలయం, రామాలయం, దత్తాత్రేయ మందిరం, మహాలక్ష్మీమందిరం, భక్తాంజనేయ మందిరం దర్శనీయములు. ధర్మపురిలో గోదావరిలో ఉన్నటువంటి యమగుండం, బ్రహ్మగుండం, శేష హ్రదం, సుధాతీర్థం, సీతారామలక్ష్మణుల గుండాలు వశిష్ఠ గుండం వాలా పవిత్రములుగా భావిస్తారు.

## క్షేత్ర ప్రశస్తి

శ్రీ ఆంజనేయ మందిరాన్ని శ్రీ శ్యామసుందరశాస్త్రి పునరుద్ధరణ జరిపించారు ఆయన క్షేత్ర చరిత్రను గాథా పూర్వ చరిత్రలతో పరిశీలించి ఇప్పటి పరిస్థితులను గూడా చేర్చి వాటికి మెరుగు పెట్టారు స్కాందములో ధర్మపురి క్షేత్రమహాత్మ్యము వర్ణింపబడియున్నది పూర్వం బలివర్మ అనే రాజు ఉండేవాడు అతనికి అల్పాయుష్కుడైన కుమారుడు కల్గగా ధర్మయాగం జరిపించినందువల్ల ఆ కుమారుడు చిరంజీవుడైనాడు. అతడే ధర్మవర్మ. బలి

వర్మయాగం జరిపించిన గ్రామానికి ధర్మపురి అని పేరుపెట్టి, దాన్నే రాజధానిగా చేసుకుని ఆంధ్రదేశాన్ని పాలించాడు. పూర్వం బ్రహ్మాది దేవతలు ధర్మవర్మ మహారాజును నృసింహుని గూర్చి తపస్సు చేయవలసిందిగా ప్రేరేపించారు. అతడు తపస్సుచేయగా స్వామి అక్కడ వెలిశాడు. ఫాల్గుణశుద్ధంలో స్వామి కల్యాణం జరుగుతుంది. ధర్మశర్మ, ధర్మవర్మ, ధర్మదాసుగా స్వామిని మూడు జన్మలో అర్చించిన ధన్యజీవికిది నెలవు. ఎందరో మహానుభావులు ఈ క్షేత్రాన్ని ఉద్ధరించినవారు. సాధ్వీమణి శ్రీ సత్యవతీదేవి ఇక్కడ గోదావరి తీర్థమున స్నానమాడి తన జీవితేశ్వరుడగు ధర్మాంగధ ప్రభువును సర్పరూపమునుండి విముక్తి గావించి సుందర మనిషి రూపము వచ్చునట్లు చేసిందిచ్చటనే. ఆ పతివ్రత తన పాతివ్రత్యమహాత్మ్యన్ని నిరూపించడానికి ఇసుకతో నిర్మించిన స్తంభం ఇప్పటికీ భక్తులకు సత్యనిదర్శనంగాయున్నది. బ్రహ్మాదిదేవతలు, ఋషులు, మునులు, మహాభక్తులు ఇచ్చటి స్వామిని అర్చించి తరించారు. ప్రాణోత్క్రమణ సమయంలో స్వామి సకల జీవులకు అష్టాక్షరీ మంత్రాన్ని ఉపదేశిస్తాడని ప్రతీతి. శేషప్ప, అనేకవి భూషణవికాస శ్రీధర్మపురి నివాస, దుష్టసంహార నరసింహదురిత దూర అనే మకుటంతో ఒక శతకాన్ని రచించి ఆ ధర్మపురీలక్ష్మీనృసింహుని ప్రతియింట్లో నిత్యమూ స్మరింపజేసే భాగ్యాన్ని కలుగజేశాడు. ఎందరో ఆర్తులు ఇచ్చటిస్వామిని ప్రతిదినమూ దర్శించి కామితార్థములు పొందుతూయుంటారు. శ్రీ లక్ష్మీనరసింహస్వామి దర్శనం, స్మరణము, అర్చనము ఇహపరతారకము. ధర్మపురిలో పితరులకు తర్పణాలు ఇస్తే వారి ఊర్ధ్వలోక గతులు కలుగుతాయి.

—రామశర్మ



# శ్రీ జయప్రకాశ్ నారాయణ్ ఉద్యమం

## — ఒక పరిశీలన

[శ్రీ జయప్రకాశ్ నారాయణ్ ఉద్యమాన్ని గూర్చి దేశంలో విభిన్నాభిప్రాయాలున్నాయ్. భిన్న దృక్పథములుగల ఇరువురి వ్యాసాలను ఇందు పొందుపరుస్తున్నాము. — సం.]

దేశంలో వచ్చే ఏ ఉద్యమం స్వభావాన్ని అర్థం చేసుకొనేందుకు ఆ ఉద్యమాశయాలూ, ఆదర్శాలూ గురించి నాయకులిచ్చే నినాదాలు చాలవు. నాయకుల యోగ్యతలు ఉద్యమ స్వభావాన్ని నిర్ధారణ చెయ్యవు ఆశయాలకూ, కార్యక్రమానికీ ఉన్న పొంతన, ఉద్యమం నడక ప్రజాభ్యుదయానికి తోడ్పడుతుందా అనే దానిని బట్టి ఆ నిర్ధారణ జరుగుతుంది. దేశంలో ఇతర ప్రాంతాల అనుభవం అల్లా ఉండగా, మన ఆంధ్రప్రదేశ్‌లోనే సాగిన రెండు విభజనా ఉద్యమాల అనుభవం మనని పీడకలలా వెన్నాడుతూంది. కనకనే దూరాన బీహారులో ప్రారంభించి ఉత్తరప్రదేశ్, హర్యానా, ఢిల్లీలకు, మొత్తం దేశానికి పాకిస్తానని హామీ యిస్తున్న జె. పి. (జయప్రకాశ్) సమగ్ర విప్లవోద్యమం, దాని స్వరూపస్వభావాలు ఆంధ్రులు తెలుసుకొని ఉండడం అవసరం.

జె. పి. సాగిస్తున్న ఈ ఆందోళన 'విప్లవ ప్రతిఘాతుకం' అనీ, ఫాసిస్టు స్వభావం కలదనీ, "సామాజికంగానూ, ఆర్థికంగానూ తీవ్రమైన మార్పు కోసం ప్రజానీకం సాగిస్తున్న వర్గ పోరాటాలూ, రాజకీయ పోరాటాల నుంచి వారిని మళ్లించడం దాని అసలు లక్ష్యం" అనీ, భారత కమ్యూనిస్టు పార్టీ నిర్వచించింది.

మితవాద కూటమి నేర్పరిచే ప్రయత్నంగా, తన్ను అధికారంలోంచి దింపేటందుకు ఈ ఉద్యమం అంటారు ప్రధానీ, కాంగ్రెసుపార్టీవారూ.

మితవాద పార్టీలు వచ్చి చేరేయి కాని, నిజానికిది ప్రజా ఉద్యమమే నంటారు మార్క్సిస్టులు, మార్క్సిస్ట్—లెనినిస్టులు.

అదేంకాదు. "బీహార్‌లో ప్రజా ఉద్యమం కేవలం అవినీతిని, సామాజిక ఓరన్యాయాన్ని, పెరిగిపోతున్న నిరుద్యోగాన్ని, దోపిడిని అంతం పొందించడానికే" నంటారు, చంద్రశేఖర్ వంటి కాంగ్రెసువాదులూ, జె. పి. వెనుక నిలచిన జనసంఘం, ఆర్. ఎస్. ఎస్., సంస్థా కాంగ్రెసు, బి. ఎల్. డి., స్వతంత్ర పార్టీల నాయకులు.

ఇందులో ఏది సత్యం? ఏదసత్యం?

### ఉద్యమారంభం

1974 ఫిబ్రవరి 17—18 తేదీలలో బీహార్ విద్యార్థులు తమ చదువుల ఆర్థిక సమస్యలు గురించి పాట్నాలో సభ చేసేరు 135 కాలేజీల నుంచి 500 పైగా ప్రతినిధులు వచ్చేరు. దానిలో అన్ని రాజకీయాభిప్రాయాలకు చెందినవారూ ఉన్నారు. కాని, ప్రారంభంలోనే కొందరు దానికి కమ్యూనిస్టు వ్యతిరేక స్వభావం కలిగించడానికి పూనుకొని ఐక్య కార్యాచరణకు అవకాశం లేకుండా విచ్ఛిన్నం చేశారు. 70 కాలేజీలకు చెందిన రమారమి 250 మంది ప్రతినిధులు ఆ సభ నుంచి విడిపోయి "బీహార్ ప్రదేష్ ఛాత్ర నౌజవాన్ మోర్చా"గా ఏర్పడ్డారు. కమ్యూనిస్టు వ్యతిరేక వర్గం "బీహార్ ప్రదేష్ ఛాత్ర సంఘర్ష సమితి"గా ఏర్పడ్డారు. దీని నాయకత్వం జె పి. తీసుకొన్నారు. ప్రారంభంలో. ఇద్దరి పోరాటం విద్యార్థి సమస్యల మీదనే. కాని . . .

'మోర్చా' వర్గం తమ డిమాండ్ల మీద మార్చి 14—16 తేదీలలో బీహార్ అంతటా ప్రదర్శనలు జరిపేరు. వారిపై పోలీస్ లాఠీచార్జీలు, కాల్పులు జరిపి హత్యాకాండ ప్రారంభించారు. రాష్ట్రం అంతా ఆ అత్యాచారాలకు అట్టుడికిపోయింది ప్రజలలోనూ, విద్యార్థులలోనూ వ్యాపించిన ఉద్రిక్తతను తమ రాజకీయ లక్ష్యాలు సాధించుకోవడంలో ఉపయోగించుకొని జనసంఘం, ఆర్. ఎస్. ఎస్., సంస్థా కాంగ్రెసు, ఎస్. ఎస్. పి., జె. పి. గారి తరుణ శాంతి సేన, ఆనంద్‌మార్గ్ మొదలైన సంస్థలు జె పి. గారి వెనక చేరి, 'సంఘర్ష సమితిని' ముందు పెట్టుకుని బరి మీదకు దిగాయి.

ఫిబ్రవరి 18న ఏర్పడ్డ 'ఛాత్ర సంఘర్ష సమితి 12 డిమాండ్లతో ఉద్యమాన్ని ఆరంభించిందనీ, వానిలో ఎనిమిది పూర్తిగా విద్యార్థి సమస్యలకు సంబంధించినవీ, మిగిలిన ప్రజాసామాన్యాన్ని పీడిస్తున్న లంచగొండితనం, ధరల పెరుగుదల, బ్లాక్ మార్కెట్, దొంగ నిలవలు, కృత్రిమ కాటక సృష్టి మొదలైనవానికి సంబంధించినవనీ, అందుచేతనే ప్రజల్ని ఉద్యమంలోకి తెచ్చాయనీ జె. పి. యే ఆగస్టు 26న పత్రికా గోష్ఠిలో చెప్పేరు.

ఈ కోరికలన్నింటినీ జె. పి., ఆయన వెనక చేరిన పార్టీలూ సంగ్రహం చేసి, "బీహార్ ప్రభుత్వం రాజీనామా యివ్వాలి. బీహార్ శాసనసభ రద్దు గావాలి"— అనే నినాదాలలో మూర్తీకరించేరు.

పార్లమెంటరీ విధానం ప్రస్తుత రూపంలోనే, ప్రాశస్త్యం గురించి నిత్య బోధ చేసే పెద్దలే శాసనసభ రద్దు కావాలంటూండడం దేశంలో ఆలోచనలు రేకెత్తించింది. ఉద్యమం యొక్క రాజకీయ స్వభావం ముఖ్య మంత్రి గఫూర్‌ను దించడానికి పరిమితం కాదని అర్థం అయింది. మరేమిటి?

ప్రభుత్వం రాజీనామా ఇవ్వలేదు. శాసనసభా రద్దు చేయలేదు.

జె. పి. మరో అడుగు ముందుకు వేసి శాసనసభ్యుల్నే రాజీనామా ఇవ్వమన్నారు. అలా ఇవ్వనివారిని దవడలు వాయగొట్టమన్నారు. తర్వాత ఏదో

ఛలోక్తిగా అన్నానని ఆయన సర్దుకొన్నా ఆయన ఆదేశాలను పాటించి, అనుచర వర్గాలు చాలమంది శాసనసభ్యుల మీద చెయ్యి చేసుకున్న ఘటనలు పత్రికలలో వచ్చేయి.

సరిగ్గా ఏభయ్యేళ్ల క్రితం ఇటలీలో ముస్సోలినీ ఫాసిస్టు ప్రభుత్వం ఏర్పడే ముందు జరిగిన ఘటనలు గుర్తు వచ్చేయి.

"సాయుధులైన జట్లు చంపుతామని బెదరించి సోషలిస్టులచే పదవులకు రాజీనామా లిప్పించారు విచారణలు జరిపేరు. తమ శత్రువులను కొట్టేరు. వూళ్ళ నుంచి తరిమేసేరు. చంపేసేరు. చూస్తూ వూరుకున్నారు, కార్యకర్తలు."

(యు. ఏ. హూరర్, 'అమర ఇటలీ')

ఈ జ్ఞాపకాలు ప్రజాతంత్ర వాదుల్ని ఆందోళన పెట్టేయి.

రెండో వేపున, ఈ కార్యక్రమాల నిర్వహణకు జీతభత్యం కోరని వలంటీర్లు కావాలి అమాయకులూ, ఉద్రేకపరులూ అయిన విద్యార్థులుండనే ఉన్నారు కనక జె పి గాంధీగారు 1920లో ఇచ్చిన పిలుపు ననుకరిస్తూ, వారిని వో ఏడాది చదువులు కట్టిపెట్టమన్నారు.

స్వాతంత్ర్యానంతరం పదవుల కుమ్ములాటలో అనేక రాష్ట్రాలలో విద్యార్థుల భవిష్యత్తులతో ఆటలాడుకొన్న అనుభవాలు విద్యార్థులకున్నాయి. చదువులు మానమన్న చిట్కా స్వభావం ఏమిటో, దానివలన లాభం, నష్టం ఎవరికో తెలిసిన విద్యార్థిలోకం ఆ పిలుపును లెక్క చేయలేదు. కనక కాలేజీనే మూయించడం కోసం జె పి వత్తాసుదారీబలగాలు కత్తిపోట్లూ, గలాటాలూ, బాంబు ప్రయోగాలూ ప్రారంభించి, తమ లక్ష్యం సాధించారు.

అన్నీ సరిగ్గా ఆంధ్రప్రదేశ్ విభజనోద్యమాల ఘటనల ప్రతిబింబాలే. భయోత్పాతాలు సృష్టించి స్తంభింప చేసిన ప్రజా జీవితాన్ని నిలవబెట్టడానికీ, ప్రజల్ని సమీకరించి విచ్ఛిన్నత నెదుర్కోడానికీ ఆంధ్రలోలాగే బీహార్‌లో, ఇతరత్రా కమ్యూనిస్టుపార్టీయే కృషి చేసింది. కమ్యూనిస్టుపార్టీ సమీకరించిన ప్రజల మీదనూ, పార్టీ సభ్యుల మీదనూ ఆంధ్రలోలాగే అక్కడా ఉద్యమకారులు దాడులు జరిపేరు. హత్యలు నడిపేరు. విధ్వంసకాండ సాగించేరు. పైపెచ్చు వీటన్నింటికీ కమ్యూనిస్టులే మూలం అని జె. పి ప్రకటనలు చేశారు. పైగా "దేశంలో ప్రస్తుతం ఉన్న రాజకీయ, ఆర్థిక పరిస్థితిని ఉపయోగించుకొని, కేంద్రంలోనూ, ఇతరత్రానూ అధికారంలో వాటా కోసం కమ్యూనిస్టులు ప్రయత్నిస్తున్నారు" సుమా యని తాము అధికారం నుంచి తొలగించడానికి ఉద్యమం నడుపుతున్న, కాంగ్రెసువాదులకు డిశంబరు 8న జె పి హెచ్చరిక చేశారు.

అయితే జె. పి ఉద్యమం దేనికి? కాంగ్రెసును అధికారం నుంచి దింపడానికా? కమ్యూనిస్టుల్ని అధికారంలోకి రాకుండా చేయడానికా? అధిక ధరలు, నిరుద్యోగం, లంచగొండితనం, సామాజిక పీడన వంటి ప్రజల బాధలను తొలగించడానికా?

జె. పి. చెప్తున్నట్లు, ఆయన వెంటనున్నవారు ప్రమాణాలు చేస్తున్నట్లూ ఈ ఉద్యమం అధిక ధరలు, దొంగ నిల్వలు, మొదలైన సామాజిక పీడనలకు వ్యతిరేకంగానే అయితే కమ్యూనిస్టుపార్టీని మొదటి నుంచీ దూరముగా ఉంచాలనే ప్రయత్నం ఎందుకు? అటువంటి ఉద్యమాలలో వారు




జాతీయ నాయకుడు శ్రీ జయప్రకాశ్
లినోకట్ చిత్రం: శ్రీ వేలూరి రాధాకృష్ణ,

మహోత్సాహంతో చేరడమే కాదు మూల మూలకంటూ వ్యాపింప చేస్తారు కదా. దానికి దేశంలో ఏ పార్టీ, ఏ నాయకుడూ కన్న ముందే కమ్యూనిస్టు పార్టీ పెద్ద ఉద్యమాన్నే నడిపింది. రెండేళ్ల ఈ మధ్య కాలంలో అధిక ధరల మీద ఒక మారు, దొంగ నిలవల మీద ఒక మారు ఆంధ్రలో (ఆంధ్రలోనే కాదు— దేశవ్యాప్తంగానే) ఉద్యమాలు నడిపింది. ఆ కృషిలో ప్రభుత్వ నిర్బంధాలకు గురి అయింది. ప్రభుత్వం మొదట మొరాయించినా, చివరకు బియ్యం ధరల తగ్గింపుకు, దొంగ నిలవల వెలితీతకు పాక్షికంగానేనాయె తానే దిగక తప్పలేదుకూడా. ఈనాడు జె. పి. ఉద్యమం గురించి ప్రశంసలు కురిపిస్తున్న పత్రికలు ఆనాడు ఏ విధంగా వ్యవహరించాయో అందరూ ఎరుగుదురు. అందుకే పదే పదే ప్రశ్న వేసుకోక తప్పడంలేదు. ఈ ఉద్యమ పరమార్థం ఏమిటి?

దొంగ నిలవల వెలితీతా? అధిక ధరల తగ్గింపూనా? జె. పి. ఉద్యమం ప్రారంభించాక— "అసలే అంతంత మాత్రంగా ఉన్న సరఫరా వ్యవస్థ . . . ఈ ఉద్యమం ఫలితంగా సంపూర్ణంగా ఛిన్నాభిన్నమయింది" అని పాట్నా పత్రికలు వ్యాఖ్యానించాయంటే మనం పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు.

ఎందుచేత అలా జరిగిందంటే— ఆయన ఉద్యమాన్ని నడిపిన తీరు చూడాలి. జె. పి. ఏప్రిల్ చివరి భాగంలో వెల్లూరు హాస్పిటలుకు వెడుతూ

పత్రికా గోష్టిలో తమ ఉద్యమం నడక తీరు ఏమిటో ఇలా చెప్పేరు— "ప్రదర్శనలూ, తదితర కార్యక్రమాలు సాగినట్టే, అత్యవసర వస్తువుల ధరల నిర్ణయం కార్యక్రమమూ, కంట్రోల్సు, అంగీకృత ధరలకు అందడమూ కూడా సాగుతుంది బ్లాక్ మార్కెటింగ్, అధిక లాభాలు, దొంగ నిలవలు పెదరైనవానికి వ్యతిరేకంగా పోరాటం సాగుతుంది"

అంటే వర్తకులతో సంప్రదించి న్యాయమైన ధరలు నిర్ణయింప చేస్తారు. ఆ ప్రకారం ప్రజలకు అమ్మిస్తారు— ఇదీ జె. పి. ఉద్యమ కార్యక్రమం. జరిగిందేమిటి?

మే 29న పాట్నా పత్రిక 'ఇండియన్ నేషన్' ఇలా వ్రాసింది.

"ఈ కార్యక్రమాన్ని నీతి నిజాయితీ లేని లోకం, చిల్లర వ్యాపారులు భగ్నం చేయ ప్రయత్నిస్తున్నారు పరస్పరాంగీకృతమైన ధరలకు అమ్మ డానికి జిల్లా మేజిస్ట్రేటుకిచ్చిన హామీల్ని బాహాటంగా ధిక్కరిస్తున్నారు. అవసర వస్తువులు దాచివేయడమో, బ్లాక్ మార్కెట్ రేట్లకు అమ్మడమో జరుగుతూంది"

జె పి కార్యక్రమాన్ని అక్షరశ పాటించదలచి 'జనతా చెకింగ్' జరపబోయిన అమాయకులయిన విద్యార్థి వలంటీర్లనూ, వారి ప్రయత్నాలకు సాయం చెయబోయిన సివిల్ సప్లయిస్ ఉద్యోగుల్నీ వర్తకుల ఏర్పాటు చేసిన గూండాలు ఒకటి రెండు చోట్ల తలలు పగలేసేరు.

ఈ పరిస్థితిలో ఈ దురన్యాయాల మీదకు ప్రజల దృష్టిని ఆకర్షించేందుకూ, లకర్మాల మీద తాము ఉంచిన విశ్వాసానికి పరిహారంగా ఆత్మ పరిశుద్ధికోసమూ గాంధీజీలా జె పి నిరాహారవ్రతం పూనలేదు. తన వలంటీర్లలో ఉన్న ప్రజా ద్రోహుల సంతానాన్ని తమ దండ్రులకు నీతి నేర్పేందుకై ఇళ్లల్లోనే వో రోజు ఉపవాసం ఉండమన్నారు.

దానితో ఆయన బాధ్యత తీరిపోయింది తమ వంతుగా— "ఈ సమస్యను నాలుగు ప్రతిపక్ష పార్టీల ముందు తెస్తున్నాను. సాధ్యమైనంత వరకు ఉద్యమానికి సామాజిక, ఆర్థిక పుష్టి నివ్వడానికి ప్రయత్నిస్తున్నాను"— అనేసి సర్దుకొన్నారు అధిక ధరలు, దొంగ నిలవల వ్యతిరేక ఉద్యమంగురించిన జె పి శ్రద్ధ అపాటిది

ఇంక సామాజిక, సమస్యలు మీద, ప్రధాన ప్రాతిపదిక ఆర్థిక సమస్యల మీద జె పి కార్యక్రమం ఏమిటి?

ప్రస్తుతం ప్రజల దురవస్థలకు మూలం భూమి సమస్య అని, దానిని ఖచ్చితంగా అమలుజరపకపోయినా, దానిని గుర్తించి కాంగ్రెసు అనేక శాసనాలు చేసింది రాష్ట్రాలలో మంత్రి పదవులలో ఉండి ఆ శాసనాలు అమలుజరపకుండా అన్ని రకాలుగా అవరోధాలు కల్పించిన నాయకులే ఈవేళ జె పి ఉద్యమంలో ఉన్నారు ఇప్పుడు వారు తమ దృష్టి మార్చుకొని ఆ సమస్యను పరిష్కరిస్తారని ఎవ్వరూ భ్రమపడటంలేదు. జె పి కి కూడా అటువంటి భ్రమలేదు కనక ఆయన ఉద్యమంలో భూమి సమస్యకి స్థానమే లేదు.

ఆలాగే గ్రామాలలో హరిజనులూ, ఇతర అధో తరగతుల ప్రజలలో విద్యాభివృద్ధి, చైతన్య స్ఫూర్తి కలుగుతూంది దానితో సమాంతరంగా వారి మీద ఉన్నత తరగతుల దవుర్జన్యకాండలు పెరుగుతున్నాయి ప్రతి రోజూ పత్రిక తెరుస్తే ఎక్కడో వో చోట సవర్ణులో, భూస్వాములో హరిజనులను కొట్టారనో, చంపేరనో వార్తలే 'ఈ దురంతాలకు వ్యతిరేకంగా జె పి కార్యక్రమం ఏమిటి? చివరకాయన ప్రసంగాలలో కూడ ఈ సమస్యను గుర్తించినట్లు పొలితి దొరకడంలేదు. పైగా ఆయన వెనుకనున్న పార్టీలవారు గ్రామాలలో హరిజనుల మీద నానా దురంతాలూ జరుపుతున్న వార్తలు పత్రికలలో వింటున్నాం.

మహామాయాప్రసాద్, మృతుంజయప్రసాద్, కర్పూరీఠాకుర్, రామానందతివారీ, బిజూపట్నాయక్ ఒకరేమిటి? ఈవేళ జె పి. ఉద్యమాన్ని భుజాన వేసుకున్న యోధానుయోధులంతా ఒక రకం వారే కలకత్తా హైకోర్టో, మరోహైకోర్టో, ముదోల్కర్ కమిషనో, మరొక కమిషనో అధికార దుర్వినియోగం చేసినట్లు, అవినీతి చర్యలకు పాల్పడినట్లు, ప్రజల భూములు హరించినట్లు నిర్ధారణ చేసినవారే ఆయన ఉద్యమానికి సర్వవిధాలా వత్తాసునిస్తున్న రామనాధగోయెంకామీద కోర్టులో కేసులు నడుస్తునా యి. ఆలాగే బిజూ పట్నాయక్ మీదాను.

ఇటువంటి జగజెట్టీలతో జె పి అధికారివర్గాలలో ఉన్న అవినీతిని నిర్మూలిస్తానంటే 'సెభాష్' అనడానికి పరమ అమాయకుడేనా కావాలి లేదా శుద్ధ మోసగాడేనా కావాలి

వ్యక్తులే కాదు. జె. పి. ఉద్యమం వెనక నిలబడ్డ పార్టీలయినా ఆయన ఉద్యమం ద్వారా దేశానికిగాని, ప్రజలకుగాని క్షేమకరంగా వ్యవహరించగలవనే విశ్వాసాన్ని కలిగించడంలేదు

ఆయన ఉద్యమాన్ని సర్వాత్మనా బలపరుస్తున్న జనసంఘం తిరోగామి దృక్పథం గలది ఆర్ ఎస్ ఎస్ సెమీ ఫాసిస్టు సంస్థ కుల ద్వేషాలూ, మత ద్వేషాలూ దాని జీవశక్తి. స్వతంత్రపార్టీ రాజ, మహారాజాల పార్టీ సంస్థా కాంగ్రెసు కేవలం ఫ్యూడల్ పునాదుల మీద నిలబడి ఉంది ఎస్ ఎస్ పి రాజకీయాలంటే నెహ్రూ కుటుంబ శత్రుత్వం.

ఇంక జె పి ఉద్యమంలో మమైక్యం గాకపోయినా, దానితో తాదాత్మ్యం ప్రకటిస్తున్న పార్టీ— మార్క్సిస్టు పార్టీ— ఒక్కటే ప్రజలా, ప్రజా సమస్యలూ గురించి మాట్లాడేది మార్క్సిస్టు—లెనినిస్టు గ్రూపులకు ఆ బాధా లేదు మాదో బాధ వారి బాధ

ఈ విధంగా జయప్రకాశ్ ప్రారంభించిన ఉద్యమం దేశ ప్రజలను పీడిస్తున్న తక్షణ సమస్యలకి పరిష్కారం చూపడంలేదు దీర్ఘకాలిక సమస్యల గురించి పట్టించుకోడం లేదు ఆయన వెనుకనున్న వ్యక్తులూ, పార్టీలూ ఈ సమస్యల పరిష్కారానికి ఆసక్తి, చిత్తశుద్ధిలో కార్యక్రమం నడపగలవి కావు

మరి 'సమగ్ర విప్లవం' ఎందుకు? ఏ లక్ష్యం కోసం?

ఈ విషయాన్ని జె పి గాని, ఆయన ఉద్యమంగాని మొదటి నుచీం దాపరికం ఉంచకుండా దిక్కులు మోగిస్తూనే ఉన్నారు. బీహారు శాసనసభ, తర్వాత కేంద్ర పార్లమెంటు రద్దు కావాలనేది వారి లక్ష్యం

ప్రస్తుత పార్లమెంటరీ విధానం ఎంత లోపభూయిష్టమైనా దానిని ప్రజానీకం క్రమంగా తన ప్రయోజనాలకు సరిదిద్దుకొనే అవకాశాన్ని

ఐను ంది దానిని రద్దు చేయ్యడం ప్రజా ప్రయోజనాలను నష్ట్రపరచడం. కొన్ని శతాబ్దాలు పోరాటాలు జరిపి, అసంఖ్యాక త్యాగాలు జరిపి, మానవ జాతి సంపాదించుకొన్న ఆస్తి యిది దానినింకా విస్తరింపజేయాలని, అర్ధవంతమూ, ప్రయోజనవంతమూ చేయాలనీ భారత జాతి ఒక వైపున పోరాడుతూంటే దానిని తొలగింపచేందుకూ, రద్దు చేసేందుకూ జె. పి ఉద్యమం తలపెట్టింది.

ఈ పార్లమెంటరీ ప్రజాస్వామ్యం స్థానే జె. పి కోరే వ్యవస్థ ఏమిటి? పార్టీరహిత ప్రజాస్వామ్యం! దానిలో ఉన్న రాజకీయపు గుంట చిక్కులు, గుంట నక్క జిత్తులు వివరించి పేజీలు నింపడంకన్నా, అటువంటి ప్రజాస్వామ్యానికి జె. పి యిచ్చిన ఉదాహరణనే పేర్కొంటే సరిపోతుంది.

పాకిస్తాన్‌లో సైనిక నియంతృత్వానికి అంకురార్పణ చేసిన అయూబ్ ఖాన్ మీద జె. పి కి ఎంతో అభిమానం 1961లో పాక్ పార్లమెంటును రద్దుపరచి అయూబ్‌ఖాన్ అధికారం తీసుకోవడాన్ని పార్టీరహిత ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పడంగా ఆయన అభివర్ణించారు. అదెక్కడికి దారి తీసిందో 1971లో తూర్పు బెంగాల్ ప్రజలనుభవించారు. ఆ తాకిడి మనకీ తగిలింది.

అందుచేతనే జె. పి. ఉద్యమం, ఆలోచనలూ ప్రజాభ్యుదయానికి తోడ్పడవనడం. పైగా తమ కష్టాల నధిగమించేందుకై పోరాటాలకు సన్నద్ధమవుతున్న ప్రజలలో దుర్భ్రమలు కలిగించి, పక్కదారులకు పట్టించి, ఫాసిస్టు పాలనకు దారితీసే అభివృద్ధి నిరోధక ఉద్యమం అనడమూ, చిలీలో ప్రస్తుతం, గతంలో ఇటలీ, జర్మనీలలో తలయెత్తిన ఫాసిస్టు ప్రభుత్వాలకు వెనక నిలిచిన సామాజిక వరాలే నేడు జె పి ఉద్యమం వెనకా ఉన్నాయి. దేశం దేశ ప్రజల భవిష్యత్తు దృష్ట్యా అది విజయం పొందడానికి వీలులేదు

"అ వం తి"

* * * *

శ్రీ జయప్రకాశ్ నారాయణ నేతృత్వంలో సాగుతున్న ప్రజాందోళన కారణంగా దేశంలో నేడు ప్రజాస్వామ్య వ్యవస్థను గురించిన మవులికమయినఒక చర్చ బయలుదేరింది. పాశ్చాత్యుల నుండి గ్రహించిన ఈ ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజలు తమ ప్రతినిధులను ఐదేండ్లకొకసారి ఎన్నుకుంటారు అయితే ఒకసారి ఎన్నికైన తరువాత ఆ అభ్యర్థి లేదా ఆ ప్రభుత్వం ప్రజాహితానికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తే, అవినీతిపరులుగా తయారయితే, లేదా ఐదేండ్లు కుంభకర్ణనిద్రలో మునిగి వుంటే ఏం చెయ్యాలి ?

అలాంటి ప్రభుత్వాన్ని అవిశ్వాస తీర్మానంతోనే పెకలించి వేయవచ్చును. కాని ప్రభుత్వ పక్షానికి 'బ్రూట్'' మెజారిటీ వుంటే ఇది సాధ్యం అయ్యేపని కాదు శక్తివంతమైన ప్రతిపక్షం వున్న బ్రిటన్‌వంటి దేశంలోనే ఇది సాధ్యం అవుతుంది. పోనీ అంతచెడ్డదని భావిస్తే తిరిగి ఎన్నికలు సమయం వరకు ఓపిక పట్టి అధికారపక్షాన్ని ఎన్నికలలో ఓడించవచ్చును. ఆ విధంగా ప్రజాభిప్రాయాన్ని వ్యక్తం చేయవచ్చును కాని అలా వేచివుండి ఎన్నికలు జరిగినా, అవిసాఫీగా న్యాయంగా నిర్వహింపబడినవని భావించినా, ప్రజలు కోరినట్టు ప్రత్యామ్నాయ ప్రభుత్వం ఏర్పాటు కావటం మనదేశంలోని ఇప్పటి పరిస్థితులలో అనుమానాస్పదమే. అంటే ప్రతిపక్షాలు బలహీనంగా ఉన్నాయన్నమాట ఆ తప్పు ప్రజల విశ్వాసం పొందలేని ప్రతిపక్షాలదే, అధికారపక్షానిది కాదుగదా అనే ప్రశ్నవస్తుంది. కాని అత్యధిక మెజారిటీతో అధికారాన్ని హస్తగతం చేసుకొనగల్గటానికి కారణం కాంగ్రెసు ప్రజల విశ్వాసాన్ని సంపాదించింది కనుకనే అని చెప్పటానికి వీలులేదు. ఉత్తరప్రదేశ్‌లో 32% వోట్లు వచ్చినా అసెంబ్లీలో మెజారిటీ సంపాదించి ప్రభుత్వాన్ని హస్తగతం చేసుకోగలిగింది కాంగ్రెసు. కాంగ్రెసుకు వ్యతిరేకంగా 68% వోట్లు పడ్డాయి ఇది ఆ పార్టీయొక్క ఆ పార్టీ నాయకత్వం యొక్క ప్రజాదరణకు చిహ్నం కాదు. ఇన్నిపార్టీలుండటమే దీనికి కారణం. జర్మనీలో హిట్లరు అంత సుంభంగా అధికారంలోకిరావటానికి కూడా ఇలాంటి పరిస్థితే కారణం ఆనాడు జర్మనీలో దాదాపు 60 పార్టీలున్నాయి ఫాసిజం అనేది సామాన్యంగా పార్టీల చీలికల కారణంగానే సాధ్యమవుతుంది 1971 లో పార్లమెంటు ఎన్నికలు సమయానికి మనదేశంలో 53 పార్టీలున్నాయి ఇప్పుడు నూటికిపైగా వున్నాయి ప్రస్తుతం అమలులోవున్న ఎన్నికల చట్టంలోని అస్తవ్యస్తతలవల్ల ఇది జరుగు తున్నది లోపభూయిష్టమైన ఈ ఎన్నికల పద్ధతి కారణంగా పార్టీల చీలికలు ఏర్పడు తున్నాయి అనిశ్చితమతులయిన స్వతంత్ర అభ్యర్థుల సంఖ్య పెరిగిపోతున్నది వచ్చిన వోట్లకూ గెల్చిన సీట్లకూ పొంతన వుండటం లేదు. ఎన్నికల ఖర్చు అందరానిదిగా తయారయింది. పార్లమెంటుకు ఎసెంబ్లీలకు ఎన్నికలు జరపాలంటే యిప్పుడు మనకు 150 కోట్ల రూపాయలకు మించి ఖర్చు అవుతున్నది.

ఇక ఇప్పుడు వెంటనే ఏదారీ లేదు గనుక ప్రజలు చేతులు ముడుచుకొని చూస్తూ వేచి వుండాలని అంటే అది రాజ్యాంగ వ్యవస్థకు ప్రజాస్వామ్య వ్యవస్థకు అవమానహేతువే అవుతుంది. అలావేచి వుండటం ప్రమాదకరం కూడాకావచ్చు. ఆలస్యం చెయటం వలన పరిస్థితులు విషమించి చెయిదాటిపోవచ్చు మెదుర్కొంటున్న విషమ సమస్యల వలన సత్యాగ్రహోద్రగులయిన ప్రజలు ఇది ఎన్నిటికీ అంగీకరించరు. నిక్కను సంగతి ఏమయింది?

అందుచేతనే బీహారు శాసనసభ రద్దు, గఫూరు మంత్రివర్గం రాజీనామా అనేవి శ్రీ జయప్రకాశ్ సాగిస్తున్న ఉద్యమలక్ష్యాలలో ఏకమయినవిగా భావింపబడు తున్నాయి. కేవలం శాసనసభ రద్దు అయినంత మాత్రాన అవినీతి మాయమవుతుందనీ, సర్వసమస్యలూ పరిష్కరింప బడతాయనీ శ్రీ జయప్రకాశ్ ఎన్నడూ అనలేదు. గాంధీజీ కూడా ఉప్పుసత్యాగ్రహాన్ని ప్రారంభించినప్పుడు ఒక గ్లాసెడు సముద్రపు నీటితో తయారుచేసిన చిటికెడు ఉప్పు బ్రిటిషు సామ్రాజ్యవాదాన్ని భారతదేశం నుండి వెడలగొట్టగల్గుతుందని అనలేదు కాని ఆ చిన్నపని యావజ్జాతియొక్క స్వాతంత్ర్య భావనను రేకెత్తించి ఒక జాతీయ మహోద్యమంగా రూపొంది బ్రిటిషు సామ్రాజ్యపు పునాదులనే కదిలించి వేయగలిగింది. శాసనసభ రద్దు అయినా, మరల ఎన్నికల జరిగినా, ఇప్పుడు గెల్చే అభ్యర్థులు ఇంతకంటే సమర్థులు సుశీలురు అయివుంటారని కూడ ఎవరూ చెప్పలేరు. అయితే తమ ప్రతినిధులవర్తనపై ప్రజలు అప్రమత్తులుగా ఉన్నారనీ తమను ఏ క్షణాన అయినా వెనుకకుపిలిచే సంసిద్ధతతో ఉన్నారనీ ఒక భయం వారి మనస్సులలో ఉండి వారిని సవ్యంగా ప్రవర్తింపజేయ వచ్చు. ఇది తక్కువ ప్రయోజనం కాదు. అయితే శ్రీజయప్రకాశ్ ఆశిస్తున్న లక్ష్యం ఇదే కాదు శాసనసభ రద్దు అనేది ఆయన సంకల్పించిన సమగ్ర విప్లవానికిమొదటి

మెట్టు మాత్రమేనని స్వీకరించటం జరిగింది. సమాజ వ్యవస్థలో సమూలమైన మార్పులు తీసుకొని రావటానికి చేపట్టిన దీర్ఘకాలిక జాతీయ ఉద్యమం ఇది శాంతియుతము అహింసాయుతము అయిన ఉద్యమం యధార్థమయిన ప్రజాస్వామ్య పద్ధతులకు వ్యతిరేకమయినది అని ఎలా చెప్పగలము ?

శాసనసభను రద్దుచేయటం రాజ్యాంగ రీత్యా సాధ్యమే. మనలోక్‌సభ శాసనసభ అమెరికన్ కాంగ్రెసు లాంటివి కాదు. బ్రిటిషు కామన్సు సభలాగా వీనిని ఎప్పుడయినా రద్దుచేయవచ్చును. ఈ హక్కు రాష్ట్రపతికి గవర్నరుకు ఉంది వోటర్ల మనస్థితిలోని మార్పునో పరిస్థితులలోని మార్పునో గమనించి వోటర్ల అభిప్రాయాలను పరీక్షించే నిమిత్తమై ఈ అధికారాన్ని యివ్వటం జరిగింది అంటే ప్రజాభిప్రాయాన్ని లోక్‌సభ శాసనసభ సరిగా ప్రతిబింబించటం లేదనే కారణం మీద రద్దుచేయవచ్చునన్నమాట. ప్రధానమంత్రి ముఖ్యమంత్రి సలహా మేరకు ఇది జరుగుతుంది.

ఈ అవకాశం వున్నది కనుకనే కేరళలో శాసన సభను రద్దుచేయటం సాధ్యమయింది. శ్రీమతి గాంధియే అప్పుడు కాంగ్రెసు అధ్యక్షురాలు. ప్రధాని శ్రీ నెహ్రూ అప్పుడు రాజ్యసభలో మాట్లాడుతూ కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వం వుంది కనుక ఇన్నాళ్ళు ఆగవలసి వచ్చింది గాని, అదే కాంగ్రెసు ప్రభుత్వం వున్న ఏ రాష్ట్రంలో నయినా అలాంటి పరిస్థితులు ఏర్పడి వున్నట్లయితే ఇంకా ఎంతో ముందుగానే ఆ శాసన సభను రద్దుచేసి వుండేవాళ్ళము అనిచెప్పారు. లోక్‌సభను రద్దుచేయించి మధ్యంతర ఎన్నికలు ఏర్పాటు చేయటం, పశ్చిమ బెంగాలు, ఉత్తరప్రదేశ్, గుజరాత్ ఎసెంబ్లీలను రదు చేయటం తెలిసిన సంగతులే.

మరి యిప్పుడు బీహారులో వున్నది కాంగ్రెసు ప్రభుత్వమే బీహారులోని ప్రజలే ముక్తకంఠంతో శాసన సభను రద్దుచేయవలసిందంటూ అడుగుతున్నారు. ప్రజాభిప్రాయాన్ని మన్నించినట్లయితే శాసన సభను రద్దు చేయవలసి వుంది ఒక్కప్రజలే ఏమిటి బీహారు గవర్నరు శ్రీ భండారే సయితం బీహారు ప్రభుత్వం అవినీతితో పేరుకొనిపోయివున్నదనీ, తాను సంవత్సర క్రితం యిచ్చిన సలహాననుసరించి వున్నట్లయితే ఈ నాడీ ఉద్యమం బయలుదేరేది కాదు అనీ బొంబాయిలో మొన్ననీనడుమనే చెప్పారు. ఇటు ప్రజలు వీన్ని ఉద్యమాలు నడిపినా అటు స్వయంగా గవర్నరే అభిప్రాయపడినా శాసనసభ రద్దు చేయబడలేదు. గోవాలో మాదిరిగా కనీసం జనవాక్యసేకరణ కూడా చేయబడలేదు. అదే సమయంలో ముఖ్యమంత్రి శ్రీ గపూరు సలహాయిస్తే అది వెంటనే అమలు జరుగు తుంది అప్పుడు అది రాజ్యాంగ బద్ధమని భావింపబడు తుంది నిజమేకాని, ఏ పదవీ అక్కరలేని, ఎన్నికలలో పోటీచేయబోని సన్యాసివంటి శ్రీ జయప్రకాశ్ కంటె శ్రీ గపూరు ప్రజా హృదయాన్ని సరిగ్గా కనిపెట్టగల దిట్ట అనీ, ప్రజావాణి గపూరేననీ భావించటం ఎంతటి హాస్యాస్పదయమయిన విషయం? పవిత్రమయిన ప్రజాస్వామ్య వ్యవస్థలతో చెలగాటమాడటం కాదా యిది ?

కేంద్రంచేత నామినేట్ చేయబడి ఎలాగైనాసరే కుర్చీని వంటిపెట్టుకుని వ్రేలాడ దల్చుకున్న శ్రీ గపూరు ప్రభుత్వం శాసనసభనుగాని వోటర్లనుగాని మన్నించటం లేదు. కాంగ్రెసు, అధిష్ఠానవర్గానికి బంటుగా ఏజంటుగా మాత్రమే వ్యవహరిస్తున్నది శాసనసభ ఉన్నా ఒక ఏడాదిలో 176 ఆర్డినెన్సులు జారీ చేసింది బీహారు ప్రభుత్వం. అవినీతికి "గంగోత్రి"గా తయారయిన కేంద్రప్రభుత్వం కూడా తానుచేసే అవివేకపు నిర్ణయాలకు అడ్డుతగిలే అవకాశం ప్రతిపక్షాలకు లేకుండా ఆర్డినెన్సులతోనే నడుస్తున్నది. పార్లమెంటును రబ్బరు స్టాంపుగా మార్చి పార్లమెంటరీ వ్యవస్థనే భ్రష్టుమొనరిస్తున్నది. ఉప్పెనగా వస్తున్న ప్రజాందోళనను అణచి వేయటానికై పచ్చినియంతృత్వ ధోరణిని పాశవికతను ప్రదర్శిస్తున్నది ఇది "ఆరాధనాయ లోకస్య"అంటే ఆత్మవంచనే అవుతుంది.

ఇట్టి పరిస్థితిలో శ్రీ జయప్రకాశ్ నాయకత్వంలో ప్రజలు తీసుకున్న రాజకీయ సార్వభౌమాధికారాన్ని ఋజువు చేసుకోవాలని నిర్ణయించు కుంటే అది ప్రజాస్వామ్య విరుద్ధమెలా అవుతుంది? సామూహికచర్య ప్రజాస్వామ్య విరుద్ధమేమీకాదు. ప్రతి ప్రజాస్వామిక దేశంలోనూ ఉంటుంది ఇది కమ్యూనిస్టు దేశాలలో ఫాసిస్టు దేశాలలోతప్ప. కాంగ్రెసు పార్టీ కమ్యూనిస్టు పార్టీలు శ్రీ జయప్రకాశ్ ఉద్యమానికి వ్యతిరేకంగా ప్రజాస్వామ్య రక్షణ ప్రదర్శనల పేరిట జరుపుతున్న ఎదురుదాడులు ప్రతిఘటనోద్యమాలు బ్రిటిషువారి విధానాన్నిస్మృతికి తెస్తున్నాయి భారత జాతీయోద్యమాన్ని గురించి వారిలాగే అన్నారు. తమ ప్రభుత్వం చట్టరీత్యా ఏర్పడినదనీ, దానిని సవాలు చేయటం తిరుగుబాటు అవుతుందనీ వారన్నారు. దానికి జవాబుగా తమసామాజిక, రాజకీయ, ఆర్థిక విషయాలకు ప్రమాదం ఏర్పడిందని తలుస్తే ప్రభుత్వాన్ని మార్చటానికి ప్రజలకు హక్కువుందని ఆ నాటి స్వాతంత్ర్యోద్యమ నాయకులు చెప్పారు. గాంధీజీ వదలి వెళ్ళిన కార్యాన్ని పూర్తిచేయటానికే తానీ ఉద్యమాన్ని సాగిస్తున్నాననీ శ్రీ జయప్రకాశ్ చెప్పారు. ప్రజాస్వామ్య వ్యవస్థలు వ్యవహరించే పరిధిలో సాంఘిక ఆర్థిక పరివర్తనం సాగుతుంది కాని, రాజ్యాంగ విరుద్ధమయిన పద్ధతుల ద్వారా కాదు అని మన ప్రభుత్వాధినేతలు అంటున్నారు. కాని వారే ఆ రాజ్యాంగాన్ని 27 యేండ్లలో 36 సార్లు సవరించారు ఇది ప్రజలు శ్రేయస్సుదృష్ట్యానే జరిపారు అని అంగీకరించినా, అదే దృష్టితో ప్రజలే తమ అస్తిత్వం కోసం అవసరమయితే పార్లమెంటుకు బయట శాంతియుత ఆందోళన జరిపి రాజ్యాంగాన్ని పునర్నిర్మింప జేస్తారు అని చెబితే, అది రాజ్యాంగ విరుద్ధమని అంటే ప్రయోజనం ఏమిటి? ప్రజలకు అతీతమైనది కాదు రాజ్యాంగం ప్రజల కొరకు రాజ్యాంగంకాని, రాజ్యాంగం కొరకు ప్రజలుకాదు. ఈ ఆందోళన రాజ్యాంగవిరుద్ధమని అంటున్నా వారు, తాము అధికారంలో కొనసాగటానికి ఇది అడ్డు వస్తుందనే ఉద్దేశ్యంతో ఇలా అంటున్నారుకాని నిజానికి రాజ్యాంగంపట్ల తమకున్నమక్కువ వల్లకాదని స్పష్టమవుతూనే వుంది.

ఈ ఉద్యమాన్ని కమ్యూనిస్టులు (సి పి. ఐ) అభివృద్ధి నిరోధకుల ప్రజాస్వామ్య వ్యతిరేక వ్యూహం అని ఎదుర్కొంటున్నారు. రష్యానుండి టాస్,

ప్రాద్దాలుకూడా ఇలాగే విమర్శిస్తున్నాయి కాని కమ్యూనిజమూ ప్రజాస్వామ్యమూ పరస్పర విరుద్ధాలు ప్రజాస్వామ్యంలో రెండు గాని అంతకుమించిగాని పార్టీలుంటాయి. కమ్యూనిస్టులు అధికారానికి వస్తే మొట్టమొదట ఉన్న రాజకీయ పక్షాలన్నింటినీ నిషేధిస్తారు. ఏకపక్షనియంతృత్వాన్ని విశ్వసిస్తారు వారు. రష్యా, చైనా, యుగోస్లావియా, తూర్పుజర్మనీ, రుమేనియా, అల్బేనియా, మొదలయిన కమ్యూనిస్టు దేశాలన్నింటిలోనూ ఇదే పద్ధతి ఆటువంటి వారు శ్రీ జయప్రకాశ్‌ను ప్రజాస్వామ్య విరోధి అంటున్నారు. ఫాసిస్టు అంటున్నారు. గాంధీజీని కూడా ప్రజాస్వామ్యవాదుల తొత్తు అనీ ఫాసిస్టు అనీ అన్నది వీరే. "క్విట్ ఇండియా" ఉద్యమాన్ని వ్యతిరేకించిన వీరు శ్రీ జయప్రకాశ్‌ను "క్విట్ ఇండియా'అని అంటున్నారు తూర్పు ఐరోపా దేశాలలోలాగా ప్రస్తుత రాజకీయ ఆర్థిక పరిస్థితిని అదనుగా తీసుకుని కేంద్రంలోని యితర ఛోట్ల అధికారాన్ని పంచుకోవాలని చూస్తున్న సి. పి. ఐ. వారి వ్యూహంలో ఇది ఒక భాగమేనన్న సంగతి ఆ పార్టీ నిర్ణయాలవల్లనే వెల్లడి అవుతున్నది.

ఏది ఏమయినా ఈ ప్రజాందోళనవలన కలిగిన మహాప్రయోజనం ఒకటి వుంది. దీనిద్వారా శాసన సభ్యులపై తమకు అధికారం వున్నదనే సత్యం ఇంత వరకు ఉదాసీనులుగా ఉన్న ప్రజలకు హృద్గతమయింది. ప్రజాస్వామ్యాన్ని శుద్ధి చేసి పటిష్ఠమొనర్చి సరియైన మార్గంలో పెట్టేందుకు ఇది అవసరం. ప్రభుత్వం ప్రజలది. ప్రజలకోసం, ప్రజలు నడిపేది అనే మాటకు అప్పుడే సార్థకత ఏర్పడు తుంది, ప్రజాస్వామ్యం నిజమైన అర్థంలో అప్పుడే ప్రవేశ్లానుతుంది.

అయితే "పోటీ ప్రభుత్వము", "పోటీ శాసన సభలు", 'పార్టీ రహిత ప్రజాస్వామ్యము" మొదలయిన శాబ్దిక ప్రయోగాలకు స్వస్తిచెప్పి, విర్దిష్టమయిన సాంఘిక ఆర్థిక ప్రణాళికను రూపొందించు కుంటేనే ప్రజలు "లోక నాయక్"అనబడుతున్న శ్రీ జయప్రకాశ్‌పై పెట్టుకున్న ఆశలు ఫలోన్ముఖాలవుతాయి. అప్పుడే ఈ ఉద్యమం ఒక శకానికి స్వస్తి వాచకం పలికి నూతన శకానికి నాంది ప్రస్తావన చేసినట్లువుతుంది. అది మన ప్రజాస్వామ్య చరిత్రలో ఒక స్వర్ణ ఘట్టం అవుతుంది.

---శ్రీ దోనెపూడి వెంకయ్య



# పి లు పు

డా. తంగిరాల

**అన్నా!**

ఈ దేశాన్ని చూసి
గుండెపగిలి ఏడుస్తున్నా
దీని భవిష్యత్తు తలచి
కడుపురగిలి శపిస్తున్నా
బుర్రలో ఆలోచనల ఇంకు ఇంకి పోతోంది
చేతిలో కలం భావాలు బళుక్కున కక్కుతోంది.

* * * * * *

చుక్కల్లో చిక్కుకున్న ధరల తారా జువ్వలు
దిక్కుదిక్కుల్లో తాండవ మాడుతున్న పెద్దమ్మ కాళ్ళ ఇనప మువ్వలు
లెక్కలేని నల్లబజార్లలో నిండుతున్న సరకుల పంచులు
బక్కడొక్కల్లో నిత్యం మండుతున్న ఆకలి కొరకంచులు
ప్రజాస్వామ్య అజ్ఞాన కంటక పథంలో
ఒంటికాలి ధర్మదేవత కుంటుతోంది.

అధిక జనాభా కీకారణ్యంలో
మదించిన ఇన్‌ఫ్లేషన్ ఏనుగులు
నిరుద్యోగపు పెద్దపులులు
కరువు కాటకాల కొండచిలువలు
లంచాల త్రాచులు
లాభాల రేచులు
"గరీబీ హటావో! గరీబీ హటావో"
అశరీరవాణి అరుపులు
శోషలిజం మెరుపులు
బ్లాక్‌మనీ మబ్బులు
ప్రజల కడగండ్ల వడగండ్ల వానలు.........
ఇక ఏ దారీ లేదు మనకు
పద పద మరి గోదారే గతి,
లేదా —

## పిలుపు

అదిగో
తుపాకి గొట్టంలోంచి మోక్షకాంత
తొంగి చూస్తోందట
దమ్ములుంటే కాసుకో
ట్రిగ్గర్ మీద వేళ్ళుంచి మీసం మెలేసుకో!

*  *  *  *  *  *

అభినవ అభిమన్యులంతా వట్టి హిప్పీ సన్యాసులవుతున్నారు
మరుజవానా మత్తు పొగలో లుంగలు చుట్టుకుపోతున్నారు
'హరే రామ హరే కృష్ణ'ల వరదలో కొట్టుకుపోతున్నారు
కురువృద్ధుడు జె. పి. మాత్రం కోపంతో కదన శంఖం పూరిస్తున్నాడు
క్రూర మృగాల వేటకై ఈ వృద్ధభిల్లుడు విల్లమ్ములు ధరిస్తున్నాడు
సామాన్యుడు కాడితడు, మన
స్వరాజ్య సమర యోధుడు
ఢక్కామొక్కీలు తిన్న రుధీడు
ఆంగ్లేయుల గడగడ లాడించిన సాహసికుడు
అధికార వేశ్యాపాశానికి చిక్కని అరసికుడు
విజమైన గాంధేయుడు
నిస్వార్థ జీవుడు
మనకు మిగిలిన ఒకే ఒక పుణ్యపురుషుడు
తన వాళ్ళ అవస్థలు కళ్ళారా చూస్తున్న హతాశుడు
ఆర్తత్రాణ పరాయణుడు
శ్రీ జయప్రకాశనారాయణుడు!
ఈ మేనమామకు తెలియదా
ఆ తల్లి పుట్టిల్లు?
అందుకే యితగాడు కాలరుద్రుడయ్యాడు
అగ్నిపర్వతాన్ని తొలుస్తున్నాడు
ఉడుకునెత్తుటి కెరటాలు మీటుతున్నాడు
ఉవ్వెత్తున ఉప్పెన పుట్టిస్తున్నాడు
ప్రళయ గీతాలు పాడుతున్నాడు
ప్రజలకు అభయహస్తం ఇస్తున్నాడు
యువ కిశోరములారా! రండి రండి!
అవకాశాన్ని జారవిడవకండి!!

# ధూర్తవిట సంవాదము

**ఈశ్వరదత్త కృత సంస్కృత భాణమునకు తెనుగుసేత 'రజని'**

**అంకితం : 'బాల్యా'కి**

## (గత సంచిక తరువాయి)

**విశ్వలక:** ప్రథమ సమాగములో సమ్మోహనం కలిగించే కారణా లేమిటి?

**దేవిలక:** వినువరి. ప్రథమ సమాగమ సమయంలో దేనికీ కట్టుబడని పరిస్థితిలో ఉంటుంది అదిది. ఆ పరిస్థితులో మహర్షులైనా సరే మోహంలో పడిపోతారు. ఎందుకంటే—

మాటలాడుట కష్టము, మాట బదులు
మాట రాబట్ట కష్టమ్ము మరియు, కొంత
సే పుబుసులాడియును కూడ చెలిమికోరు
పలుకులాడంగ కష్టమ్ము, కలుపుకోరు
పలుకులాడిన కూడ స్వభావసిద్ధ
రతి ఘటన కష్టమే, ప్రాప్తరతకు వేశ్య
కంతయ్యేమ రంజన మగు నా కాదా!

**అంతే కాకుండా,**

వాక్పటువు, చతురుడా, వరవరుడు కూడ
పండిత సమక్షమునన్నైన, పడతు కలను
తొలుత కలిసెడునపుడైన తొట్రుపాటు
పడిన, పల్కాడనోడి, యప్రతిభుడౌను.

**విశ్వలక:** విశిష్ట గుణాలు లేని వెలదులయందు కూడా స్నేహం కల్గించే కారణాలేం ఉంటాయి. వారిలో కపట నటన చేసే కాంతలను బట్టి ఏమని సిద్ధాంతీకరించవచ్చు?

**దేవిలక:** ప్రత్యక్షంగా తెలుస్తున్న దానికి హేతు విచారంతో పనిలేదు. అది మన్మథుడికి గొప్ప అవకాశం. విశిష్ట గుణాలు లేకపోయినా రంజింప కలిగే ఆడవారిని మగవారు వారివల్ల కపట నటన బయల్పడిన వెంటనే విడిచి పెట్టేస్తాడు. ఎలాగంటే

ఇష్ట జన వియోగ కష్ట మెంతటిదైన
సత్త్వయుక్తు డోపజాలు గాని,
ఇష్ట జనుల చేత సేవగింపను గని
దెబ్బతిన్న యెడద తేరుకోదు.

**విశ్వలక:** ఒక స్త్రీ ప్రియుడికి ఆమె అంటే అంత ఎక్కువ గౌరవం లేదనుకోండి. ఆమెను వదిలెయ్యవలసిందేనా?

**దేవిలక:** కూడదు. ఇతర కామినులయందు ఆస్థను రక్షించుకుంటూ తన దాక్షిణ్యగుణానికి కొరత రాకుండా ఆయా సమయాల్లో ఆమె పైని కూడా అనురక్తుడైనట్లు ప్రవర్తించాలి. ఎందుకంటే—

కామ, గుణ, యవ్వనమ్ములు కలుగు నారి,
ప్రణయినిని గాని యవమాన పరచు ప్రియుని
కర్షకుని తిట్ల చిత్తమ్ము కాలు నెడ్ల
పోల్కి వెసువెసాకు నాగళ్ళ పూన్పదగును.

**విశ్వలక:** అపరాధం చేసినవాడు కామినిని ఏ విధంగా అనునయించాలి బావగారూ.

**దేవిలక:** సంశయం సమంజసమే. ప్రణయినుల కోపం విషమ జ్వరంలాగ చికిత్సకు సులువుగా లొంగదు. అయినా, ఆ కోపాన్ని అవశ్యం మాపుచేసితీరాలి. ఈ కాలపు కుర్రవాళ్ళకి పాదాలపై పడడమే మందు. నేనది అంతగా మెచ్చుకోను. ఈ సందర్భంలో వృద్ధ శ్రోత్రియులు కూడా, ముడుచుకున్న ముసలి తాబేటిలా గట్టిపడిపోయి, పాదుకలు ప్రసాదించిన అనికాయలతో కర్కశమై, ఎప్పుడో చేసిన ఘృతాభ్యంగన దుర్గంధంతో కూడిన పాదాలనే పట్టుకుంటారు. అటువంటప్పుడు పల్లవ సుకుమారములయిన కామిని పాదాలు పట్టుకోడానికి అభిమానం ఎందుకు? ఇందులో కూడ ఏదో దోషం లాంటిది లేకపోలేదు. ఎలాగంటే పాదాలు పట్టుకున్నప్పుడు తప్పకుండా కళ్ళల్లోంచి భాష్పాలు వస్తాయి. కామినులకు కన్నీళ్ళతో దైన్యం వస్తుంది. దైన్యం పుడితే ఇక కామానికి చోటేది? అందుచేత ఇతరులేం చెప్తారంటే 'శపథాలు చేసి అనునయించాలి' అని కానీ, భర్త నుంచి విడిపోకుండా ఉన్న పుస్తె కట్టిన పెళ్ళాం కూడా శపథాలను లక్ష్య పెట్టదు. ఇక వేశ్య మాట చెప్పాలా? అథవా లక్ష్య పెడుతుందే అనుకుందాం. సమాధానపడితే దాని పరిస్థితెలా ఉంటుంది? ఇక్కడేమన్నారంటే

కాపురము పట్లే, కాకమ్మ కథల పొరుగు
పరుల పెత్తనమందు, కార్పణ్య మొందు
నారి సత్యకాలపు బుద్ధి, నరుల కింక
మదన విధ్వంసకము వేరె వెదక వలెనా?

కొందరేమంటారంటే ఏదో ఉపాయం ద్వారా ఆమెని నవ్వించాలని. నవ్వులో కలిగే ధైర్యం మూలాన్ని లోకం తెలిసిన నదిలాగ దిగడానికి సులువవుతుంది అని. ఈ సందర్భంలో 'అటువంటి స్త్రీయే లభిస్తే, ఆమె కోపంవల్ల పనేమీ జరగదని ఎందుకంటే

ఇంచుక మేల్ముసు గంచును పైకెత్తి
ఇంపుగొల్పెడు పల్కులేవో కొన్ని
కరుకుగానో మెత్తగానో చెవుల నూది
కలువ కాడంటి డా కాలు చాచి,

అలుక చూపుచు నుత మాంగముపై నుంచ
'అదియె శ్లాఘ్యము, పాలయుల్క పంట,
యువ్వనోచితమ్మైన అర్ఘ్యం బహో' అంచు
ప్రౌఢ కాములైన వార లనరె.

అంచేత స్త్రీ కోపాన్ని హాస్య ప్రయోగం ద్వారా కూడా అంచనా వేయ వచ్చు అదెలా ఉందని ఇప్పుడు మనం చర్చించుకుంటున్న స్త్రీ కోప ప్రసాధనోపాయాలతో సద్యః ఫలితం కలిగించేవి అవమర్దనమూ, చుంబ నమూ అని మా సిద్ధాంతం.

ఎలాగంటే—సాంద్రాణి పరిమళ సంభృతం బైనట్టి
జుట్టులో దాకేలు జొనిపి పట్టి,
అటునిటు చాపనీయక కేలు దోయిని
వలకేల చేరిచి పట్టియుంచి,
బలిమిని ప్రియతమావదనేందు సుధ గ్రోలి
హర్షమ్ము నొందెడు నతడె పురుషు,
డాప్యాయితానంగు డక్షయుం, డనయము,
వయసుచే జీర్ణత బడసి కూడ.

విశ్వలక: ఒకడు ప్రమాదవశాత్తు ఎదటనున్న ప్రియురాలిని మరొక స్త్రీ పేరుతో పిలుస్తాడనుకోండి. దానికి బావగారు ప్రతీకారంగా ఏం సెల విస్తారో!

దేవిలక అమ్మో. ఇంకొక స్త్రీ పేరుతో ప్రియురాలిని పిలవడమే కాముకుడి జీవితంలో గొప్ప ఉపద్రవం. పాము కాటువల్ల కలిగే బాధకి ప్రతిక్రియ లాగా ఇది ఎంతో దుష్కరం. ఒక క్షణం పేపు ధ్యానంలో ప్రవేశించవీ. (ధ్యానం అయాక) ఆ కనబడింది.

గేయం— గడుసుతనపు నిచ్చకాలతో
తడబాటును మరపించుట.
వగలమారితనము చూపుట
భయపడినటు చేష్టలుడుగుట—
తన ప్రియుని ప్రశంసించుట
త్వరగా హాస్యాలు పేర్చుట
మరలనది తప్పు చేయుచో
తిరిగి తిరిగి పేరు మార్చుట—
పడతుల నామము లెన్నిటినో
తడవుటయే శరణ్యమగును,
గోత్ర స్ఖలమ్మనియేటి
గొప్ప తప్పు చేయువానికి.

విశ్వలక: నఖక్షతాలూ, దంతక్షతాలు కలిగించే బాధలోంచి ప్రీతి ఎలా కలుగుతుంది?

దేవిలక హహ్హహ్హా. ఎంత అమాయిక ప్రశ్న? గోటి గిల్లులూ, పంటి నొక్కులూ నొప్పి పుట్టించేవయినా, ప్రీతి కలవారికి మాత్రం సుఖాన్నే కలిగిస్తాయి. ఎలాగంటే,

గేయం— కౌతు చేతి రాగోల చెలుకులో
హాయమ రయములో గుర్రి కుదురు నటుల
సురత వేళ నఖదంత క్షతముల
హృది కొదవెడు స్మర్శలో వాకేగురి.
—ముందుకు సాగుతారు—

విశ్వలక: విరక్తి అయినా అనురక్తి అయినట్లు చేష్టలు చూపే వేశ్య కల రూపు తెలిసికోవడం ఎలాగంటారు?

దేవిలక ఇందులో సంశయం ఏం ఉందయ్యా. పెద్దలు ఏం చెప్పారు అంటే, అనురక్త అయిన వేశ్యతో అనురాగాన్ని వూహించుకోవచ్చు అని పెద్దలు చెప్పిన దాన్నే తీసుకో— ఇలా చూడు, మహాత్ములు కూడా నిజరూపాన్ని కప్పివుచ్చలేరు. ఇక మెత్తని గుండెలతో స్వల్ప పరిజ్ఞానంతో ఉండే స్త్రీల సంగతి చెప్పేదేం విటీ? ఎలాగంటే, ఆకారాన్నే పరీక్షించి తెలిసి కోవాలి.

విశ్వలక: ఎలాగ?

దేవిలక. పూరక నవ్వు, ఇంకొక నారి పేరెత్తి కలవరమ్మున లేని విలువబడును పిలిచిన లేవదు, అలసం సొమ్మైన వగలమారితనము నగుపరుపదు గాఢమ్ముగా నిను కౌగలించి మరుక్షణము, విదిలించి బెంగగొను రతిని తనివులు తీర్చురత్యంతాన ననిపించు వంధ్య పుష్పాల తీవగ లతాంగి.

విశ్వలక: స్త్రీ హృదయంలో కలిగే విరక్తికి చికిత్స చేయడానికి వీలుంటుందా బావగారూ, లేక అది చికిత్సా దుర్లభమా?

దేవిలక: వినుమిది. అనురాగం రెండు విధాలుగా పుడుతూంటుంది. అవి— కారణం వల్ల పుట్టే దొకటి. అకారణంగా పుట్టేది రెండూ. కారణం వల్ల పుట్టే అనురాగం కల వారికి విరక్తి కూడా కారణం వల్లనే కలుగుతుంది. అలాగే అకారణంగా కలిగే అనురాగం ఉన్నవారికి విరక్తి కూడా అకారణం గానే పుడుతుంది. ఇలా రాగ విరాగాల వైషమ్యం కలిగినపుడు ప్రతిక్రియ ఏ విధంగా సాధ్యం? అనురాగం మదగించే సందర్భానికి ప్రతిక్రియ ముందు చెబుతాం.

గేయం— వేరొక నారీమణి సేవించుటొ,
మారు ఫణితి రతిలీల ఘటించుటొ,
ధీరతయో, కలహామో నటించుటొ,
పార మెరిగి సహనము వహించుటొ
హాస్య వచన నైపుణి చూపించుటొ,
అతి సేవయో ఆమెను పొగడుటొ,
తరుణి వంక పొరుగూర నాగుటొ,
పురవర సందర్శనము సేయుటొ,
సాహసమో, దానమో కామిను
చనవున తరిగెడు వలపును పెంచును.

మరిన్నీ, ఇలా విను మరి—

గేయం— చిన్నతనపు చేష్టలతో పిన్నయైన బాలయు,
దానముతో ధనలోలువ, విజ్ఞతతో ప్రాజ్ఞయు,
సాంత్వన వాక్యములతో— కోపగించు నతివయు,
దక్షిణ స్వభావయైన దాక్షిణ్యము తోడను
ప్రబ్బురా పలువచారాల, స్వభావమున కుచిత రీతి
పంసేవింపదగును పకియ ప్రియుని చేత.
(ముందుకు సాగుతారు)

విశ్వలకః
తిలకించు వలపు సైగలు,
తెలవదు చాలుము, చేరదే చెంగటకున్
పిలువ, తారాడు విటునట
చెలువ నెటు వశీకృతనుగ జేసికొనదగున్?

దేవిలకః మంచి ప్రశ్నే ఇది. మొదట కామిని అయినవాడు స్త్రీ స్వభావం వివిటో తెలుసుకుని తీరాలి. అదెప్పుడూ ఒకే తీరున ఉంటుంది బతు కంతా గర్వితగా ఉండే స్త్రీని ఉపాయం లేకుండా వశపరచుకోనడం కష్టం. స్త్రీ స్వభావపు మూల రహస్యం వెల్లడి చేస్తున్నా విను.

బయలున లత మీద పడి త్రొక్కు కరివోలె
హరియించు వేగ లతాంగి నెవడు,
మదవతి యని చూచి మంచి మాటః రక్తి
పెంచి మెల్లగ బెట్టు వంచు నెవడు,
కల్ల వల్కులి నింకొకతె నమ్మించి లో
గొని సేయు భావ గోపనము నెవడు,
వాని చేష్టితములు వైఫల్యమందవు.
చెలువ లెపుడు వామ శీలలగుట.

విశ్వః
అలుక వదలినపుడో, తొలి
కలయికనైనను ప్రవాస కాలమునందో
ఇలు చేరునపుడో కలిగెడు
వలపులు నాల్గింట మీకు వరమెయ్యదియో.

దేవి: ఇక్కడ ఏం చెపుతాం అంటే— తొలి కలయికలో ఏకాంత సంభా షణకి వీలు చిక్కని కాంతల వలపు లోతు తెలియని సరస్సులాగా రంగంలో దిగడానికి జంకు పుట్టిస్తుంది. ఇక నర స్థలంలో అంటావా. వయసపు బడలికవల్ల అనురక్తి ఎందవై కళ్లల్లో నీళ్ల తిరుగుతూ అరిగిపోయిన హృదయోద్వేగంతో ఛాయాగ్రహం అడ్డగిస్తే వెలవెలపోయే చంద్ర బింబంలాంటి ప్రియురాల్ని చూస్తే అరంజకమయిన జాలి తప్ప నన్నేమీ సంతోషపెట్టదు. ప్రవాసం నుంచి ఇల్లు చేరాక ప్రణయమో అని అడిగితే ప్రియురాలు ముఖ ప్రసాధనమూ అలంకరణా సరిగా లేక బిడియపడుతూంటే వానవచ్చిన నాటి గాన సభలాగ రక్తి కట్టదు. మర్రి పాలయలుక వదలినప్పటి వలపు సంగతి అడుగు. సురాసురులు మందర పర్వతం కవ్వంగ మధించినప్పుడు పాలసముద్రంలో జన్మించిన సర్వౌ షధుల ప్రక్షేపణం చేత అప్యాయితమైన వీర్యం కల అమృతం అనేది ఉంది చూశావూ ఆయుర్వేదమూర్వ స్థాపకం అని ప్రసిద్ధి పొందిన రసా యనం— దాన్ని కూడా తలదన్నుతుంది— కోపం పోయిన తరువాత కలిగే ప్రణయం.

ఎలాగం టే—

అలుక వదలిన యప్పటి వలపునందు
లేదు హృదయాన తొలి భావలేశమున్న
మరత మతిరభసమ్మగు, మరుగుపడిన
పళ్ల, గోళ్ల, కరాల వీ ఒళ్లు చేరి.

విశ్వలకః వేశ్యవల్ల దగాపడిన మగవాడ్ని ధూర్తులు వేళాకోళం చేస్తుంటారు. కాముకుడు వేశ్య దగాలో పడకుండా ఉండడం ఎలాగ?

దేవిలకః వేశ్యా స్త్రీ, తాపీమేస్త్రీ, స్వభావంతో ఇద్దరూ ఒకే విషయంతో సమానులు. అదేమిటంటే, చిద్రాలెక్కడుంటే అక్కడ కొట్టడం. అయితే తాపీ మేస్త్రీకి తాత్కాలికంగా అవసరం వచ్చినప్పుడు చేతికి పని దొరుకుతుంది. మరి వేశ్యకి శేరం తగిలిందంటే చాలు వాత రోగం లాగ వదలక డబ్బు చాలా ఖర్చు పెట్టిస్తుంది. వేశ్య వాటికి ప్రవేశించే వాడు నా నడవడికను అనుసరించాలి, అదేమిటంటే—

జవ్వన మెడసిప నఖాలతో ప్రణయ షం
కేత మెన్నండు సాగింపలేదు,
తలి చాటు పిల్లల తగు దూరముగ గాంచి
వదలితి బురదతో నదులవోలె.
అవమానితుని దైన్య మందలే, దర్పంబి
బడునాదరము కూడ పడయలేదు
పమ్ముకాలేదు నా సొమ్ము కాసంతైన
వయసొక్కటే చెల్లి వదినె వాడ.

విశ్వలకః ఒకేసారి ఇద్దరు స్త్రీలు చక్కా వస్తే ఎవర్ని విడిచి పెట్టాలి— చిరకాల ప్రణయునినా, కొత్త ప్రణయునినా? బావగారు ఈ సమస్యకు సమాధానం చెప్పాలి.

దేవిలక. ఈ ప్రశ్న కష్టమయినదే. నా కేమీ తట్టటంలేదు. బాధకేం తోచిందో?

విశ్వలకః నాకేమీ తోచలేదు. ఇది గొప్ప చిక్కు ప్రశ్నే. బావగారె సెలవివ్వాలి.

దేవిలక. అలా అయితే— విను

వెలకొన్న స్నేహమ్ము కల సొంత ప్రియురాలి
వదలరాదు నవ్యవమదము కోరి,
తొలిదాని ప్రీతికై త్రోసి పుచ్చరాదు
వలపంట తనయంత వచ్చు తరుణి,
పరిచిత ప్రియకు కోపమ్మండు నందాక
పూరక ఉండుట యొకటె మందు,
చినదానినేకాంతమున చేర్చి, యొప్పించి
యెడదాని గ్గాఢ మెప్పించదగును.

విశ్వలకః వేశ్య వాటికిలో సంచరించేవారికి స్త్రీల నిగూఢ చాతుర్యం గురించి చూచినంత మాత్రంలో తెలియాలంటే ఎలా సెలవివ్వండి బావగారూ?

దేవిలకః తెలియరాని చాతుర్యం అంటూ కొంచెమైనా లేదు. స్త్రీలను చూడ డంతోనే పురుషుడికి మొదట పరీక్షింపదగిన అంశం వాళ్ల చూపులే. కళ్లల్లోని భావాలన్నీ కట్టుబాటుతో ఉంటాయి. ఇలా చూడు—

వెల్లగల చూపు, రెప్పలు మెల్ల మెల్ల
ఆర్పుచూ, పడ్డముగా పాపలాడు చూపుః
చెలిమిగల చూపు, వెడదచూ, పలము జాలి
తొరగు చూపు, మిన్కు, మినుక్కని మెరయు చుక్క
చూపు, వెలది చూపుల నెన్ని చొప్పులరయ
నామె లోగుట్టు నడవడు అర్థమగును.

తిన్నని సన్నని చెక్కిళ్ళూ, కదిలే కనుబొమల వంపుల్లో అడ్డంగా ప్రసరించే పక్క చూపుల మొగమూ, కల కాంతది కర్కశ ప్రణయం, నల్లని సెలవులతోటి అధరమూ, ఒళ్లంతా నఖదంతాలు కలిగి తరచుగా నవ్వుతుండే వారితో ప్రణయం పరాక్రమ శోభితం. నడుము మీద ఎడమ చెయ్యానించి, కుడి చెంప చాచి, పిరుదులలో ఒక ప్రక్క ఎత్తుగా ఉండే ఇంతిగాని కనపడితే ఆమె ప్రణయాన్ని శ్రద్ధగా ఆదరించాలి. గర్వం లేని స్త్రీ వోపట్టాన కనపడదు. మరి, పయోధరాల్లో ఒక దాన్ని పైట కొంగు కొనతో కప్పుకుని, అందమయిన అడుగు నొకదానిని ఇంటి గుమ్మంపైన ఆనించి, వీధి గుమ్మాన్ని అడ్డంగా ఆక్రమించిన శరీరం గల అతివ కనబడినట్టాయెనా, ఆమె నీ పాలిట స్త్రీ రూపమైన పాశమే అనుకో. ఆమె అందమయిన లీలలు చూస్తేనే చాలు అన్ని విషయాలు అవగతం అవుతాయి. ఇంటి తలుపుమీద మేను గుబ్బను తడుముతూ పాశం లాంటి తన చేతిని ప్రదర్శిస్తూ మొల దట్టీని వదులు చేసుకుంటూ, నాభి ప్రదేశాన్ని వెల్లడి చేస్తున్న రమణి కనబడితే పూర్వరంగం అయాక ఏం చేస్తుందో కేవలం ఆమె ఆకారాన్ని బట్టి తెలిసికోలేవు సుమా. ఇంకా ఎంతయినా చెప్పొచ్చు. క్లుప్తంగా చెప్పాలంటే—

చెంప కొనల దిద్దు చేతుల్ను, తెలిగోళ్ళ
కాంతు లెర్రగ చిమ్ము కాలి వ్రేళ్ళ
సాభినయము వాణి, సలలితమ్మగు గతి,
అదరు పై పెదవిపై నలరు నవ్వు,
జంకించు చూపులు, జంకుకానని మోము,
నాట్యమాడెడు నీవి నాభి చాయ
రతి రంగ శూర నార్యగ్రేసరిణి నామె
నెరుగుము నరజాతి 'చెర' యనుచు

విశ్వలకః (పచార్లు చేయుచు)

విశ్వలక. స్త్రీలకు కోరిక రెండు విధాల పుడుతూ ఉంటుందన్నారు— అవిః ప్రకాశమూ, ప్రచ్ఛన్నమూ ఈ రెండింటిలో ఏది మేలంటూరు బావగారూ.

దేవిలక. ప్రకాశ కామన వేశ్యా వధువులకి పుడుతూ ఉంటుంది. దానిలో కృత్రిమత్వం కూడా ఉంటుంది. ఇక ప్రచ్ఛన్న కామన కుల వధువుల్లోను, వేశ్యా వధువుల్లోను కూడా కనపడుతుంది. ఇది కేవలము విశేషించి అనురాగంవల్లనే పుట్టేట్లయితే, వేశ్యా వధువుల్లోనే అయితే అంతగా తప్పు పట్టరు కనుక రమ్యం అవుతుంది మగవాళ్లు దొరకడం అరుదైన కుల వధువులు కూడా ఎవరినో ఒకరిని ప్రచ్ఛన్నంగా కామిస్తారు. వేశ్య అయితే మాత్రం (అందరినీ, అంటే ఎవరిని పడితే వారిని కామించదు. కొందరి సిద్ధాంతం ప్రకారం— తప్పుగాని కామితం గనుక వేశ్య ప్రచ్ఛన్న కామితం వల్ల ప్రయోజనం ఏమిటీ అని మనం ఇక్కడే చెపుతాం అంటే పేరుపడిన తండ్రి తాతలు కలవాడూ, ప్రభువు ఆదరాన్నీ గౌరవాన్నీ చూరగొన్నవాడూ, ముందెప్పుడూ ఉపకారం చేసినవాడూ, భక్తితో అనురక్తుడైనవాడూ, అసూయ లేనివాడూ వీరంతా వేశ్య మాతకు అనుచరులు వేశ్య ప్రేమించినా ప్రేమించకపోయినా వీళ్లు ఎప్పుడూ ఆమె చెప్పు చేతలకు సిద్ధంగా ఉంటారు. ఎందుకోసమని? ఏదో ప్రయోజనం కోసమే. కాబట్టి వేశ్యా వధువు ప్రచ్ఛన్న ప్రేమకి గురి అయినవాడు ఎవడుకానీ వాడి జన్మ జీవితమూ సఫలమయాయన్నమాట కాని, ఇతరుడయితే, వాడు విరహంతో బాధపడుతుంటే కన్నీళ్లతో గద్గద కంఠంతో చీమలు మోడ్చిన దూతికల సందేశాలను స్వయముగా వింటాడు ఇంతా చేసి వాడికి ప్రాప్తం అయేది అంతకుమించి ఏవీ ఉండదు. తనకి ఇష్టుడైన ప్రియుడిపై ధ్యాసతో రోగం కారణంగా ఒళ్లంతా పాలిపోయి నిద్ర లేక కళ్ళెర్రబడి, అలంకారాలను ఉపేక్ష చేసి, ఉదయిస్తున్న చంద్రుణ్ణి చూసి ఏడుస్తూ "దయా విహీనుడా తృప్తి అయిందా నీకు— నీ కోసమేకదా' నా శరీరానికి ఈ అవస్థ కలిగింది. నీకు భద్రమవుగాక" అంటూ నిందిస్తున్న దానికి— నడుమ నడుమ గాద్గదికంతో "చెలికాడా, నా సందేహం పట్ల దయ చూపమని వేడు కుంటున్నాన" అని అన్నదానికి, త్వరపడు — అలావద్దు సుమా' అని వళ్లూ చేతులూ కదుపుతూ కొరుకుతూ అనె దానికి "ఈ స్థితిలో ఉన్న నేను నీ శ్రద్ధకు నోచుకోలేదా— అబ్బా నా శాపం అందుకున్నావు' అని పలికిన దానికి— రసాయనముల తలదన్నే ఉపశమన వాక్యాలేవీ అని ఆలోచిస్తూ ఆమె ప్రియుడు 'నా కోసమే కదా ఈమెకు ఇటువంటి అవస్థ కలిగింది'— అని దూతికా వాక్యాల ద్వారా ఆమె అవస్థకు కారణం తానే అని తెలుసుకుని ఆమె పట్ల జాలి, ప్రేమా చూప గలిగే ప్రియుణ్ణి గూర్చి "ఇతణ్ణి ఇక మీద విటుడు అనడానికి వీల్లేదు, శ్రోత్రియులతో సమాన గౌరవానికి అర్హుడు వీడు' అని చెబుతారు మరిన్నీ,

మొలదట్టి చేపట్టి మెల మెల్ల నడుగుల
నిడుటచే వంచిన నడుము దాని,
మరులు తొందర కొద్ది యురులలో నొక్రతుటి
సంకేతమును చేరు సకియ బట్టి,
నిలబెట్టి యొక ముద్దు విలుచు ముఖమ్మున
భీతాంచలాక్షిని ప్రియనెవండు
పట్టి యెత్తుదు నేను వానికి శిరముపై
స్వభుజాత్త పంకచ్ఛత్ర మిదియె

అంతేకాక,

'ప్రియ సఖా, త్వరపడు' మటంచు భీతి నెవని
వలపు కౌగిట పలుకునో వాని ప్రాణ
ములకు నిష్టాను సారమ్ము ప్రాల్యమొకటి
కల్పనము చేసి, కొని వేయగలదు కాంత

విశ్వలక రూపవతి యైన స్త్రీ, దక్షిణా— లేక నేర్పరియైన స్త్రీ. వీరిద్దరిలో ఎవతె యందు విశేష ప్రీతో బావగారికి?

దేవిలక: ఈ రెండు గుణాలూ స్త్రీలకు అలంకారాలే. అయితే రూపం లేని దానికి- దాక్షిణ్యం ఉంటే చీకటిలో చిందులాటలాగా వ్యర్థమే. దాక్షిణ్యం లేని దానికి రూపం మాత్రం అడవిలో చంద్రోదయంలాగ ఏం ప్రీతి కలిగిస్తుంది గనుక? నా దృష్టిలో రూపం కంటే దాక్షిణ్యం ప్రధానం అనుకో. ఎలాగ? దాక్షిణ్యం అంటే నేర్పరితనం. అందంలేని స్త్రీలకి కూడ అలంకారంగా ఉపచరిస్తుంది అందం గల స్త్రీ అయినా సరే నేర్పరితనం లేకపోతే అది లోపమే. రూపవతులయిన స్త్రీలను కూడా విడిచి పెట్టేస్తే అందం లేకపోయినా నేర్పరితనం గల స్త్రీలపై రక్తి కలిగే పురుషులు కనపడుతూంటారు గదా. రూపవతియైన స్త్రీ తప్పక ఒకనాడు స్తబ్ధురాలు కాగలదు. స్తబ్ధతకీ కామానికీ చుక్కెదురు కదా. అనువర్తన కామానికి మూలం. అది నేర్పరితనం వల్ల కలుగుతుంది. అందం ఒక్కటే కారణం కాగలిగితే ఆడదాని బొమ్మ ద్వారా కూడా పని జరిగిపోతుంది రూపగుణం కాని చేరితే దాక్షిణ్యం ఒక్కటే నేర్పరితనం గనుక సుగుణ సముదాయం అంతటినీ అంతర్భూతం చేసుకుంటుంది. ఎలాగంటే,

ఉడుపులను పల్కులందింపు, నడకువయును,
గుణములందాస్థయు నదీర్ఘ కోపనతయు,
పనులలో స్వేచ్ఛయు, నలోలు పతయు గల్గ
పడతి నిత్యము దాక్షిణ్య భరిత యగును ?

విశ్వలక: వేశ్యలు కృతకోపచారాలు చేయడం సంప్రదాయం గనుక వేశ్యలు సదాచారులకు పొందరాని వారంటారు గదా? అదెలాగు?

దేవిలక: ఇక్కడ విశిష్టులయిన కామ్యములతో పరిచర్య చెయ్యడం ఉపచారం అనిపించుకుంటుంది. స్వభావతః స్త్రీలకు ఇది రెండు మార్గాల లభిస్తుంది. వేశ్యలలో ఇది ఆచరణలో సిద్ధిస్తుంది ఒక సిద్ధాంతం ప్రకారం— దాక్షిణ్యంతో, లేక, నేర్పరితనంతో చేసిన ఉపచారాలలో కృత కృత్యానికి చోటున్నా— అది దోషం కాదు. ఎలాగ? శాఠ్యంతో ప్రయోగించిన ఉపచారాల వల్ల కూడా వాటి నందుకునే వారికి ప్రీతి కలుగుతుంది. ఋజువర్తన ద్వారా ప్రయోగించిన ఉపచారాలు చెడిపోతే వాటి వల్ల ఎవరికి ప్రీతి కలుగుతుంది? 'ప్రయోజనములను సాధించునట్లు పని చేయించు బుద్ధి విశేషించు శాఠ్యంబునంబడును' అని గుర్తుంచుకో. తమ ప్రయోజనమే ప్రధానంగా గల స్త్రీలు తప్పకుండా తగిన విశిష్టతగల పురుషులను గూర్చి అన్వేషిస్తారు. అట్టి పురుషులను గురించి పరిజ్ఞానం గల స్త్రీ చేత రంజింపబడే పురుషులుండనే ఉంటారు. మరిన్నీ

నైచ్య భావమ్ము ప్రియ వచనముల నక్ష
మతయు నిత్యము నప్రమత్తతయు నెవని
శాఠ్యమే కారణమ్ముగా సంఘటిలునో
అట్టి పురుషుడు నిందపాలగును జగతి.

విశ్వలక: విసంవాదిత్వమే శాఠ్యం యొక్క సారం అని శాస్త్రం చెబుతోంది. అంటే శాఠ్యం అనుసరించే వారి మనోధర్మానికీ ఆచరణకీ మధ్య గాని, ఒకసారి ఆచరణకీ మరొకసారి ఆచరణకీ గాని సంపాదిత్వమూ సామరస్యమూ లేకపోవడం— విసంవాదిత్వం. సామరస్యం లేకపోతే, ప్రియవల్ల కలిగేది దుఃఖమే మరి. దీనికి ప్రతిక్రియ ఉండదంటారా బావగారు?

దేవిలక: కారణాలన్నిటినీ సమీక్షించుకుని, విసంవాదనం అవలంబించవలసి వస్తుంది. ఆ కారణాలని పరిహరించుకోలేకపోతే అది వాడి అపరాధమే. విసంవాదనవల్ల కలిగే దోషం అనైకాంతికత చేసే పనులకు కారణం కాని, గమ్యంకాని ఒక్కొక్కటి కాకపోవడం. విసంవాదతులయినా ఇతోధికంగా రంజితులు కావడం కూడా చూస్తుంటాము.

ఉరుకు రొమ్ములు, బాష్పంబులూరు కనుక
భావ సూచనమూ కొల్కి పక్క చూపు,
పలుకు లవ్యక్త మాధురి నాలుకు భాష.
శాఠ్యమున గూడ గుణముల్ సజ్జనులకు.

విశ్వలక: వేశ్యలకిచ్చిందంతా నష్టమైనట్లే అని చాలమంది అంటూంటారు. మగవారికి కామం అర్థ నాశం కలిగిస్తుందని దత్తకుడు కూడా అన్నాడు. ఈ సందర్భంలో బావగారేం చెబుతారు?

దేవిలక: అర్థం అనగా ధనానికి మూడే ముఖ్యమైన విధులున్నాయి. అవి— దానమూ ఉప భోగమూ, నిధానమూ. వీటిలో దానోప భోగాలు ప్రధానమయినవి. నిధానము అనగా నిలవ చెయ్యడం నీచం. ఎందుకంటే, నిలువ చేయు ధనము ఫలము నందియ్యదు.

ఫలము లేక తుష్టి కలుగబోదు:
కాసు వచ్చు పంచ కళ్యాణి వేగాన,
దాన నిలవ చేయ దగదు ధనము.

అర్థ ధర్మములు శరీర సుఖాన్ని కలిగించే సాధనాలు. ఇష్టమైన శబ్దాలు మున్నగు సౌకర్యాలు లభించడమే సుఖం అంటారు. అందుకే— వేశ్యాజనపు ఉపచారాలు పొందేవారికి శబ్దాలన్నిటిలోను విశేషమైన ప్రియ వచనాలు అత్యంత తుష్టి నిస్తాయి. అలాగని వేశ్యలే అంటారు, ఇతరులనరు. ఎలాగంటే—

"ప్రియులకై వేశ్య మితము క్షేమయోచితము
ప్రియము కటువగు మాటలను వాడు చుందురు,
కాని యప్రియములతో దాక్షిణ్యవతులైన్నడేని పలుకరు
ప్రియమునప్రియమ్ముగను కూడ."

ఎదుట కనబడుతూ ఎగుడు దిగుడు కాక ఉరువైన నితంబాలతో వెడల్పైన పలువతో ఒడ్డాణపు అడ్డు తొలగిన వేశ్యాజఘనం పై కదం తొక్కే రాతుకి ఉపభోగ్యములయే స్పర్శల కోసం ప్రాణాల కోసం ప్రాణాలనైనా త్యజిస్తారే, అప్పుడు ధనం లెక్కేవిటి ? రసములన్నిటిలో మద్యపానము గర్హించేవారికి కూడా వేశ్య అనే ఉపభోగంతో విశిష్టతా, రంజకతా, లభిస్తాయి. ఇలా చూడు.

షడియు నలలతో పైకి లేచునది సకియ
పెదవి కరచి యుంచుక గ్రోలి వదల, నామె

వేదన సౌరభ మంటిన మధిర త్రాగు
వాడె సరసుండుపో వేశ్య వాటి యందు.

కాకపోతే, అరమోడ్పు కళ్లతో, వణకు పెదవులతో వెడద కనుబొమలతో, చెమటలో తడిసిన చెక్కిళ్లతో వేశ్యాంగనల ముఖాలను దర్శించిన వాడి కళ్ళు ధన్యములవుతాయి. మరిన్ని

స్నానమ్ముచే బిరుసగు కేశముల కొసల్
విరులల్లిన వెడల్పు కురుల పాయు,
చుట్టె విడిచివట్టె సురభిళ వసనమో,
తమ్మిపోలెడు కెంపెదవుల కూర్పో,
రాగిలు కన్నులో, రేగు మదపు వెూమో,
చందనార్ద్రమైన చలువ మేనో,
గణిక దగ్గరుచు వాఘ్రాణించువానికి
ముక్కు చెలమలందె మొక్కుమరుడు.

ధర్మశాస్త్ర విషయాలలో నేను అధికారిని కాను గాని, ఆచరణలో ధర్మాన్ని ఎలా సాధించవచ్చో చెపుతాను. ఈ లోకంలో కృతఘ్నత పాపాలన్నిటి లోను పెద్దది. వేశ్యా వధువుల ద్వారా సాటి లేని సుఖాన్ని కోరికలనూ పొందినవాడు, వాళ్లకి ప్రత్యుపకారి కాకపోయినట్లాయెనా వాడికంటె కృతఘ్నుడు మరొకడుండడు. కృతజ్ఞుడైన వాడికి మాత్రం అరచేతిలో స్వర్గం లభ్యం అవుతుంది. అంచేత ఆ స్వర్గసుఖం పొందడం కోసం వేశ్యలకి వెనుదీయకుండా విత్తం ఇస్తూండాలి.

విశ్వలకు: కుల వధువులు దాక్షిణ్యమో, నేర్పరితనమో ప్రదర్శించినా, అది వేశ్యలు ప్రదర్శించిన దానిలా ఉండక పోవడానికి కారణం ఏమి టంటారు బావగారూ?

దేవిలకు: వినుమరి. దాక్షిణ్య ప్రదర్శన కులవధువునందు ఒకలా జరిగితే, వేశ్యయందు మరొకలా జరుగుతుంది. కులవధువు ఋజువర్తన అయినా, ఆ కాలంలో ప్రియంగా మాటాడడమో, లేదా అత్యంత ప్రియంగానో, కాకపోతే బొత్తిగా అప్రియంగానో మాటాడుతుంది. అదెప్పుడూ అంతే. కామం అంటే ఇచ్ఛా విశేషం. ప్రార్థన కూడా ఇచ్ఛయే. కోరిక ప్రాప్తం కాకపోవడం వల్ల ప్రార్థన పుడుతుంది అదే వేశ్యకైతే, కోరిన వస్తువు ప్రాప్తమై తన స్వాధీనంలో ఉన్నా కూడా అసూయవల్ల ప్రార్థన పుడు తుంది. ఇదంతా బహు సామాన్యం కావడం చేతనే, మాత్సర్యం నుంచి లోభం పుడుతుంది. అంచేత అవకాశం దొరికినా వేశ్యకు కామం మంద గించదు. అనురాగానికి కామమే మూలం. మరిన్ని

గణిక పిరుదుల తేరెక్కి కదలువాడు
ఎరిగి కులనారి చేరంగ నెట్లు చనును?
అరదము త్యజించి పూరుషుడైన వాడు
ఇచ్ఛగింపడు పోవంగ నెడ్లబండి.

విశ్వలకు: వేశ్యలయందనురక్తుడైన మనిషి లోకానికి గౌరవార్హుడు కాడెందుకు? జనసమ్మతి అంటూ ఉంటే అదే ధర్మాధికారి. ఎక్కడైనా గుణాలు కనపడితే వాటిని అనుసరించలెందుకని?

దేవిలకు: అబ్బాయి, నీ మాటలు విటుడికి న్యాయమైన హద్దుల్ని మీరు తున్నాయి. కాసేపు శ్రద్ధగా ఆలోచించు (ఆ) నువ్వు చెప్పిన ఈ గౌరవం అనేది రెండు విధాల జరుగుతుంది. ఫలితం గల గౌరవం, ఒకటి. ఫలం లేని గౌరవం రెండవది. వాటిలో ఫలం లేని గౌరవం దిగంబరుడికి చేసిన చేష్టితంలాగ హాస్యాస్పదమవుతుంది. వేశ్యలందు అనక్తుడు కాని వాడికి ఫలం ప్రసక్తి ఉండదు. ఒక మతం ప్రకారం "వేశ్యా సహవాసం అప కీర్తికరమూ" అని. మేం దీన్ని ఒప్పుకోం. సుఖంగా ఉండే వాళ్లంటే లోకానికి ద్వేషం. పరస్త్రీలతో సంగమం పనికిరాదు అని మెడమీద తలున్నవాడల్లా అంటున్నట్లు వేశ్యల విషయంలో అనడానికి వీలులేదు. ఇంకో మతం ప్రకారం 'స్త్రీ సంగమం శ్రేయస్కరంకాదు. వేశ్యలు స్త్రీలు, అంచేత వాళ్లతో పొత్తు కూడా అంతే...' అని. ఇక్కడేం చెప్పాలంటే— స్త్రీలనుంచే ఆయత్తమై వస్తూన్న లోకం స్త్రీని దూషించడం తగదు' అని.

తెలివితేటలు, నూర పలుకుబడియు, సోష్ట!
వమ్ము, మాటల నేర్పు, బలము పెంపు,
ఇంగిత జ్ఞతయును, సొంగ సంతుష్టియు
రక్త వారీచ్యుతి, రతి గుణనిధి,
చిత్రాది కళలందు సిద్ధి, సౌఖ్యావధి
వేశ్య వాటిక యందు వశ్యమౌను
అఖిల గుణోపేతుడయి కాముకాగ్రణి
జగతిన ప్రయుక్తుడగుట - యెట్లు?

విశ్వలకు: బృహస్పతి, శుక్రుడు మొదలయిన శాస్త్ర ప్రయోక్తలు స్త్రీ లతో సంబంధం కూడదని ఉపదేశించారు గదా. ఈ సందర్భంలో బావ గారి అభిప్రాయం ఏంటో.

దేవిలకు: అది కేవలం ఉపదేశం మాత్రమే. ఎవడయ్యావాడు— స్త్రీలతో సంబంధం పెట్టుకోనివాడు. నాకు కనబడలేదు. "దేవేంద్రాదులు అహల్యా దుల పట్ల నడచిన నడత ద్వారా అసహజమైన ఆపదలపాలయ్యా"రని వింటుంటాం. ధర్మార్థముల కోసం దేవులాడడం కంటె విషయ వరి తర్పణమే శ్రేష్ఠం. ఇష్ట విషయ ప్రాదుర్భావం ద్వారా పొందే ఫలం కనుక స్త్రీలు విషయ ప్రధానలు. వేశ్యలను కాదని ఎవడైనా స్వర్గంలో కామోపభోగాలను కోరుకుంటే, వాడు నా దృష్టిలో దగాపడినవాడే. ఇందులో ఇహపరభోగాలు రెండింటిలో ప్రత్యక్ష ఫలత్వాత్తు ఇహ భోగమే మేలుతరం. ఉందో లేదో తెలియని ఇంకొక జన్మైతే తపము ద్వారా ప్రాప్తించగల భోగాల మాట ఎవడిక్కావాలి? ఇలా చూడు. చంద్రుడూ, తారకలూ మబ్బుల చాటునపడి, ఇనుమడించిన చీకట్లతో చూడడానికి భయం కలిగిస్తూ, వణికించే గాలులతో, రాక్షసోకల నాపు చేసే వరద దుమారాలతో కూడిన వానకాలపు నీలిమావటి వేళల్లో మదన శరాల దెబ్బకు తాళలేని ఏకాకిని కామిని అభిసరించి రాగా, ఆమె కాలి అందె సవ్వడికి మేలుకొనే మగధీరుడి జన్మా, జీవితమూ, సఫలమవుతాయి.

విశ్వలకు: సంకేత స్థలానికి పోయే అభిసారికలు కాలికి అందెలు వేసుకోవడం ప్రియులకి గొప్ప ఉపకారమే బావగారు.

వేవిలకు ఆది అంతే. ఎలాగంటే,

మరుగున తొలిసారి కలయు '
వరుడెట్టుల తనకు తాను వల్లభ వశుడౌ
బిర బిర నడుగు లిడెదు తాం
దరలో చెలి యందెసడి ఎనంబడకున్నన్.

ఈ విధంగా ప్రియురాలి అందెల సవ్వడికి మేల్కొన్నవాడై జడివానకు చెరిగిపోయిన పత్ర లేఖనంతో, చెదిరిపోయిన కాటుకగల కళ్లతో కుదురు లేని పై పెదవి గల పొగరెక్కిన మొగాన్ని ఆస్వాదించినట్లయితే, బహు కల్పాంతరాలపాటు వంచిన తలతో అనుభవించిన నరకలోకపు కష్టాలయినా సరే ఆ ఒవ్వని వలపు చూరగొన్న గలిగినందుకు సార్థకము అవుతాయి. శరత్కాలంలో మబ్బు మేలి ముసుగు తొలగించి, చల్లని చందురు బొట్టు పెట్టుకుని, గాలి ఆడకపోయినా పచ్చ మద్ది పూలను వాసన గుబాళించే ఆకాశం కింద, కొంగ కువకువల తేలపించే మేఖలా రవళులతో, బంధూక కుసుమపు రేకులు చిదిమి కూర్చిన ముఖాలంకరణతో కలకలలాడే ప్రియురాంౘడతో కూడి జక్కవకవగరపే వలపు ముద్దుల ననుసరిస్తూ తామరలు విప్పారే కొలకు నీళ్లలో క్రుంకులాడే వానికి స్వర్గముతో వేరే పనుంటుందా?

లేదా, హేమంతం రాగానే, ప్రియంగు కుసుమాల గుత్తులతో కూర్చిన కురుల పాయల్లో గాలి చొరకుండా తురిమిన మొల్లలూ విరిసిన లొద్దుగలూ కమ్మతనాలు చిమ్ముతూంటే చలికి పగిలిన పై పెదవుల మాటున కింది పెదవులను దాస్తూ ముద్దు వద్దనే ప్రేయసుల ముఖాలను ప్రణయబలంతో ఆస్వాదించగా కలిగే ప్రీతి నిరుపమానం కాకపోతే, కాటుక చీకటి మబ్బు కమ్మిన వానరాత్రులందు లోపలి గదుల్లో చెల్లా చెదురుగా తీసి పారవేసిన పూల మధ్య, మంచు తుంపర ముత్యాలను ఎగరగొట్టే హెూరు గాలుల చలికాలపు మాపటి వేళల అనురక్తయైన ప్రియురాలి ఉరువైన రొమ్ముల ఒత్తిడికి లోనైన చాతితో శ్లేష్మమైన శయ్యపై పరుండి, బిగి కౌగిళ్ల వెలువడే చెమట చుక్కల నెత్తావిలో గుభాళించే గాత్రంతో కలయికల నడుమ సొంపుతో నిద్రను సేవించే వానికి పొందనదంటూ ఏం ఉంటుంది? మరిన్నీ—

విరబోయు కురులెత్తి విదలించి కొట్టి
కదలెడు కనులతో పెదవి దాచుకొని
నిట్టూర్పు వదలు వనితల మోములను
శయ్య జేర్చదగు తృష్ణార్తులా వారు.

స్వర్గంలో అంతా అనిమిషులు అంటే రెప్ప వాల్చనివారు అంటే వాళ్ళ నిద్ర ఉండదన్నమాట నిద్రలేకపోతే అక్కడ పొందే సుఖం ఏమిటి? లేదా, స్వేద బిందువులు అడ్డం కొట్టగా తిన్నని తిలకమార్గాలు గండ్లుపడి, మణులతో కూర్చిన ముడుల దట్టులను సద్దుకునే మదన దూతికలు లాయబారాలకు వచ్చి పోతూండగా, మావిడి చిగుళ్లు తలనూపి, మంద పవనాలు సువాసనలు మోస్తూండే వసంత దినాల్లో చెప్పకుండా వచ్చి తనంతట తను తిరిగి వెళ్లిపోతున్న అనురక్తురాలైన ప్రేయసిని తప్పనిసరిగా వెంబడించి అతగానికి ఇక అన్య విషయాలను గురించి ఆలోచన ఏం ఉంటుంది? మరిన్నీ, మండు వేసవి ఎండలలో, శిరీషకుసుమంలా చామన చాయెక్కిన చెక్కిళ్ళు మణి ముక్తాహారాలలాటి స్వేద బిందువులతో చందనంతో వట్టివేళ్ల వింజామరల గాలిలో ఉపభోగ రమణీయములవుతూంటే, విరులు వెదజల్లిన శయ్యపై మేను వాల్చి చేత రాల్చిన కురుల పాయలో మల్లెమాలిక తొంగిచూడగా చనుదోయి చందనంతో తడిసిన ప్రియురాలితో కలిసి తాళవృంత మారుతంతో నిండుగా గాలియాడే కుటీరంలో మధ్యాహ్న కాలాన్ని గడిపేస్తాడు. లేదా, సురభిళ జలాలు కల్లాపి చల్లగా చెమ్మగిల్లిన ఆవరణతో, విరజిమ్మిన వకుళ మల్లి క్షేత్ర దళాల మధ్య గాలి తెగ వీచే గృహాంతరంలో ప్రియురాలి నిరోధం వల్ల ఆగిపోయే అదృష్టవంతుడికి అతి విక్రాంత యవ్వనం అనుభూతం అవుతుంది. మరిన్నీ

పలు గాట్లు పడగ కంపిలు వెూవియందూరు
మోము దామర తేనె ముసురునందు,
వలువ తొలంగగ మొలదట్టి యొగ్రదోయు
వలుద పిరుందుపై వలపునందు,
బలిసిన చెలి చెక్కిళుల గోటి గుర్తుల
పంటి నొక్కుల హెచ్చు భాగ్యమందు,
ననురక్తుడైనచో నతడు జన్మాంతర
మందైన వైరాగ్య మందబోడు.

ఈ సన్యాసులు ఉన్నారు చూశా, పూవాళ్ళు చీమల గుంపులాగ ఒకరి వెంట ఒకరు పడిపోతూ, ఒకరు చేసిందాన్ని ఎంరొకరు చేస్తూ బ్రతుకులో ఎక్కడి కక్కడి ప్రాణానికి ప్రమాద కారణాలు కనబడుతూండడం చేత, తాము స్వయంగా పరిశోధించకుండానే, స్వర్గం స్వర్గం అంటూ ఎండమావి లాంటి ఏదో అభాసప్రాయమైన సిద్ధాంతాన్నొకదానిని అవలంబించి, కుంగిన హృదయాలతో గాలిలో దూకడం, నిప్పులపై నడవడంలాంటి ఘోర జపహోమ వ్రతనియమ వేషాల ద్వారా స్వర్గం చేరుకుందామని ఆశిస్తుంటారు పరమార్థమేమిటో సూక్ష్మంగా పరీక్షించడానికి ఇష్టం ఉండదు. స్వర్గం చేరినవారికి అప్సరసలు సన్నిహితంగా ఉంటారని వింటూంటాం. వారిలోని మనుష్య స్వభావంవల్లా, పరస్పర విరోధం వల్లా సుఖం కలగడం దుర్లభం! నిత్యమూ ఎమట ఉండి, విరహమే లేనప్పుడు అప్రియులు ఏం ప్రీతి పొందగల్గుతారు. ఒకరి కొకరు అర్థంకాక, ఒకరిలో ఒకరు బాగా యెదిగిన గణాలు కూడా మెచ్చుకోలేకపోతారు. స్వర్గంలో బంగారపు ఇళ్ళూ, బంగారు చెట్లూ ఉంటాయని చెప్పేమాట నిజమయితే దేవతలంతా అమర్యాదల పుట్ట అన్నమాట ఇళ్లన్నీ, చెట్లన్నీ బంగారమే అయితే స్త్రీలు అలంకరించుకోవడానికి వస్తువేది? దాని విశిష్టత యేమిటి? ఇళ్లు కట్టడానికి చేర్చిన బంగారం స్త్రీలకు శోభ యెలా చేకూరుస్తుంది? కామినులు స్వయముగా నాటికన్న బిడ్డలాగ పెంచి గారవించి, తమ కురుల పాయలలో దండలుగా కూరు కొనే కుసుమ సముదాయాన్నీ గృహంలో ఉపవనాలలోని బాల వృక్షాలనూ పోషించడంలో కలిగే రమ్యమైన సంతృప్తి స్వర్గంలో ' తమ జాతి వట్లనే కఠింగా ఉండే కనక తరువుల వల్ల ఎలా కలుగుతుంది? తారుణ్య బద్ధ కామతంత్రం ద్వారా పరస్పరం దర్శిం

చుకో గోరుతూ మదనదూతికల ద్వారా పంపే సందేశాలలో పరస్పరం పంపుకొనే ఉపాలంభనాలతో దాహం తీర్చుకుంటూ ప్రణయ ఫలాన్ని పొందగోరుతూండే కామి జనుల నడుమ జనించే ప్రీతి— స్వర్గంలో నిత్యమూ శాపభయోద్విగ్నులై ఉండే అప్సరసల ద్వారా ఎలా కలుగుతుంది? ప్రణయ కోపం వచ్చిన కామినులకు తాత్కాలికోత్కంఠ కలిగించే సాంత్వనోపాయాలను గురించి మిత్రులతో వితర్కిస్తుంటే రాత్రింబవళ్లు గడిచిపోతూంటే కలిగే రమ్యత ఈర్ష్యా విరహాతీతమయిన స్వర్గంలో ఎలా లభిస్తుంది? ఉప్పొంగు భావావేశంతో వక్షస్థలం పైని పరున్న ప్రేయసులు వకుళ పరిమళాలు వెదజల్లే నిశ్వాసాలను విడుస్తుంటే హాయిగా లభించే నిద్రాసుఖం రెప్పవాలుపే లేని స్వర్గంలో ఎలా దొరుకుతుంది? వారుణీ మదం వల్ల అస్పష్ట మధురములయిన అక్షరాలలో, ఎవరెవరో లజ్జావతులగు ప్రియురాండ్ర ప్రియ వచనాలో పానరహితమైన స్వర్గంలో ప్రాప్తించేదెలా? కొత్త వధువుల వేటలో కలిగే కృతజ్ఞతతో కూడిన నిట్టూర్పులూ, ఎగుపులూ, వగపులూ ఆశ్వాసకాలింగనలూ వీటన్నిటికీ స్వర్గంలో అవకాశాలేవి? హహ్హహ్హ నామట్టుకొ నేను సనాతన వృద్ధ నారులతోనైనా హాస్యాలాడతానుగాని, స్వర్గంలో అప్సరసలతో మాత్రం కాదు. అంతే కాకుండా ఈ అప్సరసలు దీర్ఘాయుష్మతులట— సంస్కృత భాష మాట్లాడే మహా ప్రభావం కలవారని వింటూంటాం. వసిష్ఠాగస్త్యాదులైన మహర్షుల జన్మకు కారణమైన వారికి ఏకాంతం ఎక్కడిదయ్యా. ఇలా చూడు—

గడుసుదనము, పొగరు, కల్ల మాటలు, కల్ల
కినుక, యూసు, యేవగింపు— మరులు
మొలకలెత్తు క్షేత్రముల నొక్కటియు కావ
రాని బీడు స్వర్గరాజ్యమనిన.

కనుక, నిరంతరాయమైన కామానుభవాన్ని కోరేవాడుంటే, వాడికి వేశ్యావధువే పొందదగింది— ఎలాగంటే— ఇక్కడే—

ద్వారంబు దాటెడు దాక వెన్నంటి య
శ్రువులొల్క తన మోము చూడదూతి,
పాల యల్క పూని, యయ్యిలు వీడి చనబోవు
తన్ను గట్టంగ వస్త్రాంచలమున,
అనునీయ మాన కఠినతా వలంబియై
కుపితయౌ కాంతచే కుపితుడైన

వానిచే మర్దితుండౌను కాముడు కేత )
ద్ముమ్మతో కీర రథమ్ము తోడ.

ఇదిగో సునంద.

సునంద: అంతా నేను విన్నాను.

దేవిలకు. పాపం. సరుకంతా చెల్లిపోయింది. అమ్మాయీ— యీ మాత్రానికి విరహ వేదన పడకు.

సునంద చంద్రుని నుంచి అంధకారం వెలువడదు కదా.

దేవిలకు· నీకు తగినట్లు చల్లనిమాట అన్నావు సునందా నీనోట ఆమాట వచ్చింది కనక, మేం లోపలికి వస్తాం (ప్రవేశించి) చూడమ్మాయి, ఇక వెళ్లాలనుకుంటున్నాను. ఇప్పుడే—

దిగజారు మొలదట్టి బిగగట్టి వారుణి
ఏదో కొంచెముగ సేవించి, చెలియ,
ప్రియుని గుప్పిళ్లలో నయగారముల గోరు
విరిగుత్తులొప్పు ముంగురుల సరిది,
కరమెత్తి పట్టు మేఖలలతో అలసల
కడగంటి చూపుల గాటు తగిలి,
అడుగుల తొందర యుడిగిన రవి పైడి
తాబేటి వలె గ్రుంకు తరుణమయ్యె.

సునంద: అర్ధపానైనా తాగనిదే వెళ్లిపోడానికి వీల్లేదీవేళ.

దేవిలకు. వోహోహో. వెళ్లి తీరాలి. నా పెళ్లాం పీసుగ మరోలా ఆరాతీస్తుంది.

సునంద. నేనామెను సముదాయించ గలను.

దేవిలకు: గడుసుతనపు సాంత్వనోపాయాలకు కరగని రాజాల్లాగ దుర్జను సముదాయింపులకి లొంగడం కష్టం! ఇదిగో వెడుతున్నా. అరె.

నా పాదాలు విశ్వలకుణ్ణి విడిచి వెళ్లమంటున్నాయి. అబ్బా.
కదలలేకపోతున్నాను, సునందా.
నేను హద్దు మీరెడు వాడ గాను సుమ్ము
కదలి చెలియలి కట్టను గడవ నటులె:
కదలి తన చుట్టు మొల దట్టిగా గలట్టి
ఇమ్మహిని గూడ రాజ ట్లేయేలు గాక.
(విటుడు నిష్క్రమిస్తాడు)

[సమాప్తము]

# అతను చావలేదెందుకని ?

గుజరాతీ మూలం : భగవతీ కుమార్. హ. శర్మ

అనువాదం : గాదంశెట్టి ]

[ భగవతీ కుమార్. హ. శర్మగారు గత పదిహేనేండ్లగా కథలు, నవలలు, కవిత్వం రాస్తున్నారు ఆధునిక గుజరాతీ రచయితల ప్రథమ పంక్తిలో స్థానం సంపాదించారు ఇంతవరకు ఆరు కథా సంపుటాలు, పది నవలలు. అచ్చయాయి సాహిత్య బహుమతులు పొందారు. గత '19 ఏండ్లగా సూరత్‌లోని దినపత్రిక "గుజరాత్ మిత్ర" సంపాదకవర్గంలో పనిచేస్తున్నారు. Times of India కు స్థానిక విలేఖరి.
— సం ]

చూడు బ్రదర్, నేను బాగానే మాటాడుతున్నాను. నాకూ ఆకలి వుంది' స్వాతంత్ర పోరాటపు వీరులేకాదు ఆకలి తీర్చుకోవలసింది. చూడండి, నేనూ కొంచెం స్వతంత్ర పోరాటపు వీరుడనవుతూ అవుతూ ఊరకుండి పోయాను. తప్పంతా ఆ షణ్ముఖుడిదే. నేనేమో కుతూహలం కొంది... . ..... . .. .అతడు నాకంటే ఆరేడేళ్ళు పెద్ద. వ్యాయామం చేసిన శరీరం. తండ్రి దర్జీపని చేయడం, కొడుకు ఈ పోరాటంలో పాల్గొనడం. ఇంట్లో ఎప్పుడూ రెండు పూటలా తినడానికి తిండి వుండేదికాదు. అలాంటప్పుడు తండ్రీకొడుకులను ఈ గొడవల్లో దిగనివ్వకుండా ఎలా వుంచడం? మనల్నే అందులో దించగలరు చూడు బ్రదర్, అందరి తండ్రులు మా తండ్రి మాదిరి చాకచక్యంకలిగివుంటారా? పైగా వేణీలాల్ అంటే, గాంధీగారి ప్రభావంలో పూర్తిగా మునిగిపోయిన వాడాయె. రాట్నం వడికి ఖద్దరు బట్టలు ధరించేవాడు. దర్జీపని చేస్తూ కూడా విదేశీబట్టలు కుట్టేవాడు కాడు. కుడితే మనమెక్కడ చూడబోతాము ! ఈ వేణీలాల్ పెద్దకుమారుణ్ని ఒక ఇంగ్లీష్ సార్జెంటు తుపాకితో కాల్చి వేశాడు. ఈ విషయం నేను షణ్ముఖుని నోటివెంట అనేకమార్లు విన్నాను. నిజమెంతో షణ్ముఖుడికి అతని తండ్రికే తెలియాలి.

* * * *

వేణీలాల్ కూడా ఎంత పిచ్చివాడు ! కొండంత కొడుకును ఒకణ్ని పోరాటంలో పోగొట్టుకొని కూడా రెండో కొడుకును మళ్ళీ ఆదారిలోనే తోశాడు. ఆ తండ్రీ కొడుకుల కలాపాలన్నీ చూస్తూ చూస్తూ మా తండ్రి ఒళ్ళుకూడా గగుర్పాటు చెందింది. ఆయనలాంటి అనుభవజ్ఞుడైన అధికారిని రాజీనామా ఇప్పించి 'క్విట్ ఇండియా' ఆందోళనలోకి లాగగలిగిన వాడు ఎవడున్నాడు? ఆయనకు నా గురించి అసలే దిగులుగా వుండేది. నేను అమాయకుడిగా వుండేవాణ్ని. మా పొరుగునే షణ్ముఖుడుండేవాడు. నిజం చెప్పాలంటే నేను షణ్ముఖుణ్ని చూసి ప్రభావితుణ్నాయి పోయాను. ఒడ్డూ పొడవూగల అతని గౌరవర్ణ శరీరం, కాంతి వెదజల్లే కండ్లు, ఇంగ్లీషువారి పాలన విషయం విన్నప్పుడల్లా ఆ కండ్లు నిప్పులుకక్కేవి ఏ మారు ఏ ఊరేగింపులో అందరికంటే ముందు రొమ్మువిరిచుకొని నడవడం చూచాను. ఎంతావేశం ! మిన్నుముట్టేట్టు నినాదాలు చేసేవాడు అతనిచేతుల్లో జండా వుండేది. ఇదంతా నేను మా ఇంట్లో తలుపుచాటున వుండి గుండె ధడధడలాడు తుండగా చూశాను. అకస్మాత్తుగా గుర్రపుస్వారీ పోలీసులు లాటీలు విసురుస్తూ తుపాకులు ఎక్కుపెట్టి ముందుకు దూకారు. .కాని అతనిపేరే షణ్ముఖుడైపోయె. జండాదించలేదు నినాదాల మానలేదు. టపటపపా లాఠీలు మోగాయి. షణ్ముఖుని తల పగిలింది పట్టుకెళ్ళి కటకటాల్లోకి తోశారు. ఆరునెల్లు శిక్ష పడింది "చూశావా, విప్లవకారుల పరిస్థితి ఇలా వుంటుంది"అంటూ గొక్కి చెప్పాడు మా తండ్రి నాతో.

కొడుకు జైలు కెళ్ళాడు. కాని వేణీలాల్ కండ్లలో ఒక్కబొట్టు కన్నీరు కూడా నేను చూడ లేదు. పైగా అంటాడూ, "ఆరు నెల్లంటే ఏముందీ ? చిటికెలో గడచిపోతాయి. తరువాత షణ్ముఖుడు విడుదలై వస్తాడు రాగానే మళ్ళీ పోరాటంలో. . . . . . అరే ! ఏముందీ ఇందులో ! పోలీసులు కొట్టిన లాటీదెబ్బలకు బదులు తీర్చుకోకుండా వుంటాడా ? ఈ మాటలు నేను మా తండ్రిగారితో చెప్పగా "ఆ ముసలాడి బుర్ర చెడిపోయింది. ఒక కొడుకును పోగొట్టుకున్నా తృప్తి లేక మళ్ళీ రెండోవాడిని. . . . . ."అన్నాడు.

ఆరునెల్ల తరువాత షణ్ముఖుడు జైలు నుండి విడుదలై వచ్చాడు. అతడు కొంచెం కూడా మారలేదు. కాకపోతే కొంచెం చిక్కిపోయాడు. కొన్నాళ్ళ తరవాత నాకు ఒక విచిత్రం చెప్పాడు. జైల్లో ఎవరో బెంగాలీ బాబు వద్ద బాంబులు తయారు చేయడం నేర్చుకుని వచ్చాడట. ఇప్పుడు దాన్ని ఇచ్చట ప్రయోగించాలను కుంటున్నాడట. అతడి మాటలు విని నేను అదిరిపడ్డాను కాని అతడు పకపకానవ్వుతూ "ఏరా, నువ్వేమైనా ఆడపిల్లవా ? ఆ మాత్రం నీకు ధైర్యం లేదా? నీవు ఇంగ్లీసోడి ఉప్పు తిన్నావు నీయబ్బ నీ చెవుల్లో ఆందోళనకు వ్యతిరేకంగా విషం పోశాడు నీ జీవితము, నీ యబ్బ జీవితము విదేశీయుల బూట్లు నాకడంలో గడచి పోతాయి" అన్నాడు.

ఎంత కోపం వచ్చిందంటే, అప్పుడే ఆ మాటలు మా తండ్రికి చెబుదామనిపించింది ఆయన పోలీసులకు ఫోను చేసేవాడు. వెంటనే మళ్ళీ షణ్ముఖుని చేతులకు బేడీలు పడేవి కాని నేను మీతో చెప్పాను గదా? షణ్ముఖుని విచిత్ర ప్రభావం నాపైన పడు తుండేది. బాంబు సంగతి తండ్రిగారికి చెప్పడానికి నాకు

ధైర్యం లేక పోయింది షణ్ముఖుడు మేడపైన గది తలుపు బిగించుకొని గంటలకొలది లోపలనే వుండిపోయేవాడు. ఏంచేస్తున్నాడో ఎవరికి తెలుసు? కాని నాకేమో కుతూహలంగా వుండేది కాని... కాని ఒకనాడు షణ్ముఖుడే నాకుతూహలాన్ని తీర్చాడు. తీన మేడగదిలో తలుపు బిగించి ఆ వస్తు సామగ్రి వంతా చూపించాడు. "చూడు మిత్రమా, ఈ మందు.....ఈ మేకులు...... ఈ వయర్లు.... ఈ గాజు.....ఈ రసాయనాలూ.....వీటన్నిటితో బాంబు తయారవుతుంది"అంటు నవ్వాడు. నా కండ్లు చెదిరి పోయాయి. వో క్షణం ఆ సామగ్రివేపు మరోక్షణం షణ్ముఖుని వేపు మార్చి మార్చి చూస్తూ వుండిపోయాను. నాకు చెమటలు పట్టాయి. తలుపు తెరవగానే బయటికి పరుగెత్తాను వెనకనుండి షణ్ముఖుడి మాటలు వినపడ్డాయి. "ధూ పిరికి నాయాలా?"

మా తండ్రి ఇల్లు మార్చే వుద్దేశపడటం, కొన్నాళ్ళలో వేరే ఇల్లు దొరకడం మంచిదే అయింది షణ్ముఖుని స్నేహం తప్పిపోయింది తరువాత ఒకటి రెండు నెలలకే మా తండ్రికి బదిలీ అయింది. మేము ఆ ఊరే వది లేశాము. కొన్నాళ్ళ తరువాత పత్రికలలో వార్తలు వచ్చాయి "బాంబులుతయారు చేస్తుండగా ఒక ముసలివాడు చనిపోయాడు. అతని కొడుక్కు వళ్ళు కాలింది" నిజానికి అది వేణీలాల్ షణ్ముఖులవార్తే. మా తండ్రి ఆ పేపరు నాకుచూపించి "చూశావా బాబూ! చెడ్డ పనులకు ఫలితం చెడుగానే వుంటుంది" అన్నాడు. నేనేమీ మాట్లాడ లేదు. కాని షణ్ముఖుడి ప్రకాశవంతమైన రూపము, అతడి కండ్ల కాంతి నా ఎదుట కదిలినట్లనిపించింది.

★ ★ ★ ★

ఆ సంవత్సరం వర్షం బొత్తిగా పడలేదు. అందువలన కూడా మాకు తలనొప్పి। "స్కేర్‌సిటీ రిలీఫ్ ఆపరేషన్స్" ప్రారంభించండి, రైతులకు తక్కావీ ఇవ్వండి తిండిగింజలు సమకూర్చండి, "ఒకవేళ వర్షాలు ఎక్కువగా పడితే, వరదలు వస్తే కూడా మాకు విశ్రాంతి వుండదు "సహాయక సామగ్రి చేకూర్చడం మంత్రిగారి టూర్ అరేంజి చేయండి. పత్రికలలో ప్రకటనలు యివ్వండి. ఎవరైనా ఎక్కడైనా నిరశన వ్రతం పూనితే అతణ్ణి అణగద్రొక్కండి."ఈలాంటి పై పనులు తలఎత్తుతుండేవి ఆలాంటప్పుడంతా మా తండ్రిగారు కరువులో అధికమాసం వచ్చినట్లున్నదని అంటూ వుండేవారు స్వాతంత్ర్య పోరాటపు వీరులకు పెన్షన్ ఇచ్చే పథకం విషయం విని మా తండ్రిగారి ప్రతిక్రియ ఎలా వుంటుంది? బహుశా . ఆయన అనేవాడు .....

ఆఫీస్‌లోని ఎయిర్‌కండీషనర్‌కు చెడిపోడానికి ఇవాలే ముహూర్తం దొరికిందా? దద్దమ్మలు, అంతా గాడిదల్లా తయారయారు ఎయిర్‌కండిషనర్‌ను బాగు చేయించమని హెడ్‌క్లర్క్‌కు ఎప్పటినుంచో చెబుతున్నాను కాని వినేవాడె వడూ? అతడు కూడా స్కేర్‌సిటీ రిలీఫ్ పనుల్లో మునిగివున్నాడు. అందులోనూ చాకచక్యం గలవాడు.

నా ఛాంబర్‌లో మరో నాలుగు కుర్చీలు వేయించమని ఆ పటేల్‌తో చెప్పాను కలెక్టర్‌కంటే నన్నుకలిసేవాండ్లసంఖ్య ఎక్కువయింది కాని ఆయ వకుమాత్రం తీరుబడి ఎక్కడుంది. ఆయన కూడా పొలిటికల్ సఫరర్స్ గొడవల్లో పడ్డాడు. దొంగవెధవ. లంచాలు కూడా తీసుకుంటున్నట్టున్నాడు. నేను. వాణ్ణి ఆపాద మస్తకం ఎరుగుదును గదా? ఎవడిఫలితం వాడు అనుభవిస్తాడు చూసీ చూడనట్టు ఊరుకోవలసి వస్తుంది. లేకపోతే మనల్ని కూడా కాటు వేస్తాడు. వీళ్ళంతా విషసర్పాలు. వీళ్ళనెవరు నమ్ముతారు.

★ ★ ★ ★

మళ్ళీ ఎవరూ, ఛాంబర్ తలుపు తీశారు ? నాకు తెలుసుగా? పటేలే, ఈ తలనొప్పి మళ్ళీ.... ..

'సార్, మీతో మాట్లాడాలని ఎవరో వచ్చారు."

పటేల్ చెప్పాడు .

'పటేల్, నువ్వే సరిచెప్పి పంపరాదా?"నేను అలవాటు ప్రకారం అనేశాను. తరవాత మళ్ళీ 'చూడు, పటేల్ స్వాతంత్ర్య పోరాటపు వీరుడెవరైనా వస్తే అతణ్ణి లోపలకు అడుగు పెట్ట నివ్వవద్దు. నువ్వు పై పై మాటలు ఏవో చెప్పి .........."

"సరేసార్, కాని ఇతనెవరో తమరినే కలుసుకోవాలంటున్నాడు. తనకు మీరు తెలుసునని కూడా చెబుతున్నాడు "

'స్వతంత్రం వాడా?"అని అడిగాను పటేల్ జవాబు చెప్పబోతున్నాడు. ఇంతలోనే తలుపు తెరచుకొంది. ఒక ముసలాడు లోపలకు జొరబడ్డాడు. నాకు విసుగు కలిగింది. విసుగు పడవలసిందే, అనుమతి లేనిదే, నా ..డిప్టీ కలెక్టర్ ఛాంబర్‌లోకి ఎవడంటేవాడు జొరబడితే పనులెలా సాగుతాయి. కాని ఇందులో పటేల్‌దే తప్పు. అతడు ఇతణ్ణి బయటకు ఎందుకు లాగివేయలేదు ఇంకో జవాను ఏంచేస్తున్నాడు ? ఈ మనిషి నడుం వంగిపోయింది. మురికిబట్టలు, మాసిన గడ్డం చేతులోకర్ర వో కన్ను లొట్టపోయి మరోకన్ను కనబడుతుంది. సంస్కారంలేనిజుట్టు. నేను అతన్నేచూస్తూ వుండిపోయాను. అతడు నావేపు నడిచాడు నాకు చేతులుజోడించాడు తరువాత అతని గొంతు సాగింది వణకిపోతూ వుంది. అయినా చావు సమీపించిన సింహగర్జన మాదిరి వుంది

'సార్......."

నాకు వోణుకు పుట్టినట్లయింది 'నో, ఇట్స్ ఇంపాసిబుల్" నేను గట్టిగా పెదాలు నొక్కుకొని, వో చూపు అతని మీద విసిరి, మళ్ళీ టేబుల్ మీదవున్న ఫయిళ్లల్లో...... ...

అతడు మళ్ళీ పిలిచాడు —సార్ .... "

ఇకనాకు ధైర్యం నన్నగిల్లింది, నేను రంకె వేశాను.

"ఏం కావాలి నీకు? అనుమతిలేకుండా లోపలికి ఎందుకొచ్చావ్? నడువ్ బయటికి వెంటనే ?"

సార్ సార్, నేను షణ్ముఖుణ్ణి వేణీలాల్ కొడుకును..... కొన్నేండ్లక్రితం నేను మీ పొరుగున వుండేవాణ్ణి స్వతంత్రపోరాటంలో

పాల్గొన్నవాణ్ణి. తమరు మా ఇంటికి. . . . .బాంబుపేలి నాకు ఒక కన్ను పోయింది. ఇప్పుడు నేను దరిద్రుణ్ణయ్యాను. సార్. . . .దయ చూపండి.. నాకు పెన్షన్ ఇప్పించండి. మీరే నాకు ఆధారం. ఆకలితో చచ్చిపోతున్నాను. పెన్షన్ రూకలు యిప్పించండి. నేను ఎలాగో జీవితం గడుపుతాను . తమరు నన్ను ఎరుగుదురు. . . . . .నేను మీ పేరు విని పరుగెత్తుకుంటూ వచ్చాను. మీరు గుర్తించి దయ చూపండి."

నేను వ్యాకులత చెందాను. రెండు చేతుల్తో తలపట్టుకుని పెద్దగా అరచాను.

'నేను ఎవర్నీ. . . . .ఎవర్నీ ఎరగను. నిన్ను. . . .నిన్ను కూడా ఎరగను. . . . . . . . .వెళ్ళిపో. . . . .పటేల్, ఇతణ్ణి బయటకు లాగివేయ్. ఏం చేయాలో చేసేయ్ . . . . . . ."

కొద్దిక్షణాల్లోనే అతని ఆ గుండెలు పిండే మాటలు తొలగి పోయాయి. ఛాంబర్‌లో మళ్ళీ ప్రశాంతత ఏర్పడింది. కళ్ళువిప్పి వలువేపుల చూశాను. ఎవరూ లేరు. ఆ . . . . . . . . . .! ఇప్పుడు ఎంత బాగుంది. కోటుజేబులో నుండి చేతిగుడ్డ తీసుకొని ముఖాన చెమట తుడుచుకున్నాను. ఒక వేడినిట్టూర్పు విడిచాను. ఎటువంటి మనుషులు వస్తూంటారో తెలియదు. వచ్చినవాండ్లంతా చెబుతుంటారు. 'సార్ మీరు నన్ను ఎరుగుదురు." నేను సరిగ్గానే జవాబు చెప్పాను. 'నే నెవర్నీ ఎరగను. వెళ్ళిపో !" అవునూ ? ఇందులో నేనేమైనా తప్పు మాట్లాడానా ? నేను ఇలాంటి షణ్ముఖుణ్ణి ఎప్పుడెరుగుదును ? నాకు తెలిసిన షణ్ముఖుడు రొమ్ము విరచుకొని నడిచే వాడు. నినాదాలు చేసేవాడు. జెండా ఎగురవేసేవాడు. . . .మరి. . . .ఈ. . . .సార్ ! సార్ ! దయ, కృప, . . .సహాయం, ఆహా, ఓహో ! షణ్ముఖుడు బాంబు పేలినపుడు ఎందుకు చచ్చి పోలేదు. అతడు చచ్చిపోయివుండవలసింది.

ఏయిర్‌కండీషనర్ నడవడం లేదు. అందువల్లనే ఈ రోజు చెమటలు పడుతున్నాయా ?



# "అశ్రువు"

## "వాగీశ్వరి"

కన్నీరూ, కన్నీరూ
నీ వెనక కథ ఏమిటి ?
"నన్ను కన్నవారికి తెలుసు"
కన్నీటిని గన్న కళ్ళూ, కళ్ళూ !
కన్నీటి గాథ ఏమిటి ?
"మా యజమానికి తెలుసు"
యజమానీ, యజమానీ !
అక్షిసరిల స్వామీ !
కన్నీటి కథ ఏమిటి ?
"అయ్యో, కన్నీటి కథా ?
గాలి తగిలినా కదిలిపోయే అనుభూతి యంత్రం
ఒక్క గుండెకే తెలుసయ్యా !"
గుండెని పలకరించగానే
గుండె విడిపోయింది —

* * *

అయ్యో,
అశ్రువు !
కను గొలుకుల నించి జాల్వారే
ఒక నూరు పాయల (నది) శతద్రువు —
ఇది,
ఎప్పుడో, ఎందుకో, ఉప్పగా కదులుతుంది —
ఉప్పెనగా ఉబుకుతుంది —
ఇది,
గుండే గుండెనీ తన మౌన భాషతో కలుపుతుంది —
జాలితో తడుపుతుంది —
ఈ కన్నీటి వంటి
ఎన్నెన్ని గాథా సప్తశతుల చిత్ర విచిత్ర గతులు !
ఈ కన్నీటి గట్టున
ఎంతమంది నవాబులు, గరీబులు, రక్తులు,
భక్తులు, రుజాగ్రస్తులు !
దీనులు, హీనులు, నిద్రాలవ దరిద్రాణులు !

ఈ కన్నీటి మీద కొట్టుకుపోతూ
ఎన్ని రంగు రంగుల కలల పీలికలు!
ఈ మున్నీటి కింద,
ఎంత రహస్యాగాధం!

అర్ధరాత్రి, అకస్మాత్తుగా, ఉయ్యాల్లో లేచి కూచుని
అతి నిశ్శబ్దంగా రోదించే పసిపాప బుగ్గమీది కన్నీటి వాంలో
తెలీని ఉప్పని రహస్యం —
చావబోతూ, చావు మర్మం చెప్పబోతూ, మాట రాని
మనిషి కన్నీటిలో గడ్డకట్టిపోయిన
మరణ మౌన రహస్యం —
గుడి కళ్లల్లో నుళ్లు తిరిగే భగ్న బాష్ప రహస్యం —
అతి నవ్వు తడిసిన కన్నీటి ధవళ రహస్యం —
గోమాత కనుల బాష్ప బిందువులోని నీల రహస్యం —
పక్షి అశ్రు రహస్యం —
పరమ హంస ధ్యాన సమాధిలో కనురెప్పల మధ్య మొలిచిన
తరళ ముత్యంపు రహస్యం —
ఆకాశం చెంపలమీది కన్నీటి చుక్క రహస్యం —
ఎవరు విప్పగలరు?
ఎవరు చెప్పగలరు?
ఈ దారి పొడుగునా అశ్రు భరావనత శిరస్సులు!
ఈ ఎక్క అడుగడుగునా కదుష కజ్జల బాష్ప సరస్సులు!

* * * * *

అయ్యో,
అశ్రువు,
అనంత మనోభావానుభవ ప్రపంచానికీ
పరిణత రసరూపం!
అద్భుతం దీని విశ్వరూపం!
అది కరుణార్ద్రమాయెనా
గుండెల్లో మానవత్వం పల్లవిస్తుంది!
అది అట్టుడికి ఉడికి వేడెక్కెనా
అగ్నిగా విప్లవిస్తుంది, దహిస్తుంది!
అవును మరి, అలాగే
అశ్రువులోంచే ఆది కావ్యం పుట్టింది —
జీవన కావ్యానికీ అశ్రువే ఆది —
ప్రతి నూత్న సృష్టికీ అశ్రువే పునాది

# ఛందోదర్శనం [నాటిక]

శ్రీ గంటి శ్రీరామమూర్తి

(సమయం : ఉదయ సంధ్య— పక్షుల కిలకిలారావాలు. గలగల ప్రవహించే సెలయేటి ధ్వానం)

(ప్రవేశం: కావ్య కంఠవాసిష్ఠ గణపతిశాస్త్రి ఉరఫ్ "నాయన", "దైవరాత, 'సుధన్వ', నారాయణ ఘనపాఠి, వాసుదేవశాస్త్రి మొదలైనశిష్యులు, నాయన భార్య విశాలాక్షమ్మ. 'నాయన' వయస్సు సుమారు 32 సం లు. మిగతావారు సుమారు 25 సం. ల వారు. విశాలాక్షమ్మ వయస్సు సుమారు 25 సం. లు)

నాయనః— వత్సా! దైవరాతా!

దైవరాతుడు— ఆనతీయండి గురుదేవా!

నాయన.— చూశావా ఈ ప్రాంతం ఎంత దర్శనీయంగా ఉందో! శాంతి నిశ్శబ్దంగా యిక్కడ నర్తిస్తున్నట్లనిపిస్తోంది.

దైవరాతుడుః— అవును గురుదేవా! ఈ పవిత్ర కుండలినీ ప్రవాహం, యీ పాడుపడ్డ 'పడై వీడు' క్షేత్ర మహాత్మ్యాన్ని మధుర కంఠంతో గానం చేస్తున్నట్లుంది.

విశాలాక్షి — ఏ క్షేత్రంలోనూ అనుభూతికి రాని ఏదో ఒక భావన ఒక ఉద్దీపన యీ క్షేత్రంలో కలుగుతోంది నాకు. ఇక్కడే కొంతకాలం తపస్సు చేసుకుందామని ఉంది

నాయన — అవును విశాలా, నీవు చెప్పింది నిజం ఈ క్షేత్రం ఇతర క్షేత్రాల కన్న విలక్షణంగా కనిపిస్తోంది. ఆధ్యాత్మ చింతనకు ఎంతోఅనుకూల మైన వాతావరణం ఇక్కడ కనిపిస్తోంది. (చుట్టూ పరికిస్తూ ఏమిటీ స్థల వైభవం! ఇలా చూడండి. ఈ నది ఒక చోట పాము పిల్లలా అతి సన్నగా మరొక చోట విస్తృత ఫణి ఫణాభంగా వెడల్పుగా ఇంకో చోట సహస్రధా భిన్నమైన ధారా ప్రవాహంతో వివిధ రీతులతో ఎలా ప్రవహిస్తోందో చూడండి దైవరాతా! ఇలా రా! ఆ కనబడే కొండ ఈ క్షేత్రాన్ని ఎలా పరివేష్టించి ఉందో చూడు. ఈ క్షేత్ర భవుగోళిక స్వరూపం ఎంతో స్ఫూర్తివంతంగా ఉందికదూ!

దైవరాతుడు — పర్వత పరివేష్టితమైన 'యీ క్షేత్రం మానవ కళాపాన్ని స్ఫురణకు తెస్తోంది గురుదేవా!

విశాల.— అవును. నాకూ అలాగే అనిపిస్తోంది. ఈ నదీ ప్రవాహ గమనాన్ని చూస్తూ ఉంటే ఆజ్ఞా చక్రాన్ని భేదించుకొని సహస్రారం వైపు ప్రవహించే కుండలినీ శక్తి స్వరూపం జ్ఞాపకం వస్తోంది.

నాయన — నిజమే. ఈ నది సార్థక నామధేయ. ఇది మానవ శరీరంలోని కుండలినీ శక్తిని తలపిస్తోంది అందుకే మహర్షులు దీని కుండలినీ నదిగా వర్ణించారు. ఈ స్థలం పూర్వం జమదగ్ని మహర్షి యజ్ఞం చేసిన పుణ్యస్థలమని పురాణాలు చెప్తున్నాయి. ఇక్కడి రేణుక భార్గవ రాముని మాతృమూర్తి అనడంలో సందేహంలేదు.

విశాల — జమదగ్ని జాయ అంతటి మహిమాన్వితురాలా?

నాయన — ఆహా సందేహమా! ఆమె సాక్షాత్తూ యింద్రాణి అంశావతారమే సుమా! ఆమెయే మొన్న మన కల్యాణరాముని కలలో కనిపించిన కారుణ మూర్తి. రండి ఆమె దర్శనం చేద్దాం.

దైవరాతుడు — ఈ పవిత్ర క్షేత్రంలో మన తపస్సు తప్పక ఫలిస్తుందని అంతర్వాణి ప్రభోదిస్తోంది గురుదేవా!

నాయన — మంచిది తథాస్తు.

(అందరూ ఆలయాభిముఖంగా నడుస్తారు)

నాయన — నిరాడంబరంగా ఉన్నా, యీ వివిక్త రమణీయ ప్రదేశంలో యీ దేవాలయం ఎంత స్ఫూర్తిదాయకంగా ఉంది

వాసుదేవశాస్త్రి — క్షణం యిక్కడ విశ్రమిద్దాం గురుదేవా!

నాయన.— సరే, అలాగే కానీయండి.

(అందరూ కూర్చుందురు. క్షణం విశ్శబ్దం)

విశాల — సుధన్వా, చూడు గురు దేవులకు ఏదో ఆవేశం వచ్చినట్లుంది. ఉన్న ట్లుండి హఠాత్తుగా లేచి ప్రదక్షిణం ప్రారంభించారు.

సుధన్వ — అవునమ్మా, గురుగారు ధ్యానముద్రలో ఉన్నారు నిద్రలో నడుస్తున్నట్లు, ఏదో గొణుక్కుంటూ ప్రదక్షిణలు చేస్తున్నారు వోహో ఆశ్చర్యం! నాయన ఉచ్చస్వరంలో గానం చేస్తున్నారు. వినండి ఆ దివ్య వాణి!

'సుర శిరశ్చరచ్చరణ రేణుకా
జగదధీశ్వరీ జయతి రేణుకా'

(అందరూ లేచి పల్లవి అందుకుంటారు)

అందరూ — సురశిరశ్చర చ్చరణ రేణుకా
జగదధీశ్వరీ జయతి రేణుకా

నాయన — దేవతా శిరో దేశ లాలితం
రేణుకా పదేది శతు మేనుదం

అందరూ.— సురశ్చిర చ్చరణ రేణుకా

నాయనః— కుండలీపురీ మండనం మహః
కిమపి భాసతాం మమసదాహృది

అందరూ — సురశిరశ్చరణ రేణుకా

నాయన — మస్తకైతవం వస్తు శాశ్వతం
అస్తిమే సదా శస్త్రదం హృది

అందరూ— సురశిరశ్చర చ్చరణ రేణుకా

నాయన — ఆది నారితే పాద పంకజం
స్ఫురతు మే మనః సరసిజే సదా.

అందరూ.— సురశిరశ్చర చ్చరణ రేణుకా

నాయన — కేవలం పదోః సేవకోస్మితే
వేద్మివేతర ద్వేద సన్నుతే

అందరూ — సురశిరశ్చర చ్చరణ రేణుకా

నాయనః— హృదయతేణున. సముచితోణునా
పరిచయోంబికా పాద రేణునా

అందరూ.— సురశిరశ్చర చ్చరణ రేణుకా

నాయన — జనని కుండలీపుర నివాసిని
పరశురామ వత్సస్య మామిమం.

అందరూ.— సురశిరశ్చర చర్చణ రేణుకా

నాయన — చరణ మంబతే చరతు మే హృది
ఇయమనామయే ప్రార్థనా మమ

అందరూ.— సురశిరశ్చర చ్చరణ రేణుకా

నాయనః— భుజగ కంకణ ప్రభృతి సంస్తుతే
భుజ భువామరేర్జ్ఞనిపాహిమాం

అందరూ.— సురశిరశ్చర చ్చరణ రేణుకా

నాయన — కుండలీ పురీ మండ నాయితా
గణపతి స్తుతా జయతి రేణుకా

అందరూ — సురశిరశ్చర చ్చరణ రేణుకా
(గుడిలో గంటలు మ్రోగుతాయి)

దైవరాతి— సుధన్వా చూడు! మన గురువర్యుల ముఖం ఎలా జాజ్వల్యమానంగా వెలిగిపోతోందో!

సుధన్వ — దేవీ స్వరూప సాక్షాత్కారానికి నోచుకున్న ఆ విశాల విస్ఫారిత నేత్రాల అపూర్వ శోభ వర్ణనల కందనిది సుమా! గురుదేవుల తేజస్సు దుర్నిరీక్ష్యంగా ఉంది.

(అందరూ దేవాలయ బహిరప్రదేశానికి నిష్క్రమిస్తారు. అక్కడ విశ్రమిస్తారు)

నాయనః— నాయనలారా! ఒక్క మాట.

అందరూ.— సెలవియ్యండి గురుదేవా!

నాయనః— ఈనాటి రేణుకా దర్శనం నాకొక అపూర్వానుభూతిని, స్ఫూర్తిని కలుగజేసింది. రేణుక నాయందు పూర్తిగా ప్రసన్నురాలైంది. ఈ అవకాశం జారవిడువను. నా తీవ్ర తపశ్శక్తిచే తిరిగి దేవీదర్శనం పొంది, వేదోక్త అస్త్ర విద్యను గ్రహించి, భరతఖండాన్ని విషాదవిర్జితం చేస్తాను. ఇదుగో, ఇప్పుడే ఆ కనబడే కచేరీ గడియారానికి అనతి దూరంలోనే తీవ్రమైన తపస్సు ప్రారంభిస్తాను. పగలుపవసించి, రాత్రి పాలు మాత్రం తీసుకుంటాను. ఈ కఠోరముని వృత్తి నా లక్ష్యం సిద్ధించేవరకు నిరంతరంగా సాగుతుంది. మీరు వెళ్లండి.

దైవరాతుడు— క్షమించండి గురుదేవా! ఏనాడు మీ శుశ్రూష ప్రారంభించేనో, ఆనాటి నుండి యీనాటి వరకూ, మీ తపో యాత్రలన్నిటిలోనూ భాగస్వామినయ్యానే, మీతోబాటే నేనూ తపిస్తూ వచ్చానే నదీ తీరాల్లో, కొండ గుహల్లో, శార్దూలాది నానా క్రూర మృగాకులిత నిర్జనకాంతార మధ్యంలో, మహేంద్రపర్వత శిఖరంమీద, భువనేశ్వరాది క్షేత్రాల్లో, ఘోర తపస్సు మీ ఆజ్ఞాబద్ధుడనై మీతో సహా చేస్తూ వచ్చానే, ఈవేళ మీ అనుగ్రహం నాకెందుకు కరువైంది గురుదేవా! ఆనతియ్యండి గురువర్యా! నేను కూడా యిక్కడ తపస్సు చేసుకుంటాను. మీ కరుణాతిరేకం చేత దేవి నన్ను కూడా అనుగ్రహిస్తుంది. అంజలించి అర్థిస్తున్నాను గురుదేవా! అనుగ్రహించండి (పాదాలపై పడును)

నాయన — నాయనా! దైవరాతి! లే! నీ కోర్కె నేనెప్పుడైనా కాదన్నానా? దేవి నీ చేత ఏ మహత్కార్యం చేయించనున్నదో ఎవరెరుగుదురు. లే నాయనా! లే! మనిద్దరం నరననారాయణులలా తపస్సు చేసి చరిత్రార్థుల మవుదాం. దేవిని ప్రసన్నం చేసుకొని మంత్ర శక్తిని, నిరుపమాస్త్ర తతిని సంపాదిద్దాం. పరరాజులను పారద్రోలి, భరతమాతకు దాస్య విమోచనం చేదాం. పీడిత ప్రజానీకానికి శాంతి సౌఖ్యాలను ప్రసాదిద్దాం. లే వత్సా! లే! మన తపస్సు భరతఖండానికి శ్రీరామ రక్ష కావాలి.

దైవరాతుడు.— ధన్యుణ్ణి గురుదేవా! ధన్యుణ్ణి.

విశాలః— నా చిన్ని కోరికను కూడా మన్నించండి స్వామీ. ఈ క్షేత్రంలో అడుగు పెట్టగానే నాలో తపో వాంఛ రేకెత్తింది. స్త్రీ జనోద్ధారకులైన మీరు నాకు తప్పక అనుమతిని ప్రసాదించగలరు.

నాయనః— విశాలా, నా సహధర్మచారిణివి, నీ కోర్కె కాదనగలనా? మన సమిష్టి తపస్సు చేత దేవి తప్పక ప్రసన్నురాలవుతుంది. సుధన్వా, ఘనపాఠీ, వాసుదేవశాస్త్రి మీరు పని వినండి మెలకువగా ఉండండి.

అందరూః— జయోస్తు గురుదేవా! జయోస్తు!

(అందరూ నిష్క్రమిస్తారు. నాయన, విశాలాక్షి, దైవరాతి ధ్యానంలో మునిగిపోతారు. తపస్సూచకంగా ఓం... ఓం... ఓం... నాదం వినిపిస్తుంది.

కొన్ని రోజుల తర్వాత ఒక సాయంకాలం)

సుధన్వ:— గురుదేవా, ముప్పై రోజులు గతించాయి. ఈ ఘోర తపస్సుతో చిక్కిశల్యమై పోతున్నారు. ఇంకా ఎంతకాలం మీ తపస్సు. నాకు భయంగా ఉంది గురుదేవా!

నాయన:— నాయనా భయపడకు. నా తపస్సు ఫలించి, వేద దర్శనం అయే దాకా యీ దీక్ష సాగవలసిందే. మధ్యలో శరీరం రాలిపోతే రాలిపోనీ. మాతృదేశ వినిర్ముక్తికై యీ తనువు హుతమైతే అంతకన్న కావలసిం దేముంది. మంత్ర దర్శనం అయినాకే విరతి. ఈ నిర్ణయానికి తిరుగు లేదు.

సుధన్వ:— ఈ ఫలారగించండి స్వామీ!

యన.— మంచిది. ఇటుతే. ఇంకా తపించడం విశాలకు మించిన పని. అందుకే ఆమెను విరమించని ఆదేశించాను.

సుధన్వ:— మంచిది గురుదేవా! ఇక శలవు.

(అర్ధరాత్రి గడియారం టంగ్ . . .టంగ్ . . .టంగ్ . . . పన్నెండు మార్లు కొడుతుంది)

సుధన్వ:— అబ్బా పన్నెండైంది. ఇక నిద్రపోతా. — అరే! ఏమిటిది? ఆశ్చర్యం! మా గురుదేవులేనా అది. ఏమిటలా పెరిగిపోతున్నారు. తాళ ప్రమాణమైన యీ మానవాకారం నడక ప్రారంభించింది. అమ్మో! భయం వేస్తోంది. ఘనపాఠీ, వాసుదేవా— అయ్యో! ఎవరూ పలకరేం? అదుగో ఆ రూపం అంగలేస్తూ ప్రాకారం దాటి ఆలయం ప్రవేశించింది. మిరుమిట్లుగొలిపే ఆ కాంతి ఏమిటి? ఆ చలత్కాంతి వెనకాల— యీ భేతాళమూర్తి. అయ్యో తల తిరిగిపోతోంది. అంతా తిరిగిపోతోంది. గిర గిర గిర గిర తిరిగిపోతోంది. అమ్మో (పడిపోతాడు)
(ఉదయం సమయం— గుడిలో గంటలు)

సుధన్వ:— గురుదేవా! రాత్రి జరిగిన వింత తలుచుకుంటే శరీరం యిప్పటికి గగుర్పొడుస్తోంది. అసలేం జరిగిందో శలవిస్తారా?

నాయన:— నిన్న రాత్రి నా జీవితంలో స్వర్ణాక్షరాలతో లిఖింపదగిన గొప్ప సమయం. గొప్ప సంఘటన. సుధన్వా! నా తపస్సు ఫలించింది. నా కల జగన్మాత మహేశ్వరి ఇంద్రాణి రేణుకా రూపంలో స్వయంగా నా ఎదుట సాక్షాత్కరించింది. జవసత్వాలుడిగి శవంలా శవాసనంలో ఉన్న నా ఉరులపై వ్రణం చేసి, సైగ చేసి, తన వెంట రమ్మని ఆహ్వానించి, దేవాలయాంతర్భాగంలోకి తీసుకువెళ్ళింది. నా శరీరం అప్పుడు మేరుతుల్యంగా పెరిగింది. ఆమె నన్ను ఏక ముఖ కుమారస్వామి దగ్గరకు తీసుకువెళ్ళింది. కుమారస్వామి శక్తిని తాను గ్రహించి నాకు అందించింది. ఇదిగో యీ భుజాల్నపైనే ఆ శక్తిని ధరించాను. మళ్ళీ నిద్రలోవలె నడచి వచ్చి యథాప్రకారం శవాసనంగా పవ్వళించాను. మళ్ళీ ఆ కారుణ్యమూర్తి నా తొడను గోట గీరి లేపింది. చూడు, యీ వ్రణాలు ఎలా ఉన్నాయో యిప్పటికీ! ఏమని చెప్పను ఆదివ్యానుభూతిని. మళ్లీ కుమారస్వామి నుండి శక్తిని గ్రహించి నాకిచ్చింది. ఆమె అదృశ్యమైంది. ఇంతలో జటాధారి భగవాన్ పరశురాముడు తన గండ్రగొడ్డలితో సాక్షాత్కరించి నా వైపు కారుణ్య దృక్కులు ప్రసరించి నిర్గమించాడు. నా నోట అప్రయత్నంగా—

"రాయస్కామో వజ్ర హస్తం సుదక్షిణం
పుత్రోనపితరం హువే"

అన్న ఋఙ్మంత్రం దూసుకు వచ్చింది. ఆ సూక్తమంతా వెంటనే జ్ఞప్తికి వచ్చింది. పఠించాను. నా నోట వచ్చిన మంత్రం విరాట్ ఛందంలో ఉండి, ఆ సూక్తంలోని మిగతా మంత్రాలకన్న విలక్షణంగా ఉంది. చటుక్కున ఆ మంత్రమే మహాస్త్రమని ద్యోతకమయింది. దేవి నాకా విధంగా దివ్యాస్త్రాన్ని అందించింది. ఆనాడు వాసిష్ఠుడు దర్శించిన మహా మంత్రం మళ్ళీ ఈనాడు వాసిష్ఠునకు దర్శనమిచ్చింది. దివ్య చక్షుర్గోచరమైన మంత్ర దర్శనంతో నేడు నేను నిజంగా మునినయ్యాను. నేను గణపతి మునిని— నేను గణపతి మునిని— ధన్యుణ్ణి సుధన్వా! నా జన్మ సఫలమైంది.

సుధన్వ:— ఇది గురుదేవా! మా అహో భాగ్యం. ముమ్మాటికి మా మహాభాగ్యం యిది.

నాయన:— ఆగు. ఒక్క క్షణం ఆగు సుధన్వా! మన దైవరాతుని నోట ఏదో శబ్ద పరంపర వస్తోంది విను.

సుధన్వ:— (వినుట నభినయించి) మునివర్యా! ఏదో అస్పష్ట శబ్ద పరంపర ఇతని ముఖతః నిర్గమిస్తోంది.

నాయన.— ఏ మాశ్చర్యం! ఏమిటీ అపూర్వ అనిర్వాచ్య శబ్ద సందోహం. ఓహో ఈ శబ్దాలు అస్పష్టమైనా నియంతగా వస్తున్నాయి. ఏదో విలక్షణమైన లయ వినిపిస్తోంది. అంతరంతరాళాలో విస్మృతి మర్మాన్ని తాకుతోంది.

(ఒక్క క్షణం నిశ్శబ్దం. ఈ మంత్రం వినిపిస్తుంది.
'నమస్తే దేవి వ స్రవ చంద్రమసేహమూర్ధని'
రసం పిబామి జిహ్వా యా పరస్వత్యాన్తవవాచ.)

నాయన:— అనుగృహీతోస్మి, మాతా అనుగృహీతోస్మి.
సుధన్వా, ఘనపాఠీ వెంటనే వ్రాత సామగ్రి తీసుకురండి జగన్మాత నన్ను పూర్తిగా అనుగ్రహించింది. అవి ఋఙ్మంత్రాలు. అవి నే వింటున్నాను. అవి పరమేశ్వరుని నిట్టూర్పులు. విస్పష్టంగా వినపడుతున్నాయి.

"నమస్తే దేవి న స్రవచంద్రమసేహ మూర్ధని'
ఆహా ఏమి నా అదృష్టం. ఛందో దర్శనం అయింది. ఋక్కులనే విన్నాను. ఋక్కులనే చూశాను. మంత్రద్రష్టనైన నేను యీ ఋక్కులను అన్వయ భాష్యం వ్రాసి తరిస్తాను. ఈ గణపతిముని చరితార్థుడు. సుధన్వా, ఈ గణపతిముని నిజంగా చరితార్థుడు.

సుధన్వ:— గురుదేవా! ఏనాటి పుణ్యమో మీ శిష్యరికం.

వాసుదేవ:— మా జన్మలు తరించాయి. గురుదేవా!

ఘనపాఠి· - జయోస్తుతే, గణపతిమునే! జయో స్తు.

అందరూ — జయో స్తుతే వేద విదాం వరేణ్య:

జయో స్తుతే మంజుల వాగ్విలాస.
జయో స్తుతే మాతంగ మునీంద్ర చంద్ర:
జయో స్తు శ్రీ మాతృ కటాక్ష శిష్ట:

దైవరాతుడు·— (కళ్ళ ఆనందాశ్రువులతో, గురుదేవా ధన్యోస్మి! అల్పుడనైన నా నోట వేద ఋక్కులు పలికించి మీ తపశ్శక్తి అనన్యం. అపూర్వం. బహుధా సంస్తవనీయం.

నాయన (దైవరాతుని కౌగలించుకుని) వత్సా! నీ వల్పుడవా? ఎలాగయ్యా? నీవు పవిత్రమూర్తివి. మంత్ర దర్శనం చేసిన బ్రహ్మర్షివి. ఈనాడు మనకు లభించిన ఈ ఛందోరాశికి నీవే ఋషివి నీవు నరుడవు. నేను నారాయణుడను నీవు మంత్రానివి నేను భాష్యాన్ని నీవు శబ్దానివి. నేను అర్థాన్ని నేను వసిష్ఠుడను. నీవు అపర విశ్వామిత్రుడవు.

"ఇదంతే మన్యతే ధీరా: నవీనం మంత్ర దర్శనం
గంభీరం దైవరాతస్య తేషాం నశ్యంతి సంశయా:

దైవరాతుడు:— ధన్యోస్మి గురుదేవా! ధన్యోస్మి.

అందరూ·— "జయతు భరత క్షోణి ఖండం విషాద వివర్జితం

జయతు గణపస్త్వస్య క్షేమం విధాతుమనా ముని.
జయతు రమణస్త్వాచార్యో మహర్షి కులాచల.
జయతుచతయోర్మాతా పూతా మహేశ విలాసినీ".

---



# రేపటి కవిత్వం

శ్రీ నూతలపాటి గంగాధరం

నిన్న సృష్టించబడినదైనా, రేపు సృష్టించబడేదైనా నైసర్గిక స్వభావాన్నిబట్టి సాహిత్యాన్ని మూడు రకాలుగా విభజింపవచ్చు.

ఒకటి—అభూత కల్పనలతో నిండినది
రెండు—కల్పనని వాస్తవం చెయ్యడానికి ప్రయత్నించేది.
మూడు—వాస్తవాన్ని కల్పన చేసేది

వీటిని వరుసగా నిన్నటి కవిత్వం, నేటికవిత్వం, రేపటి కవిత్వం అని పిలువవచ్చు.

కొంతమంది సమాజాన్ని ముందుకు నెట్టడానికి, ఎన్ని కష్టాలైనా పడతారు మరికొందరున్నారు—వారు ఆ సమాజాన్నే వెనక్కినెట్టడానికి ఎన్ని చీవాట్లైనా తింటారు పోనీ—ఎన్ని సన్మానాలైనా చేసుకుంటారు ఒకటి వివేకంతో కూడిన పనైతే మరొకటి వారి అవివేకాన్ని ప్రతిబింబించే దవుతుంది సమాజాన్ని ముందుకు నెట్టాలనే ప్రయత్నానికి ముందుమనలోని కొన్ని అంధ విశ్వాసాలను వదలగొట్టాలి మూఢాచారాలను రూపుమాపాలి. శాస్త్రీయ సత్యాల్ని తెలియ జెయ్యాలి. అన్నిటికన్నాముందు మనలోని కొన్ని ముసలి భూతాలను ఎదుర్కొనే ధైర్యరసం చాదిపోయాలి. ఈ ప్రయత్నాలు ఏ కవి అయితే చేస్తాడో అతడు నిన్న గతించినా, అతడే మనకు రేపటి కవి మనల్ని వెనక్కి నెట్టడానికి గింజుకునే కవి రేపు జీవించి వున్నా అతడు నిన్నటి కవే!

మన ప్రాచీనకవుల్లో—'పద్యము చెప్పిన సుకవికి, హృద్యముగా నియ్యనట్టి హీనాత్ముని,—నా పద్యము పామై కరచును' అని భాస్కరు కొండయమంత్రి పలికినా, —'గంటము ఖడ్గము తోడుత, నంటిన పగదీర్పవలయు నవరసమైనన్, గంటము శంఠము కొరకా?' అని కరణం మల్లన ఆవేశపడినా, —'ముందు విప్పుడు వికమీద మోదమలర, పద్యదండంబు చేబూని పార్థివులను, చంపుచున్నాడు చంపును చంపగలడు...' అని భట్టుమూర్తి ప్రళయ సమవర్తి అయినా —వారికోపమంతా స్వార్థం తోడిదే వారు కవిత్వాన్ని సర్పమన్నా, ఖడ్గమన్నా, దండమన్నా, అవన్నీ చాటువుల వరకే! వారి కావ్యాలలోని కవిత్వం సర్పమూకాదు, ఖడ్గమూ కాదు, కనీసం దండంకూడా కాలేదు. రాళ్ళపల్లివారన్నట్టు వెనుకటి కవులంతా తమకియ్యలేదని తిట్టిన వారే! 'నీవు చెడిపోతున్నా'వని తిట్టే కవిత్వం మనకు వేమనతో ప్రారంభమైంది అంటే సాహిత్యాన్ని ఒక సామాజిక శక్తిగా భావించే సంప్రదాయం మనకు వేమనతోనే మొదలైనదన్నమాట. వేమన తర్వాతివారికి గూడా వేమన కాక ప్రబంధ కవులే మార్గ దర్శకులయ్యారు —మన దవుర్భాగ్యం కొద్దీ! ఇంగ్లీషువాడి పుణ్యమా అని వేమన వేసిన నూతన సంప్రదాయ బీజం కందుకూరితో తిరిగి అంకురించి, త్రిపురనేని కవిరాజుతో ననలుసాగి, గురజాడతో పుష్పించి, శ్రీశ్రీతో ఫలితానికి వచ్చింది.

వేమన సంప్రదాయంలోని గౌరవాన్ని గుర్తించి గౌరవించడానికి మనకు ప్రబంధసాహిత్య సంప్రదాయం చాలా కాలం అడ్డు నిలిచింది. ఇంగ్లీషు భాషావాసన మన ఒంటబట్టిన పిమ్మటే వేమనలోని గొప్పతనం మనకు తెలిసివచ్చింది. అప్పుడు వేమన ఆధునికుల్లో ఆధునికుడుగా ప్రత్యక్షమైనాడు వేమన సంప్రదాయాన్ని గౌరవించే వారికి సాహిత్యం ఒక విలాసవస్తువుకాదు. రోజుకో కొత్త కెరటంతో ముందుకు సాగుతున్న ఆధునిక సాహిత్యం విలాసవస్తువు కాదనడానికి మూడు కారణాలు స్పష్ట మవుతాయి.

ఒకటి—నేటి వ్యక్తి జీవితం, సామాజిక జీవితం వేరుకాదు సామాజిక జీవితం సమస్యల సంకీర్ణం కందుకూరి సంస్కరణోద్యమ, శ్రీశ్రీ అభ్యుదయోద్యమాల పుణ్యమా అని నేటి సాహిత్య ప్రక్రియలన్నీ దాదాపు సామాజిక సమస్యలనే పునాదిగా చేసుకుని లేస్తున్నాయి కొత్తగా కలంపట్టే ప్రతికుర్ర రచయితా ఏదో ఒక సామాజిక సమస్యాచిత్రణతోనే తన రచనా జీవితానికి నాందికపలుకుతున్నాడు. నేటి సామాజిక సమస్యల్నిచిత్రిస్తూ భవిష్యత్తును నిర్మాణాత్మకంగా ఊహించే ప్రయత్నం చేస్తున్నారు.

రెండు — నేటి వ్యక్తి—జీవితాన్ని ఒక అనుభవంగా కాక పోరాటంగా ఎదుర్కొంటున్నాడు. పోరాటంలో తీరికలేని జీవితాన్ని వెళ్ళదీస్తున్నాడు తీరిక చేసుకుని సాహిత్యాన్ని గానీ, మరొకదాన్నిగానీ చేపడు తున్నాడంటే దాని నుంచి జీవితానికేదో ఒక ప్రయోజనాన్ని ఆశించే చేసు న్నాడన్నమాట. ప్రయోజనంలేని సాహిత్యాన్ని పొరకుడే చేపట్టనప్పుడు దాన్ని సృష్టించే రచయిత ఎలాంటివాడై ఉంటాడో మీరే ఊహించుకోండి.

మూడు —ప్రబంధకాలంలో కాలక్షేపంకోసం ఏర్పడ్డ పొడికలాటవంటి చతుర్విధ కవిత్వాల నామరూపాలు కూడా నేడు కనిపించకపోవడం గమనించదగ్గ విషయం.

ముఖ్యంగా రచయితలు గమనించవలసినవిషయం ఏమిటంటే —పుచ్చుకునేవాడు బాధ్యతతో పుచ్చుకుంటున్నా, దాన్ని సృష్టించి యిచ్చేవాడు బాధ్యతా రహితంగా ప్రవర్తించడమంత ఘోరమైన అపరాధం మరొకటి లేదని వెనకపడేతనం మన ప్రజల్లో ఉందో, లేదో కాని —వెనక్కి లాగే పని మాత్రం కొంతమంది మన కవులే చేస్తున్నారు.

కవిత్వం వ్యక్తిని సంస్కారవంతుణ్ని చెయ్యడానికేగానీ, మరీ ఛాందసుణ్ని చెయ్యడానికి మాత్రంకాదు వ్యక్తి సంస్కారం నుంచి సామాజిక సంస్కరణ కోసం ఉద్దేశింపబడింది కవిత్వం కవిత్వం అలాంటిది కావా

అంటే దాన్ని సృష్టించే కవి సంస్కార వంతుడయివుండాలి సంస్కార పూరిత మైన కవిత్వం —వ్యక్తిని, సమాజాన్ని సంస్కారవంతంచేస్తుందనడంలోసందేహం లేదు. సంస్కార శూన్యమైన కవిత్వంలో ఇంక ఎన్నివిలువలున్నా అవన్నీ బూడిదలోపోసిన పన్నీరు బాపతువే! కవికి ఈ సంస్కారం రెండు రకాలుగా ఉంటుంది.

ఒకటి—పరిశీలనకు చెందిన సంస్కారం
రెండు —ఆవిష్కరణకు సంబంధించిన సంస్కారం.

ఈ రెండింటిలో మొదటిది ప్రధానమైనది 'గతకాలము మేలు వచ్చు కాలముకంటెన్'అని నమ్మే సంప్రదాయానికి చెందిన సాహిత్యంలో మొదటి రకమైన సంస్కారం ఉండటం అరుదు అది నిన్నటి కవిత్వం "మంచి గతమున కొంచెమేనోయ్" అని నమ్మే సంప్రదాయానికి చెందిన సాహిత్యంలో పరిశీలన—ఆవిష్కరణలకు చెందిన సంస్కారాలు రెండూ వుంటాయి. ఇది రేపటి కవిత్వం. వెనకచూపు కలిగింది నిన్నటి కవిత్వం. ముందు చూపు కలిగింది రేపటి కవిత్వం

మన సమాజంలో —అంధ విశ్వాసాలను పోగొట్టడానికి వేమన, వితంతు వివాహాన్ని వ్యాప్తిలోకి తేవడానికి కందుకూరి, కులతత్వాన్ని రూపు మాపడానికి త్రిపురనేని, కన్యాశుల్కం తీవ్రతను అరికట్టడానికి గురజాడ, శ్రామికలోక సౌభాగ్యానికి శ్రీశ్రీ సాహిత్యం ద్వారా కృషి చేశారు వీరందరివీ ఉద్యమ రూపాల్ని దాల్చిన ఆశయాలు.

ఉప్పుకప్పురం ఒక్కపోలికతో ఉన్నా వేమన మాత్రం కవుల్లో కప్పురంలాంటివాడు వేమన కవిత్వం గంటెడు చాలు అది గంగిగోవుపాలు. వేమన మనకు మొదటి వాస్తవిక కవి. అవాస్తవాలను అపహాస్యం చేస్తూ వాస్తవాలనే కల్పన చేస్తాడు అందరూ సాధారణంగా గది తలుపులతోపాటు ముక్కు చెవులు బంధించి మూలకూర్చుని కవిత్వం రాస్తే — వేమన దేశసంచారం చేస్తూ ఏ అనుభవం తన్ను కదిలిస్తే గాని మీద కవిత్వం చెప్పడు అందుకే వేమన కవిత్వం అంత సజీవమూ, చైతన్యవంతమూను. ఆ కాలంలో కవులందరూ తమ పాండిత్యాన్ని ప్రకటించి, పండితుల మెప్పులు పొందటానికి లావు లావు ఛందస్సులూ, అంతకంటే లావు లావు సమాసాలూ దొర్లిస్తుంటే — వేమన అతిసామాన్యమైన చిన్నజాతిఛందస్సును స్వీకరించాడు. తానంటిన ఆటవెలదిని అవతలివాడంటుకోవడానికే సిగ్గుపడేటట్టుగా ఆ ఛందస్సును తన సొంతం చేసుకున్నాడు సామాన్యప్రజ నిత్యం వాడుకునే మాటలలోనే తన భావాలు వ్యక్తీకరించాడు నిత్యజీవితంలో ఎదురయ్యే సంఘటనలనే సహజ చతుర సుందరంగా వివరించాడు. కృతిమాలంకార భారంతో సామాన్య ప్రజానీకానికి దూరమైన అంధ్రకవితావధూటిని నిరలంకారంగా, నిసర్గగుణ శోభితంగా ప్రజానీకానికి చేరువగా తీసుకెళ్ళాడు వేమన. ప్రజల్లో గూడుకట్టు కొన్న అంధ విశ్వాసాలను, మూఢాచారాలను రూపుమాపడానికి మేటున కవిత్వాన్ని ఆయుధంగా ఉపయోగించాడు.

దేశంలో ఎంతో మంది తినడానికి తిండిలేక కట్టడానికి బట్టలేక, ఉండడానికి ఇల్లులేక అలమటిస్తుంటే కొంతమంది మాత్రం మూఢ భక్తితో విగ్రహారాధన నెపంతో ఎంతో వ్యయం చేస్తుంటారు. దాన్ని గూర్చి అంటాడు వేమన;

'రాతిబొమ్మకేల రంగైన వలువలు
గుళ్ళు గోపురములు కుంభములును
కూడు గుడ్డ తాను కోరునా దేవుండు ?'అని

విగ్రహారాధనను వ్యతిరేకిస్తూ మరొకమాట అంటాడు చమత్కారంగా— 'రాయి దేవుడైన రాసులు మ్రింగడా ?'అని, కాదామరి? నవ్వులోనే నిప్పులు చిమ్మడం వేమన నైజ గుణాలలో ఒకటి.

దేవుణ్ణి వెతుక్కుంటూ మరి కొంతమంది భక్తులు కొండలు కోనలు తిరిగేవారున్నారు. వారిని గురించి అంటాడు —

'గుహలలోన జొచ్చి గురువుల వెదుకంగ
క్రూరమృగముకండు తారసిలిన
ముక్తిమార్గ మదియే ముందుగా జూపురా' అని

పరిహసిస్తాడు —గుహలు చొచ్చేవాళ్ళు కూడా విని నవ్వుకునేటట్లు.

మరికొంతమంది భక్తిముదిరి తీర్థయాత్రలు చేస్తారు. వారిని గూడా విడిచిపెట్టలేదు వేమన

'తనదు నాత్మయందు దైవంబు గలుగంగ
తీర్థయాత్రల కేల తిరుగు నరుడు
గంధపు తునకలను గాడ్దె మోసినయట్లు' అని

సూటిగా మందలిస్తాడు.

మతం పేరుతో ఎన్నో యుద్ధాలూ, రక్తపాతాలూ జరిగాయి. మతం ప్రమాదకారి అని అందరికీ తెలుసు. కాని దాని మత్తులో యిప్పటికీ కొట్టుకు పోవడం మనకు సహజమై పోయింది. దాన్ని ఏనాడో నిషేధించాడు వేమన.

'మతము లెన్నియైన సతముగా నుండవు
సతము కర్మముండు జగతి నొకటి' అనిమతాన్ని

ఖండించి, కర్మ జీవితాన్ని సమర్థిస్తాడు. ఈ ప్రబోధం నేటికీకాదు రేపు గూడా నవం నవం పునర్నవం.

మతంకంటే ప్రమాదకరంగా మనల్ని ఆది నుంచి పీడిస్తున్న అంటు జాడ్యం మరొకటున్నది. అదే అంటరానితనం. ఈ జాడ్యాన్ని రూపుమాపడానికి ఎంతో మంది మహాత్ములూ, ప్రభుత్వాలూ, ప్రయత్నిస్తూన్నా నేటికీ అది మనల్ని అంటిపెట్టుకుని జీవిస్తూనే వుంది —ఒకచోట ప్రత్యక్షంగా, మరొకచోట పరోక్షంగా దీన్ని ఆ నాడే అసహ్యించుకున్నాడువేమన.

'మాలవాలగాడు మహిమీద నేప్రొద్దు
మాట తిరుగువాడు మాల గాక
వానిమాలయన్న వాడెపో పెనుమాల! అని మాట

తప్పినవాడే మాలవాడని నిర్ణయిస్తాడు. మాలను మాల అన్నవాడేపెనుమాల'అని అస్త్రాన్ని త్రిప్పి ప్రయోగిస్తాడు. వేమన పురాణాలను మాత్రం వదలిపెట్టాడా?

'కనక మృగము భువిని కలదు లేదనకుండ
తరుణి విడచి పోయె దాశరథియు
తెలివి లేనివాడు దేవుడెట్లాయెరా ?'

శ్రీరామచంద్రునికి మించిన దైవంలేడనినమ్మి పూజించే భక్తులు మనలో ఎంత మంది లేరు? ఆ దైవంలోని బండారాన్ని కుండ బద్దలు కొట్టినట్లు బయటపెట్టి ప్రశ్నిస్తాడు.

ఇంకా వేమన ఎన్నో మూఢ విశ్వాసాలను నిర్ద్వంద్వంగా ఖండించాడు "తలలు బోడులైన తలపులు బోడులా?" అని చెప్పటంవల్ల వేమన్న వితంతు పునర్వివాహాన్ని గూడా ఆనాడే సమర్థించినట్లు అర్థంచేసుకోవచ్చు. బాలవితంతువుల తలలను బోడి చెయ్యడంవల్ల పాపం ప్రక్షాళితంకాదు, వారి తలపులను గుర్తెరిగి పునర్వివాహం చెయ్యడమే సరియైన మార్గమని వేమన ఆశయంగా మనం గుర్తించవచ్చు.

సమాజంలోని కుళ్ళును కడగడానికి వేమన కవిత్వాన్ని ఉపయోగించిన పద్ధతి నేటికే కాదు రేపటికి గూడా తన కవిత్వాన్ని ఆది రేపటి కవిత్వంగానే భాసింపజేస్తుంది.

కందుకూరి వీరేశలింగం పంతులుగారి కత్తికి రెండు వైపులా పదును. తన ఆశయాన్ని సాహిత్యం ద్వారా ప్రబోధించి, సమాజంలో ఆచరించి చూపారు. పంతులుగారు మానవోద్యమానికి ఆంధ్రదేశంలో నాందిపలికారు, ఈ ఉద్యమ ప్రచారానికి రఘుపతి వేంకటరత్నం నాయుడుగారు చేదోడు వాదోడుగా నిలిచారు. ఏకేశ్వరోపాసనం, విగ్రహారాధనను ఖండించడం, బాల్యవివాహాలను నిరసించడం, వితంతు వివాహాలను సమర్థించడం — ఈ ఉద్యమం యొక్క ఆశయాలు. పంతులుగారి ప్రయత్నంవల్ల దేశంలో చాలా వరకు బాల్యవివాహాలు సమసి పోయాయి. ఆయనే స్వయంగా ఎన్నోవితంతు వివాహాలను చేసిపెట్టారు. కందుకూరి తన ఆశయం మీద ప్రజాదరణమైన కవిత్వం పుష్కలంగా రాయకపోయినా, దాని మీద వారి వ్యాసాలూ, ఉపన్యాసాలూ, నేటికైనా రేపటికైనా శిరోధార్యాలు, చిరస్మరణీయాలు.

హేతువాదమనే హేతివాదరతో కులతత్త్వం మీద సాయుధపోరాటం సాగించిన మహామహుడు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు. హేతువాదయుగానికి త్రిపురనేని మూలపురుషుడవునో కాదోగాని, ఆయన భావాలన్నింటికీ హేతువాదమే మూలబలం. అటు సామాజికంగానూ, ఇటు సాహిత్యకంగానూ ఎదురైన ప్రతి విషయాన్ని, 'ఎందుకు?' అని ప్రశ్నించి వాస్తవాన్ని నిగ్గుదేల్చి చూపిన సునిశితమైన హేతువాద దృక్పథం చౌదరి గారిది. చిన్నతనంలోనే ఈయనకీ హేతుదృష్టి అలవడటానికి రెండు కారణాలు ప్రధానమైనవిగా తోస్తాయి. ఒకటి — సంస్కృతం శూద్రులభ్యసించరాదని నాటి అగ్రవర్ణస్థులు చేసిన ప్రచారం. రెండు — పాశ్చాత్య విద్యాభ్యాసంతోపాటు పాశ్చాత్యదేశ పర్యటన. పైగా — న్యాయశాస్త్రాభ్యాసం. — ఆ హేతువాద బీజాన్ని పెంచి వృక్షం చెయ్యడానికి మంచి వాతావరణం కల్పించాయి.

చౌదరిగారికి కులతత్వాన్ని ఎదుర్కోవాలనే సంకల్పం కలగడానికి ఆయన జీవితానుభవాలే ప్రత్యక్ష సాక్ష్యాలు. కవితాసాధనలోనూ, సంస్కృతాధ్యయనంలోనూ చౌదరిగారికి ఈ కులతత్త్వం పెనుభూతమై అడ్డుతగిలింది. సంస్కృతం బ్రాహ్మణభాష అనీ, తెలుగు శూద్రభాష అనీ మన పూర్వులు భాషల మీద వేసివిడిచిన ముద్ర ఇంకా పూర్తిగా మాసిపోలేదంటే మనల్ని పట్టిన కుల వ్యవస్థాభూతం ఇంకా మనల్ని వదలి పెట్టలేదన్నమాట. అయితే దాని ప్రభావం నాడు ప్రత్యక్షంగా చూపిస్తే, నేడు పరోక్షంగామీసాలు మెలిపెడ్తోంది. ప్రత్యక్షమైన దానితో వారు కాని ప్రమాదమైతే, పరోక్షమైనదానితో మహాప్రమాదమనే సంగతి అందరికీ తెలుసు, కులతత్వాన్ని రూపుమాపడానికి 'బ్రాహ్మణేతరోద్యమం' నెలకొల్పారు. మన సమాజంలోని కులాలకూ, మతాలకూ, సంప్రదాయాలకూ, మూఢాచారాలకూ మూలకారణమైన బ్రాహ్మణజాతియొక్క ప్రాబల్యం నశిస్తేకాని — కులతత్వం నాశనం కాదని గుర్తించిన వ్యక్తి త్రిపురనేని కవిరాజు.

ఆయన రచించిన "సూత పురాణము' ఆంధ్ర సాహిత్యంలో ప్రథమ హేతువాద గ్రంథం. మనజాతి పురాణాల మీద మొదటి తిరుగుబాటు గ్రంథం అది. మనలోని మూఢనమ్మకాల మీద పెద్దగొడ్డలి పెట్టు, ఆ గ్రంథం. సూతపురాణం నేటికేకాదు రేపటికైనా ఆంధ్ర సాహిత్యానికి అలంకార ప్రాయమైన గ్రంథం. "బూతు పురాణము కాదిది, ప్రాత పురాణము గాదు, పాతకహరమూ సూతపురాణంబియ్యది పూతపురాణంబు......" అని దాన్ని గురించి కవిరాజుగారే సెలవిచ్చారు.

'న స్త్రీ స్వాతంత్ర్య మర్హసి' అనే మన ప్రాచీన సంప్రదాయాన్ని కవిరాజు వ్యతిరేకించారు. స్త్రీస్వాతంత్ర్యం, స్త్రీ విద్య ఎంతో అవసరమని చాటారు. వారు రచించిన కుప్పుస్వామి శతకంలో స్త్రీ విద్యను సరసంగా ఇలా అంటారు:

'చదువులేని జాయ సల్లాపములకన్న
చదువుకొన్న జాయ చలము మేలు
వీనవిందుగాగ వినవచ్చు కొకమాట
నప్పుడప్పుడైన కుప్పుస్వామి' అని చదువుకున్న భార్య చీవాట్లు పెట్టినా చెవులకింపుగానే ఉంటుందంటున్నారు — చమత్కారంగా.

'గుడికి తరచు పోయి గొణుగు చుండెడివాడు పెద్దపాపమేదొ చేసియుండు'నని 'ముక్కు మొగము చెక్కి మూల విరాట్టంచు, ఒక్కరాయితెచ్చి ఉంచి గుడుల, కూడుగుడ్డలిచ్చి కొల్తురు ప్రజలెల్ల కొంటె పనులుగావె' అనీ విగ్రహారాధన మీద దుమ్మెత్తి పోస్తారు. గిట్టని వారు చౌదరి గారికి 'బ్రాహ్మణ ద్వేషి'' నాస్తికుడు' అన్న కితాబు లిచ్చినా ప్రజలు మాత్రం ఆయనను 'కవిరాజు'గానే గౌరవించారు. గౌరవిస్తున్నారు. గౌరవించగలరు.

కవులందరూ నింగినుంచి దిగిన వారైతె గురజాడ నేలనుంచి లేచిన కవి. కవులు సామాన్యంగా వెనుకటి సాహిత్యంలోంచి పుట్టుకొస్తారు గురజాడ ప్రజలనుండి పుట్టుకొచ్చాడు ప్రజల మనిషిగా ముందుకొచ్చి ప్రజల మీద కవిత్వం వినిపించిన మొదటి ప్రజాకవి గురజాడ. అందువల్లనే ఆయన భాష — వ్యావహారికం., ఛందస్సు — జానపదం., వస్తువు ప్రజల సమస్యలు. వాస్తవికతే ఆయన ఏకైక వాదం. ఆధునికతే ఆయన అఖండ— లక్ష్యం. సామాన్యుడే ఆయన సర్వస్వం.

'కవుల కల్పన కలమునన్ను, ఎన్నిచిన్నెలుగాంచెనో వస్తువులందు వెర్రిపురాణగాథలు, నమ్మజెల్లునే పండితుల్'అని పురాణాలమీద ఒక బాణం వేస్తాడు గురజాడ. ధూమకేతువును 'వేల్పులలనా కేశ' వెలితొగ' గానూ, 'సంఘ సంస్కరణ ప్రయాణ పతాక'గానూ భావించగల ఉత్తమ సంస్కారం గురజాడది.

వర్ణభేధాలెల్లకల్లఅయితే యెల్లలోకము ఒక్క యిల్లవుతుందని హామీ యిస్తాడు మతములన్నీ మాసిపోయి జ్ఞానమొక్కటే నిలిచి వెలుగుతుందనీ, అప్పుడే స్వర్గ సుఖంబులన్నవి అవని విలసిల్లుతాయనీ ధైర్యం చెబుతాడు. దేశమంటే మట్టికాదంటాడు. మరి ఏమిటంటే —మనుషులనిచెప్పి మనిషికి మణికిరీటం పెడతాడు. మనిషి ఎవరంటే—కండగలవాడేను మనిషోయ్ లని సరదాగా పాటపాడతాడు దేశాభిమానం నాకుకద్దని వట్టిగొప్పలు చెప్పుకోకని విసుక్కుంటాడొకచోట. మరి ఏం చెయ్యమంటావంటే —పూని యేదైనాను ఒకమేల్‌కూర్చి జనులకు చూపహోయ్ —అని కర్తవ్య గీతోపదేశంచేస్తాడు. కురుక్షేత్రంలోని శ్రీకృష్ణభగవానుని భంగిమలో. స్వంతలాభం కొంతమానుకు పొరుగువాడికి తోడుపడాలనేది ఆయనతత్వం. అన్నదమ్ములవలెను జాతులు మతములన్నీ మెలగవలె ననేది ఆయన ఆశయం మంచిచెడ్డలు మనుజులందున యెంచి చూడగ రెండెకులములన్నది ఆయన సిద్ధాంతం.

వెనుక వివరించిన కవులకు మల్లేనే గురజాడకు కూడా విగ్రహారాధనఅంటే పరమ అసహ్యం. మనిషి చేసిన రాయిరప్పకి మహిమకలదని సాగి మొక్కుతు, మనుషులంటే రాయిరప్పలకన్న, కనిష్టం'అంటాడు. 'దేవుడెకడో దాగెనంటూ కొండకోనల వెతుకులాడేవేలా?' అని కసురుకుంటాడు. మరి ఎక్కడున్నాడో చెప్పమంటే—'కన్ను తెరచిన కానబడడో? మనిషి మాత్రుడియందులేడో? యెరిగి కోరిన కరిగియీడో ముక్తి?'అని వివరిస్తాడు.

గురజాడకు ముందు కావ్య నాయికా నాయకులు ఉదాత్తత, కులీనత ఇత్యాది కలవారై ఉండాలని లక్షణ శాస్త్రాల శాసనం ఆ శాసనాన్ని అక్షరాలా పాటించి లక్షణ శాస్త్రం ప్రసాదించిన నాయికా నాయకులనే ఆ నాటి కావ్యాలు అందుకుని తమలో ఇముడ్చుకునేవి. గురజాడ ఆ సంప్రదాయాన్ని పూర్తిగా వ్యతిరేకించాడు. తన 'కన్యక' అనే ఖండకావ్యంలో ఒక బాలిక నాయిక. 'పూర్ణమ్మ' పాటలో ఒక పూజారి కూతురు నాయిక. కన్యాశుల్కం నాటకంలో ఒక వేశ్య నాయిక.

సమకాలీన సమాజంలో కన్యాశుల్కాన్ని నిరసించడానికీ, దాని తీవ్రతను అరికట్టడానికీ గురజాడ సాహిత్యం ద్వారా ఎంతో కృషి చేశాడు. కన్యాశుల్కంలో ఉన్న అవకతవక లన్నింటినీ కన్నులక. కట్టినట్లుగా వివరిస్తూ ఒక నాటకాన్నే రచించాడు. పూర్ణమ్మ కథలో కూడా 'కాసుకులోనై తల్లీ తండ్రీ నెనరూ న్యాయం విడనాడి, పుత్తడి బొమ్మను పూర్ణమ్మను ఒక ముదుసలి మొగుడుకు ముడి వేసి' అని చెప్పి కన్యాశుల్కం వల్ల జరిగే ప్రమాదకరమైన సామాజిక సతానాన్ని వివరిస్తాడు.

'కొయ్య బొమ్మలు మెచ్చు కన్నులకు' కాదుగాని, నిజమైన ప్రగతిశీల రసహృదయులకు నేటికే కాదు రేపటికి కూడా గురజాడ కవిత్వంలో 'కోమల సేరే' కనిపించి అలరిస్తుంది.

గురజాడ నేలనుంచి పుట్టి నేల మీద నడిస్తే, శ్రీశ్రీ నింగినుంచి దిగి నేలమీద నడిచిన మహాకవి. మొదట విశ్వనాథ, కృష్ణశాస్త్రి మొదలైన వారి ప్రభావంలో పద్యాలు రాసి, చివరికా పద్ధతి ముఖం మొత్తి, ప్రజల వైపు తిరిగి చూశాడు. ప్రాచీన కావ్యభాషనే స్వీకరించినా దానికి కొత్త రంగూ రుచీ వాసనా కల్పించి ప్రజా కవిత్వం వాడిగా వేడిగా వినిపించాడు తన అఖండమైన, ప్రతిభతో మన సాహిత్య సంప్రదాయాలనూ విలువలనూ తారుమారు చేసిన ఘనత శ్రీశ్రీకే దక్కింది.

ఆకాశం దారులంట అడావుడిగా అరుచుకుంటూ వెళిపోయే తెలుగు కవితా రథాన్ని భూమార్గం పట్టించాడు కార్మికలోకపు కళ్యాణానికి, శ్రామికలోకపు సౌభాగ్యానికి సమర్పించిన నవ్యకవిత్వం శ్రీశ్రీది. కుక్కపిల్లా, అగ్గి పుల్లా, సబ్బు బిళ్లా అన్నీ కవితా మయమేనని చాటాడు. రస నిర్దేశం చేసే అనర్ఘమైన శిల్పం ఉంటే ఏదీ కవిత కనర్హం కాదని కవితా బుక్కులు బోధిస్తాడు అంతలో కదిలేది కదిలించేది మునుముందుకు నడిపించేదే కవిత్వమని కొత్త సిద్ధాంతంతో మన వెన్ను చరుస్తాడు. అందువల్లే ఈయన కవిత్వంలో రాబందుల రెక్కల చప్పుడు, పొగగొట్టపు భూంకారధ్వనీ, అరణ్యమున హరీంద్రగర్జనా, పయోధర ప్రచండఘోషం, ఝంఝానిల షడ్జధ్వానం మొదలైన భయంకర ధ్వనులు వినబడతాయి. ఈయన కవిత్వంలో ఎదురయ్యే పాత్రలన్నీ పతితులూ, భ్రష్టులూ, బాధాసర్పదష్టులూ, దగా పడిన తమ్ములూ మాత్రమే శ్రీశ్రీది అదే ప్రపంచం కాదు— అసలు ప్రపంచమే! శ్రీశ్రీ రాసింది మరో ప్రపంచం గురించి కాదు, మన ప్రపంచం గురించే! మన ప్రపంచాన్ని శ్రీశ్రీ ఊహించిన మరో ప్రపంచంలోనికి నడిపించడానికి— 'పదండి ముందుకు పదండి త్రోసుకు పదండి' అని మెడబట్టి నెట్టుతున్నాడు. కాలు విరిగితే చేతికి చికిత్స చేసుకునే మనం శ్రీశ్రీతో పాటు నడువగలమా? శ్రీశ్రీ చెప్పే సమసమాజ ప్రపంచాన్ని నిర్మించుకోగలమా? అట్లా మంచి రోజులు వచ్చి మరో ప్రపంచానికి మన కాపురం మార్చ గలిగినప్పుడు గూడా ప్రేమ కట్టించి ఆ ప్రపంచం గోడలకు ప్రేమగా తగిలించుకోవలసిన కవిత్వం శ్రీశ్రీది.

ఒక కవిత్వం అది ఏ కాలానికి చెందినదనే వివరాలు దాని పుట్టిన తేదీ మీద ఆధారపడిలేవు కవిత్వం యొక్క కాలం దాని గుణం మీద ఆధారపడివుంటుంది. గుణం వస్తు శిల్ప తత్వాల మీద నిలబడి ఉంటుంది.

పుట్టుకొక్కటే కాదు పుణ్యం. కవిత్వం పట్ల దాని మన్నికే గణ్యం ఆ మన్నిక కవిత్వానికర్థమైతే అదే ప్రజల మనుగడతో ముడివడితే పరమార్థం! అదే రేపటి కవిత్వం.

---

# మాఘ కవి - తెలుగు కవిత

## శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి

సంశోధిత మహాభారతముద్రణము (హైదరాబాదు) అనుశాసనికపర్వమును

గత సంవత్సరపు ఏప్రిలు భారతిలో సమీక్షించుచు, పరిశోధక పరమేశ్వరాది బహుబిరుద సంపాదకులు శ్రీ నిడదవోలు వేంకటరావు పంతులుగారు, అందులో ఛందః ప్రయోజనము అనుశీర్షిక క్రింద చంపకమాలావృత్తమును గుణగ విజయాదిత్యుని సాతలూరి శాసనము ననుసరించియే రాజశేఖరుడును మాఘుడును సంస్కృతమున వ్రాసిరనియు, పైపెచ్చు అధోజ్ఞాపికలో"రాజశేఖరుడు మాఘుడు గుణక విజయాదిత్యుని తర్వాతివారు, క్రీ.శ. 10వ శతాబ్దివారు" అని ఇంకను బల్లగుద్ది వ్రాసినారు. మరియు మత్తేభవిక్రీడితమునుగూర్చి వ్రాయుచు "అది చంపకోత్పలములవలె సంస్కృత వృత్తముకాదు. మత్తేభమును సంస్కృతమున సృష్టించినవారు దాక్షిణాత్య కవియగు రవికీర్తి. అతను రెండవ పులకేశి అయిహోలు శాసనకర్త, క్రీ.శ. 634. ఆ మత్తేభమిది" అని "వరదా తుంగతరంగ రంగ" శ్లోకము నుదాహరించినారు. తర్వాత ఇంకను వ్యాఖ్యానించినారు. "పై మత్తేభము సంస్కృతభాషలో వ్రాయబడినది అందుచే యతిప్రాసలు లేవు సంస్కృతమున దీనికిశాసనము తరువాత ప్రయోగములున్నట్లు పరిశోధకులు తెలుపలేదు. దీని ననుసరించి కన్నడకవులు— తొలుత—కన్నడ ఛందస్సులో పద్యమునకు నియతమైన 'ప్రాస'ను పాటించి మత్తేభవృత్తమును వ్యాప్తికి తెచ్చిరి మత్తేభవృత్తము సంస్కృతము కాదని సారాంశము. వ్యాసకర్త లిదిగమనింపలేదు." ఇంతటితో నిలుపక అధోజ్ఞాపికలో తాము వ్రాసిన 'ఆంధ్ర కర్ణాటక సారస్వతములు—పరస్పర ప్రభావము' అను తమ గ్రంథమును కూడ చూడవలసినదని సలహా యిచ్చినారు.

మహాభారత పరిశోధకుల మాట యటుంచి పరిశోధక పరమేశ్వరుల ఈ రచన చూడగానే, నా సంస్కృత వాఙ్మయ చారిత్రక జ్ఞానమును ఆవరించిన దుమ్ముదులుపు కొనుటకు చక్కని యవకాశము దొరికినది గదాయని సంతోషించి మరల నొకమారు సంస్కృత వాఙ్మయ చరిత్ర గ్రంథములను చూతునుగదా— అయ్యో! మాఘుడు అసలు పదవశతాబ్దమువాడుకాదుగదా! అంతకన్నా అసలు గుణగ విజయాదిత్యునికి కూడ కొంచెమైనను తర్వాతివారుగాక, అసలు ఆరవ శతాబ్దివాడో లేక ఏడవ శతాబ్దివాడో య్యైయుండుననియు, అసలు ఇంకను చక్కగా చూడగా అసలు దాక్షిణాత్యుడేగాక పూర్తిగా ఔత్తరాహుడనియు పెద్దలు ఎందరో వ్రాసియున్నారు. — ఇదివరకే. పైగా అసలు ఆంధ్ర కర్ణాటకులను చూచి నేర్చుకొనలేదనియు, అసలు ఇతనికల్పనాశక్తికి మెచ్చియే కర్ణాటకులును, వారి వెనుక ఆంధ్రులును అసలు కాపీకొట్టినట్లును కనబడుచున్నది. అసలు సంగతి చూతము గాక—

శ్రీ ఎమ్ కృష్ణమాచార్యులవారు తమ ఆంగ్ల సంస్కృత వాఙ్మయచరిత్ర గ్రంథములో 1937 లోనే, తత్పూర్వ రచయిత లనేకుల యభిప్రాయములను క్రోడీకరించినారు. మాఘుడు పదవ శతాబ్దివాడని, పరిశోధక పరమేశ్వరులు,బహుశః తప్పులతడికె, కలగాపులగమైన బల్లాలకవి వ్రాసిన భోజప్రబంధమును విశ్వసించి వ్రాసినారో ఏమో ! అందులో కాళిదాసు మొదలు మల్లినాథ సూరివరకు రానివారు కొందరే. మాఘుడు భోజమహారాజునకు సమకాలికుడనియు, దారిద్రోపహతుడై భోజుని యాశ్రయించి మహాధనము పొంది, మహాదాతగావున, దానిని సైతము యాచకులకిచ్చి మరణించెననియు పుక్కిడి పురాణముకలదు. ఇదిచరిత్ర విరుద్ధము. అసలు భోజుడు పదనొకండవ శతాబ్దివాడు. అసలు మాఘుడే దీనిని వ్రాయలేదని ఎవరికృతినో కొని తనదిగా ప్రకటించుకొనెనని మరియొక కథ వీవినెల్ల త్రోసివైచి, లంతకుముందువా రెందరో మాఘుని ఉదాహరించియున్నారనియు. ఇతడు మాళవీయుడుగా ఏడవశతాబ్దమున నుండెనని వ్రాసియున్నారు.

తన చరిత్రను తానే శిశుపాలవధలో గ్రంథాంతమున తెలుపుకొన్నాడు. తండ్రి దత్తకుడు, తాత సుప్రభాదేవుడు— వర్మలాటు డను రాజునకు మంత్రి. ఆ రాజు శ్రీ మాలనగరము రాజధానిగా గూర్జరమును పాలించెనట. కొన్నిప్రాత ప్రతులలో 'శ్రీ భిన్నమాలవ వాస్తవ్య దత్తకసూను ర్మహా వైయాకరణస్య మాఘస్య కృతౌ' అని యున్నదని దుర్గాప్రసాదుగారు తెలిపియుండుటచే గూర్జర మాలవములకు నడుమనుండు భిన్న మాలవ నగరమే ఆయూరెమో యని శ్రీ కృష్ణమాచార్యులవారి యూహ. మాఘుని గురించి వామనుడు కావ్యాలంకార సూత్రములందును నృపతుంగుడు కవిరాజ మార్గమందును సోమదేవుడు యశస్తిలకమందును, రాజశేఖరుడు కావ్య మీమాంసయందును, ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకమందును భోజమహారాజు సరస్వతీ కంఠాభరణమందును, ప్రస్తావించియున్నారు. ఇందరిలో వామనుడు ప్రాచీనతముడు, కాశ్మీర జయాపీడరాజు (779—813) నాస్థానమునుండి రాష్ట్రకూట ప్రభువైన జగత్తుంగబిరుదధారి, మూడవ గోవిందుని (794—813) యాస్థానమునకు వచ్చి మంత్రులలో నొకడాయెను. ఇతడు కాదంబరి, ఉత్తరరామ చరిత శిశుపాలవధాదిక గ్రంథములు నుదాహరించియున్నాడు. నృపతుంగుడు 'క్రీ. శ. 814—877 ప్రాంతములనుండి కవిరాజమార్గమును క్రీ. శ. 825 ప్రాంతమున వ్రాసెనని శ్రీ పరిశోధక పరమేశ్వరులవారే తమ 'ఆంధ్ర కర్ణాట సారస్వ'— పుట 4 అధో జ్ఞాపికలో అనుగ్రహించియున్నారు. క్రీ శ. 779 నాటికే మాఘకవి చాలప్రసిద్ధుడైనందున అంతకు ఏబది యేండ్లు ముందైనను ఉండియుండడా?

మాఘుడే తన శిశుపాల వధలో కాశికావృత్తిని దాని వ్యాఖ్యయైన న్యాసమును ఉదాహరించినాడట (చూ. కృష్ణమాచార్య)

"అణు సూత్ర పదన్యాసా
సద్వృత్తిః సన్నిబంధనా
శబ్ద విద్యేవ నోభాతి
రాజనీతి రపస్పశా"

కాశికావృత్తిని జయాదిత్య వామనులు రచించిరి. జయాదిత్యుడు క్రీ. శ. 661 లో గతించినట్లు చైనా యాత్రికుడు ఇత్సింగ్ వ్రాసియున్నాడు. న్యాసమును రచించిన జినేంద్ర బుద్ధిని గూర్చి ఇత్సింగ్ చెప్పడు క్రీ. శ 695 నాటికి ఇత్సింగ్ గృహోన్ముఖుడైనందున న్యాసకర్త తర్వాతి వాడై యుండునని మాక్సుముల్లరు పండితుని యభిప్రాయము కీల్హారను పండితుడు న్యాసకర్తను మాఘునికి అనంతరుని చేయుచున్నాడు వీనినిబట్టి శ్రీ కృష్ణమాచార్యులు వర్మలాతరాజు క్రీ శ. 625 లో పాలించుచుండినట్లు శాసనముండుటచే, ఈ రాజునకు మంత్రియైన సుప్రభా దేవుని మనుమడు, మాఘుడు క్రీ శ. ఏడవ శతాబ్ది ఉత్తరార్ధమున నుండి యుండునని నిర్ణయించినారు. ఈ వామనుడు కావ్యాలంకార సూత్రకారుడు కాడు.

చారిత్రక సన్నివేశము చూచినను ఇది చాలవరకు సరియనియే తోచుచున్నది. ఇంకను ముందు క్రీ శ 650 ప్రాంతమందే మాఘుడుండెనేమోయని తోచును గాని ఎంత చూచినను క్రీ శ. 661 కి ముందు కుదురదు. లేదా జయాదిత్య వామనులకు సమకాలికుడు కావలెను. క్రీ. శ. 654—55 నాటికి గూర్జర మందు వాతాపి చాళుక్యుల శాఖ యొకటి ఏర్పడినది. వేంగిని రెండవ పులికేశి జయించి తన తమ్ముని అచట ప్రతిష్ఠించినట్లే, అతని కుమారుడు మొదటి విక్రమాదిత్యుడు క్రీ శ 654 నాటికి రాజ్యమునకు వచ్చినవాడు గూర్జరమును జయించి అచట తన తమ్ముని ధర్మాశ్రయ జయసింహవర్మను ప్రతిష్ఠించెను. నాటికి చిన్న స్వతంత్ర రాజులు పోయి చాళుక్యులు ఆక్రమించిరి వీరికడ మాఘు డుండినట్లు లేదు ఈ ధర్మాశ్రయుని కుమారుడు శ్రియాశ్రయ శీలాదిత్యుడు యువరాజుగా క్రీ శ 671 లో వేయించినశాసనము కలదు క్రీ. శ 643లో లాట దేశమునొక విజయరాజు స్వతంత్రుడు 655 లో నీ ప్రాంతమును సేంద్రక పృథివీ వల్లభ నికుంభల్ల శక్తియను నతడు రాజుగానుండెను. గూర్జరమును నేసారి రాజధానిగా (సూరత్ జిల్లా) మంగళ రాజవినయాదిత్యుడు 700—732 ప్రాంతమున పాలించుచుండెను. ఇంతలో కర్ణాటక దేశ చాళుక్యులు క్రీ. శ 755 ప్రాంతమున రాష్ట్రకూటులకు వోడి పోయిరి. రాష్ట్రకూట దంతి దుర్గుడు జయించి అతని కుమారుడు మొదటి కృష్ణరాజు క్రీ. శ 756 నుండి రాజాయెను. తర్వాత మూడవ గోవిందుని యాస్థానమునకు (794—813) రాష్ట్రకూట రాజ్యమునకు వామనుడు వచ్చియున్నందున ఇతనికి పూర్వుడు మాఘుడు ఎనిమిదవ శతాబ్దము పూర్వార్ధము కాదగును ఇట్లు వచ్చినవామనునితో కూడ మాఘుని కావ్యమును వచ్చియుండుననుటలో సందేహము లేదు. గుణగ విజయాదిత్యుని కాలము క్రీ శ. 848—892 గావున మాఘునిగ్రంథమే ముందుదిగా కనబడుచున్నది

ఇంకొక యాశ్చర్యమేమనగా— మాఘుడు పదవశతాబ్దమువాడని వ్రాసి యీ పరిశోధక పరమేశ్వరులే, తాము రచించినదియు, పై వ్యాసమునందే 'చూడుడు' అని అధోజ్ఞాపికలో తెల్పినదియునగు 'ఆంధ్ర కర్ణాటక సారస్వతములు—పరస్పర ప్రభావము' అనుగ్రంథమున "మాఘుడు క్రీ శ 7వ శతాబ్ది, శిశుపాలవధ కావ్యమున చంపకమాలా వృత్తమును వాడియున్నాడు. తొలుత కన్నడ కవులీ సంస్కృత వృత్తమును వారికి నియతమగు ప్రాసనియమముతో గ్రహింపగా, తెలుగు కవులు దీనిని యతిప్రాస నియమముతో గ్రహించిరి" అని వ్రాసియున్నారు. అది 1961లో వ్రాయబడినది మరి యీ పొరబాటు అభిప్రాయము ఏలాగు పొందినారో? అది తెలిపి ఉపపత్తులిచ్చియుండిన ఎంత బాగుండెడిది.

పోనిండు—గుణగ విజయాదిత్యుని (849—892) సాతలూరు తామ్ర శాసనమున ప్రాసముతో గూడిన చంపక మాలావృత్తము కానవచ్చుచున్నది గదా 'అరినృపవాజి వారణ' ఇత్యాది. దీనిని గురించి శ్రీ నేలటూరి వెంకటరమణయ్య గారు 'గుణగ విజయాదిత్యుడు—రాష్ట్రకూటులు' అను వ్యాసమున విపులముగా చర్చించి తుదకు ఇట్లు నిర్ణయించినారు. (చూ. పల్లవులు— చాళుక్యుల అనుగ్రంథము పుట 347) "ఆంధ్ర సంప్రదాయమునకు ప్రధానాంగము యతి. ఇది సంస్కృత కర్ణాటాది భాషలలోని యతి, అనగా విరామము, గాదు. ఆంధ్ర సంప్రదాయము ననుసరించిన యతి. గుణగ విజయాదిత్యుని నాటి యద్దంకి ధర్మవర శాసనములయందు గానవచ్చుచున్నది .... నాటికి సాతలూరు శాసన చంపకమాలయందు గానవచ్చు దానికంటె భిన్నమైన యతి నియమము ఆంధ్ర కవులు పాటించుచుండిరనుట తెల్లము. అనగా నప్పటికే నేటివరకు చెల్లుచుండు సంప్రదాయ మేర్పడినది.. .. ఏ కారణము చేతనో సాతలూరు శాసన గ్రంథకర్త ఆంధ్ర సంప్రదాయమును త్యజించి కర్ణాటక సంప్రదాయము ననుసరించినాడు. కాని యతని మార్గ మాంధ్రకవులకు రుచించవలేదు. ఇట్లు గుణగ విజయాదిత్యు నికి పూర్వమే యాంధ్రమున పద్యరచన ప్రారంభమాయెనని తలచుట కవకాశ మున్నను చాళుక్యులకు పూర్వము తెలుగువారు కవిత్వము చెప్పియెరుగరని దృఢ ముగ జెప్పవచ్చును. ఈ పట్టున—

"మునుమార్గ కవితలోకం
బున వెలయగ దేశికవిత బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్ర విషయం
బున జన చాళుక్యరాజు మొదలుగ పలువుర్"

అనునన్నెచోడుని పద్యమును జ్ఞప్తికి దెచ్చుకొనవలయును."

శ్రీ వెంకటరమణయ్యగారు చెప్పినట్లు, తెనుగున రెండవ పులకేశికిముందు అనగా కుబ్జ విష్ణువర్ధనునికి ముందు కవిత బొత్తిగాలేదు. శాసనములలో కాన రాదు. గ్రంథములును దొరకలేదు. వేంగిచాళుక్యులును పిఠాపుర ప్రాంతమునుండి క్రమముగా దక్షిణమునకు తమ రాజ్యమును విస్తరించుకొనుచు కుబ్జ విష్ణువర్ధ నునికి తర్వాత ఒక శతాబ్దమునకు గుంటూరు సీమనుపాలింప నారంభించిన నాటి నుండి అసలు తెలుగు వీరి శాసనములలో కనబడుచున్నది. అనగా క్రీ.శ. 750 దనుక తెనుగు కానరాక తర్వాత దేశమందు ఈ తెనుగుతనము కనబడుటకేమి కార ణమని ఆలోచింపగా గొప్పకారణము కనబడినది. ఇది వెంకటరమణయ్యగారు పరి శోధించి తెలిపిన యపూర్వ విషయము— బాదామి చాళుక్యులపతనమును రాష్ట్ర కూటుల విజృంభణమును దీనికి ప్రబల కారణములు—పై పుస్తకమునందే(పుట 235) ఇట్లు వ్రాసియున్నారు.

"వేములవాడ చాళుక్యులు రాజ్యమునల్పినది తెలుగుదేశము. వారు కర్ణాటక వాఙ్మయమును పోషించిరి" .. "ఆంధ్రులకీయుగమునకన్న భాష పైనీయభి మానమేల కలిగినది ? . . క్రీ.శ 10వ శతాబ్దము వరకును తెనుగున గావ్యరచన ప్రారంభము కాలేదు. తత్పూర్వ మాంధ్రులు సంస్కృత ప్రాకృతాది భాషల యందే గ్రంథరచన సాగించెడివారు దీనికి గారణము వారాడు భాష గ్రంథరచనకు దగిన స్థితియందుండక పోవుటయే. క్రీ శ. 7వ శతాబ్దమునకు బూర్వము మన మాడు నాంధ్రభాష ప్రచారమున నుండెనని చెప్పుటకు దగిన సాక్ష్యములేదు.

క్రీ. శ. 600 630ల మధ్య కంచిరాజ్యమును పరిపాలించుచుండిన మొదటి మహేంద్ర విక్రముని బిరుదావళియందు ఆంధ్రభాష మొదట పొడకట్టుచున్నది. అతనికి సమకాలికులైన రేనాటి తెలుగు చోళరాజుల యొక్క శాసనములు సంపూర్ణముగ నంధ్రభాషయందే వ్రాయబడియున్నది. అట్లే క్రీ. శ. 7వ శతాబ్ది ద్వితీయ పాద ప్రారంభమున వేంగి దేశమును జయించిన పూర్వ చాళుక్యుల శాసనములు కొన్ని సంపూర్ణముగ తెనుగునందే విరచింపబడియున్నవి కాని ఈ శాసనములన్నియు వచన శాసనములు. పద్యమెందును కానరాదు. వీనినాధార పరచుకొని యప్పుడు తెనుగువారు నిజభాషయందు కవనము చెప్పనేర్చియుండిరో లేదో నిశ్చయించుటకు వీలులేదు.

"చాళుక్యుల రాకతో నాంధ్రదేశ చరిత్ర యందొక నూతన యుగము ప్రారంభమగుచున్నది. జాతీయ జీవనము బహుళముగ మారిపోయినది . . . . చాళుక్యులు కర్ణాటకులు. . . కర్ణాటాంధ్ర దేశముల మధ్యరాకపోకలు హెచ్చి రెండు దేశముల ప్రజలకును దృఢ సంబంధమేర్పడినది . . . జనుల . .యందు కొంత మార్పు. . . ముఖ్యముగ భాషయందు పొడచూపినది. . భాషయందలి శబ్దజాలము విస్తరించినను, పరిశుద్ధత చెడినది . .అప్పుడు శాసనములు తప్ప లిఖిత వాఙ్మయమేదియు లేకపోవుటచేత గ్రంథ రచనయందు అభిరుచిగల విద్యావంతులందరును సంస్కృతమందో, లేక రాజభాషయగు కన్నడమందో గ్రంథములను రచించెడివారు. ఈ కారణమువలననే పంపాది యాంధ్ర జైన కవులు తమ గ్రంథములను కన్నడమున వ్రాసిరి ఆంధ్ర శైవ బ్రాహ్మణ సామంత ప్రభువులైన మల్లపయ్య పొన్నమయ్యాదులు కన్నడ కవుల కాశ్రయమొసగి వారిని కర్ణాటక మున గావ్య రచనకు బురికొల్పిరి. (పు. 239)

"కాని తెనుగు దేశమున కన్నడ భాష కిట్టి గౌరవము చాలకాలము జరుగ లేదు. రాజకీయ కారణముల వలన నాంధ్రదేశమున గన్నడభాషకు ప్రచారము క్రమక్రమముగ తగ్గనారంభించెను. బాదామి చాళుక్యుల దొరతనము సాగినంత కాలమును పూర్వ చాళుక్యులకును కర్ణాటకులకును మైత్రి యవిచ్ఛిన్నముగ నడచినది కాని క్రీ. శ. 8 వ శతాబ్ద మధ్యమున రాష్ట్రకూటులు విజృంభించి బాదామి చాళుక్యుల యధికారమును కూలద్రోసి కర్ణాటక సింహాసన మాక్రమించిన దాదిగ పూర్వ చాళుక్యులకు వారితో వైరము పొసగె . . తదారభ్య . . పూర్వ చాళుక్యులు తాము కర్ణాటకు లగుటను విస్మరించి తమ ప్రజలతో నేకీభవించి. . . తెనుగు భాషయం దభిమానము హెచ్చి . ఆంధ్రమునను కావ్య నిర్మాణము సేయుట యుక్తమని నిశ్చయించి కవుల నాదరించి కవనముల్లొటకు బురికొల్పిరి. ఈయంశమునే నన్నెచోడదేవుడు తన కుమారసంభవము పీఠిక యందిట్లు తెలిపియున్నాడు. 'మునుమార్గ కవిత . .' ఇందువలన. . తెనుగును చాళుక్యులు నిల్పిరనియు వారికి బూర్వము తెనుగున కవిత్వము లేదనియు తెల్లమగుచున్నది. .. తెనుంగు నంధ్ర విషయమున నిలిపిన చాళుక్యరాజు గుణగవిజయాదిత్యుని పూర్వికులగు పూర్వ చాళుక్యులలో నొక్కడుగ నుండునని తలంచుట యుక్తము."

తర్వాత 'తెనుగు కావ్యముల మీద కన్నడ ముద్ర నిలిచినందులకు తార్కాణము' లిచ్చి తుదకు ఇట్లు నిరూపించినారు 'శాసనముల సాక్ష్యమునుబట్టి చూడగా మొట్టమొదట తెనుగున ఒద ములు కేవలము తెనుగు దేశమున ప్రచారమున నుండిన సీసగీత తరువోజ లనుదేశి ఛందములందు రచియింపబడుచుండెననియు దరువాత కన్నడ ఛందస్సుబడి యక్కరలును వృత్తములును వ్రాయుట వాడుకలోనికి వచ్చెననియు తెల్లమగుచున్నది తెనుగు వృత్త రచన సంస్కృత ప్రాకృత వృత్తముల చొప్పున గాక కన్నడ ఛందస్సంప్రదాయమునననుసరించియే ప్రారంభమాయెననుటకు పై నుదాహరింపబడిన సాతలూరి తామ్ర శాసనము లోని చంపకమాలా వృత్తము సాక్షి. ఏలన, ద్వితీయాక్షర ప్రాస మాంధ్రకర్ణాటక పద్యకవిత్వములకు సామాన్య లక్షణమేయైనను నాంధ్ర కవులు ప్రాసతోబాటు బాటించు మరియొక ప్రధాన నియమమగు 'యతి' యందు కానరాదు. తెనుగు కవిత్వమునం దాదినుండియు యతిప్రాసలు గానవచ్చుచున్నవి. గుణగవిజయాదిత్యునికి పూర్వమే 'యతిప్రాస' నియమములు స్థిరముగ నేర్పడినవి. కావున గుణగవిజయాదిత్యుని సాతలూరు తామ్ర శాసనములోని చంపకమాలయందు ప్రాస మాత్రము గానవచ్చుటయు 'యతి' లేక పోవుటయు జూడగా నాద్యమున తెనుగు కవులు కర్ణాట చందస్సంప్రదాయము ననుసరించి వృత్త రచనకు డగిరని తోచుచున్నది. కాని తెనుగు వారియందు 'యతి' లేని కవిత్వము నుతికెక్కదాయెను కావున వారు కాలక్రమమున 'ప్రాస' తో పాటు 'యతి' ని గూడ చేర్చి వృత్తములను రచింపగడగిరి."

"చాళుక్య రాజ్యస్థాపన యాంధ్ర కవితకు గారణభూతమైనది. అనగా నాంధ్ర కర్ణాటక సంయోగము వలన తెనుగు కవిత్వము పుట్టినది. ఇది ఆంధ్ర వాఙ్మయ చరిత్రకారులందరు విస్మరింపదగని విషయము ఈ కారణమువలననే ఆంధ్రకావ్య స్వరూపమునను చంధస్సునను కన్నడపు పోలికలు కానవచ్చుట."

ఇటీవల వెలువడిన జినవల్లభుని గంగాధర శిలాశాసనమును పరిష్కరించి ప్రకటించుచు శ్రీ వెంకటరమణయ్యగారు (చూ పల్లవులు—చాళుక్యులు పుటలు 257—282) ఆది, పంపమహాకవి తమ్ముడును సకల కళా ప్రవీణుడునునైన జినవల్లభునిదనియు, వీరాంధ్రులనియు, వీరికాలము క్రీ శ 945 ప్రాంతమనియు వ్రాయుచు, ఇతని రచన నుండి ప్రాచీన తమ కందపద్యములను తెనుగులో వ్రాయబడిన వానిని ఉదాహరించి 'మొదటి రెండును తెనుగు కవితా సంప్రదాయానుసారము యతిప్రాసలతో కూడియున్నవి మూడవ పద్యమందు ప్రాసము కలదు గాని యతిలేదు ఇందు శాసన రచయిత ఏలనో కన్నడ కవిత్వ సంప్రదాయ ననుసరించినాడు' అని తెలిపినారు.

చూడగా క్రీ శ 730 నుండి 1000 వరకు, నన్నయ అవతరించు వరకు, ఆంధ్ర కవిత్వ చరిత్రలో పరిణామకాలము. తెనుగువారి స్వభావము యతి ప్రాసలు రెంటిలో కవిత్వమల్లుట కాని రాజకీయ వాతావరణ ప్రభావము వలన యతిని వదలియు చేర్చియు కవిత్వము చెప్పుచుండిరి ప్రారంభమున వీరిది దేశి కవిత్వమే. అనగా, వీరు ద్రావిడ జనులుగాన సంస్కృతేతర, మార్గపద్ధతికాని దేశికవితయం దాసక్తులు. పైనుండి వచ్చుచుండిన సంస్కృత కవితా ప్రవాహిని ప్రభావము వీరిని కూడ చలింప జేసినది. కర్ణాటకులును ద్రావిడులే అందులకు ద్వితీయాక్షర ప్రాసమే సాక్షి కాని సంస్కృత కవితా ప్రభావము వీరిమీద ఎక్కుడై యతిని పూర్తిగా స్మరింపక ప్రాసముమాత్రమువదలక కవిత్వమారంభించిరి. సంస్కృత కవులను అనుకరించినను వారివలెగాక చంపూ పద్ధతిని అవలంబించిరి. ఒకవిధముగా చూడగా మార్గదేశి కవిత్వముల యొక్క కవితా రీతులకంటె యకలోని భిన్న సంప్రదాయములేమో కర్ణాటాంధ్ర కవితారీతులు. మరి దేశికవిత

యనగానేది? మార్గకవిత కానిది. మార్గము సంస్కృతమేగాన దేశియనునది భారతదేశమందలి ద్రావిడ పద్ధతియే కావలెనుగదా. దీనికి ఉదాహరణము తమిళ వాఙ్మయమే.

భారతీయ వాఙ్మయ పరిణామములో మన మందరము పరిశోధింపక విస్మరించి యుండునది సంస్కృత కర్ణాటాంధ్ర కవిత్వముల మీద తమిళ వాఙ్మయ ప్రభావము తమిళములో కవిత్వము అతిప్రాచీనకాలము నుండియు కలదను విషయమునకు ప్రత్యేకమైన రుజువక్కరలేదు. అది జగత్ప్రసిద్ధము. తమిళములో యతిప్రాసలు రెండును కలవు. విచిత్రమేమనగా ప్రాసనువారు 'యదుగై' యనియు, యతిని 'మోనై' యనియు పేర్కొన్నారు యతినియమము వారిది, మనవలెకాక ఐచ్ఛికము, అనగా ప్రతివృత్తమందును ఉండవలెనుగాని ఎక్కడైన పంక్తిలో నుండవచ్చును. ఏ పంక్తియందైనను నియతమైన యక్షర సంఖ్యలేదు పద్యపాదములు నాల్గింటిలోను ఒక్కరీతిగానే ఒక్కచోటనే రానక్కరలేదు. చూడగా ఈ రెండు పద్ధతుల కలయికలోని భేదములు కర్ణాటాంధ్ర కవిత్వములని తోచుచున్నది.

మరియొక సందేహము పొడముచున్నది. కందపద్యమునకు మూలము ప్రాకృత ఛందమందలి ఖండకము లేక స్కందకముగా తోచుచున్నది. ఆర్యకును దీనికిని దగ్గర. ప్రాకృతమనగా సామాన్యముగా మహారాష్ట్రియేగావునను కాళిదాసాదులు సంగీతాదులకు మహారాష్ట్రినే ఆశ్రయించిరి గావునను, మహారాష్ట్రులకే ఆరెలనినామాంతరము ఆర్యశబ్ద భవముండుటవలనను ఆర్యాదుల ప్రాకృత సంప్రదాయాదులు దేశమున వర్వియుండును. వీని ప్రభావము కవిత్వము నందుకన్న సంగీతమున నెక్కుడుగా కనబడుచున్నది. అందు చేతనే మార్గదేశి సంగీతమును నృత్తములును కనబడుచున్నవి. దక్షిణాపథములో సంస్కృతప్రాకృత తమిళ పద్ధతులు కలిసి ప్రాంతీయ పద్ధతులును సంప్రదాయములును, ఏర్పడి నట్లున్నవి తమిళ ఛందో విధానమును గురించి కీ శే టేకుమళ్ల రాజగోపాలరావు గారు ఇంగ్లీషులో వ్రాసిన చిన్న పుస్తకము తప్ప మనకు వేరేదియులేదు

మరి—మాఘుడు తెనుగు సంప్రదాయమును గ్రహించెనా కన్నడ సంప్రదాయము ననుకరించెనా, లేక ఇతనిని చూచియే కర్ణాటాంధ్రులు నేర్చుకొనిరా, ఈ పద్ధతులు మాఘునికన్న, వాస్తవముగా దాక్షిణాత్యుడైన భారవిలో కలవా ? రవికీర్తి మత్తేభముసు కర్ణాటక దేశమందుండి వ్రాసినమాత్రమున నది యొక సంప్రదాయమనియు, అసంస్కృతీయమనియు నెట్లు సిద్ధాంతీకరింపగలము. సంస్కృత ఛందమునకు వైదిక ఛందము మూలము పింగళనాగుని ఛంద ప్రస్తారమునుబట్టి కవులు తమతమ యవకాశములను పురస్కరించుకొని కల్పనలు చేయుచుందురు. లట్లే రవికీర్తియు మాఘుడును కల్పించి యేలయుండరాదు. ద్వితీయాక్షర ప్రాసమువారు గ్రహింపనందున వాస్తవముగా హీరు కన్నడ పద్ధతిని గ్రహింప లేదనియే చెప్పవలెను రవికీర్తి కర్ణాటకుడైనచో మాఘుడు బొత్తిగా కాడుగదా. ఛందోగ్రంథములలోని సకల వృత్తములను వ్రాసిన కవి యెవడేని కలడా ? కవిత అలవాటును బట్టి, సాధననుబట్టి, అవకాశమునుబట్టి, సమకాలిక వాతావరణమునుబట్టి.

పరిశోధక పరమేశ్వరుల లెక్క ప్రకారము కవిరాజమార్గము క్రీ శ 825 ప్రాంతముదిగదా. అందుదాహృతుడైన మాఘుడు క్రీ శ. 848 నాటికి రాజ్యమునకు వచ్చిన గుణగ విజయాదిత్యుని సాతలూరు శాసనమును చదువుకొని అనుకరించె ననుటకన్నవింతకలదా ఏడవ ఎనిమిదవశతాబ్దులలో గూర్జరప్రాంతములయందుండి, ఎచ్చటనుదాక్షిణాత్యసంబంధము కనబడనిమాఘుడేమి సాతలూరుశాసనమునుచదువు కొనుటయేమి ? అంతయు తలక్రిందులుగా నున్నది. మాఘునికితోడు రాజశేఖరుని కూడ వీరు జంటించినారు రాజశేఖరుడు క్రీ. శ. 920 దాదాపు వరకు ఉండినందున పరవాలేదు మాఘుని కాలమునకు ముందుగాని, అతని సమకాలికముగా ఇట్టి రచన కానరానందున ఇతడే కర్ణాటాంధ్రులకు లేదా ఆంధ్రులకు మార్గదర్శకుడై యుండనేమో ! వామనుడు రాష్ట్రకూటుల కడకువచ్చి మాఘుని పరిచయము చేసి యుండరాదా, రాష్ట్రకూట సమకాలిక రచనయైన సాతలూరి శాసనకవి మాఘుని చదువుకొని అనుకరించియుండరాదా ? చిత్రకవిత్వ బంధకవిత్వాదులను ఎన్నింటినో చేసి తన ఛందోవ్యాకరణాది పాండిత్యమును ప్రదర్శించిన మాఘుడు మొత్తము నలువది యొక్క వృత్తములను వాడెనని కవిచరిత్రకారులు వ్రాసియున్నారు. అట్టికవి ఈ మాత్రము కల్పించి యుండనేరడా ?

కీ శ 1931లో, మామూలు కళాశాలా విద్యార్థులకు వ్రాయుచు శ్రీ ఆర్ వాసుదేవశర్మగారు ఇట్లు విశదీకరించినారు.

**"The Maghakavya by Maghakavi treats of the staying of the Chedi king Sisupala in 20 Cantos, and is avowedly written to surpass and excel Bharavi, a distinction vouch-safed to him by orthodox Hindu opinion There is to be found in this a luxnriance oferotic and other descriptions in which he makes a distinct attempt to improve on all his predecessors n the field He reproduces the verbal tricks and quaint devices of Bharavi and produces various Padmabandha, Khadgabandha and Chakrabandha verses. His strong point was his grammatical and rhetorical erudition and his work abounding as it does in rare grammatical usages is oft quoted and studied by Hindu savants. He uases as many as 41 metres thus evidencing his wonderful mastery of versification." (p. 31)**

ఇంత విషయముండగా వీనిని గురించి ఇంతటి పరిశోధక పరమేశ్వరులు చక్కగా సమన్వయింపక, పూర్తిగా తద్విరుద్ధముగా వ్రాయుట, తమ పూర్వ రచననే విస్మరించుట— వీనికి తగినంత ఆశ్చర్యపడగలమా? మాఘుని గురించి ఇప్పటికి వెలువడిన్న గ్రంథములే వీరు చూడలేదన నమ్మగలమా? అన్నిటివి మించిన విస్మయము ఏమనగా— మాఘమునకు వ్యాఖ్య వ్రాసిన మల్లినాథసూరి ఆంధ్రుడు గదా. ఈ చంపకమాలావృత్తమునకు వ్యాఖ్య వ్రాయుచు అతడు ఈ పేరు చెప్పడు సరిగదా మరేదో చెప్పుచున్నాడు రవికీర్తి యొక్క శ్లోకము నుదాహరించిన కళాప్రపూర్ణులు మాఘుని శ్లోకము నుదాహరింపలేదు. అది యిది —

"తురగ శతాకుల స్యపరిత.
పరమేక తురంగ జన్మనః
ప్రమథిత భూభృత. ప్రతిపథం

మశిత సంభృళం మహిభృతా
పరిచలతో బలానుజ బలస్య పురః
సతతం ధృత శ్రియా
శ్చిరవిగతశ్రియో జలనిధేశ్చ
తదా భవదన్తరం మహత్"
(తృతీయ సర్గాంత శ్లోకము— 82)

మల్లినాథ వ్యాఖ్య— "పఞ్చకావలీ వృత్తం. 'నజభజజాజరీ నర కథితా భువి పఞ్చకావలీ' ఇతి లక్షణాత్ ధృతశ్రీ వృత్తమితి కశ్చిత్ 'నజభ పురస్కృతా జజజరారచితా భువి రుద్రదిక్పతి' ఇతి లక్షణాత్" మల్లినాధసూరి వట్టి సంస్కృత పండితుడే గాని తెనుగు బొత్తిగా ఎరుగడా ఏమి? విచిత్రముగా నున్నదే. శ్రీనాధునికిని విన్నకోట పెద్దనకు సమకాలికుడా, తెలుగు కావ్యములను గాని, పోనిండు ఒక్క తెలుగు పద్యమైనను చదివియుండడా. ఈ లక్షణము తెలుగు చంపకమాలకు సరిపోవునని ఆతనికి తోచలేదా. తోచనను చెప్పకూడదా యేమి.? విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో (1402) ఇట్లు వ్రాసినాడు — "ప్రకృతి ఛంద పాదం బేకవింశత్యక్షరంబు.. అందు చంపకమాలావృత్తము— నజభజజజర— 10 యతి—" అని తెలిపినాడు తాను పింగళ ఛందస్సుననుసరించినట్లు ఆదిలోనే చెప్పినాడు. లేక పోయిన మన, లేక వారి, చంపకమె పొరపాటు పంచకమైనదా యేమి గ్రహచారము చాలక! ధృతశ్రీవృత్త మేమి? ఒక వృత్తమునకే వేరు వేరు పేళ్లుండియుండును.

సంస్కృత కవులలో ఒక సుగుణము కనబడుచున్నది వారికి తెలియకయే అవశ్యముగా, ప్రయత్న పూర్వకముగాక ప్రాంతీయ పద్ధతి వారి రచనలోనికి ప్రవేశించినను అఖిలభారత సామాన్యమైన పద్ధతులనే వారు అనుసరించుచుండిరి. ఇందులకు ఆంధ్రుడైన మల్లినాధుడే వ్యాఖ్యలో చంపకమాల పేరెత్తక పోవుటయే నిదర్శనము ఇంత దూరము శ్రమపడి మత్తేభమును రవి కీర్తియు చంపకమాలను మాఘుడును సృజించి సంస్కృత కవులకిచ్చినవారు కన్నడ మార్గములననుసరించియే యుండినయెడల యతినిగాని ప్రాసమును గ్రహించియుండరా కొంతదొంగిలించుటానికి ఇంక కొంత కష్టమా చేదా? ఆ విధముగా నూతన ఫక్కికను వీరు చొన్పియుండిన యెడల ఇతర కవులు గాని ప్రజాబాహుళ్యము గాని వీరిని వీపులు విరుగునట్లు కొట్టి యుందరా? ఇవేవియు కావు అవి సంస్కృత పద్ధతులే. చంపకమాలాది వృత్తములు సంస్కృతములో నుండు నవిగానే గ్రహింపవలెను. ఒక్కొక్క ఛంద శాస్త్ర రచయిత యో, మామూలు రచయితయో ఒక్కొక్క పేరుతో వ్యవహరించినట్లు తోచుచున్నది బహుళముగా రచింపనంత మాత్రమున వారిది గాక పోవునా?

చక్కని చారిత్రక దృష్టితో సంస్కృత ప్రాకృత ఆంధ్ర కర్ణాటకద్రావిడ ఛందోరీతులను చక్కగా పరిశీలించి పండితులు ఒక నిర్ణయమును చేయుదురు గాత.



# కలగూరగంప

## 'పారిజాతాపహరణము'నకు మూల గ్రంథము—1

పై శీర్షికతో శ్రీ బి. వెం. రావు అనువారు 1952 డిశంబరునెల భారతిలో ఒక వ్యాసము వ్రాసిరి. దానిలో వారు "నందితిమ్మనకవి రచించిన తెలుగు 'పారిజాతాపహరణ' కావ్యమునకు కన్నడ భాషలో 'రుద్రభట్టు' అను కవి రచించిన "జగన్నాథ విజయము"అను కావ్యము మూల"మని ప్రతిపాదించిరి. 'జగన్నాథ విజయ', పారిజాతాపహరణ' కావ్యములకు కథాంశములలో గల సాదృశ్యములను చూపిరి. ఈ ఉభయకావ్యములందును భావసామ్యము, పదబంధ సామ్యముగల కొన్ని పద్యములను ప్రదర్శించిరి. ఇట్టి సామ్యముగల పద్యములు లెక్కకు మిక్కిలిగా నున్నవని తెలిపిరి. 'పారిజాతాపహరణము'నకు "జగన్నాథ విజయము" మూలమని సిద్ధాంత మొనర్చిరి.

తరువాత 1958 మే నెల భారతిలో శ్రీ కె. సుబ్బరామప్పగారు'తెలుగు కన్నడ సాహిత్యాల సంబంధం' అను వ్యాసములో శ్రీ బి. వె. రావుగారి పేరును మాత్రము ఉదాహరింపక వారు తెలిపిన సదృశ కథాంశములను, వారు ఉదాహరించిన పద్యములను మాత్రమే పేర్కొనుచు అదే సిద్ధాంతమును పునరుద్ఘాటించిరి. అంతేకాక ఇంకనువారు అనేక వ్యాసములలోను, ఉపన్యాసములలోను "కర్ణాటాంధ్ర సాహిత్యముల పరస్పర సంబంధము" నిరూపించుటకు ఈ జగన్నాథ విజయము, పారిజాతాపహరణముల పేర్లను ప్రముఖముగా ఉదహరించుచు వచ్చిరి. శ్రీ సుబ్బరామప్పగారు ఆంధ్ర కర్ణాట —ఉభయ భాషా విశారదులుగ ప్రసిద్ధులగుటచే వారి మాటలనే ఆధారముగగొని చాలా మంది ఆంధ్ర పండితులను, కన్నడ పండితులును అనేక వ్యాసములందును, గ్రంథములందును గతానుగతికముగ ఇదే సిద్ధాంతమును ప్రచారమొనర్చుచు వచ్చుచున్నారు. మహాపరిశోధకులును, విమర్శకాగ్రేసరులునగు కళాప్రపూర్ణ శ్రీ నిడదవోలు వేంకటరావుగారు కూడా ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమివారి పారితోషికమును పొందగలిగిన తమ "ఆంధ్రకర్ణాటసారస్వతములు : పరస్పర ప్రభావము" '(1961) అను గ్రంథములో అవే పద్యములనుదహరించుచు అదే సిద్ధాంతమును స్థిరపరచిరి (పుట—127).

ఇది ఇట్లుండ బహుభాషా కోవిదులును, సరస్వతీ పుత్రులును అగు శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులువారు "విజ్ఞాన సర్వస్వము"లో 'తిమ్మన' అను వ్యాసములో (నాల్గవ సంపుటము, పుట 820) "తిమ్మన కావ్యమునకు కన్నడములోని హరికథాసారము మూలగ్రంథము. కొన్ని కన్నడ పద్యములనితడుమక్కికి మక్కిగా తెనిగించిన పట్టులున్నవి"అని వ్రాసినారు. ఆ మాట నాధారముగా జేసికొని శ్రీ ఆరుద్ర తమ "సమగ్రాంధ్ర సాహిత్యము"లో "అల్లసాని పెద్దన్నగారు కూడా హరికథాసారం తెలుగులో రచించినట్లు లాక్షణికులు కొన్ని పద్యాలు ఉదాహరిస్తున్నారు. తెలుగులో పెద్దనగారూ తిమ్మనగారూ వ్రాసిన కావ్యాలనుండి కన్నడ కవి అనువదించాడేమో పరిశోధించాలి"అని మరొక సమస్యను లేవదీసినారు. (స. ఆం.సా. సంపుటి 7, పుట 164.)

ఇట్లు జగన్నాథ విజయము, హరికథాసారము అను రెండు కన్నడ గ్రంథములు తిమ్మన కావ్యమునకు మాతృకలుగా చెప్పబడినవి. వీనిలో జగన్నాథ విజయమును గురించిన పరిశీలన కొంత విపులముగా చేయవలసి యున్నది. కనుక ముందుగా హరికథాసారమును గ్రంథమును గూర్చిన పరిశీలన చేయబడు చున్నది.

'హరికథాసార'మను గ్రంథముకొరకై నేను చేసిన అన్వేషణ లెంతమాత్రము ఫలప్రదములు కావయ్యెను. కన్నడ సాహిత్యచరిత్ర గ్రంథములలో ఎచ్చటను "హరికథాసార"మను గ్రంథపు పేరు కనుపించ లేదు. కన్నడ పండితులెవరును తమ భాషలో ఆ పేరుగల పుస్తకమున్నట్లు చెప్పలేక పోయిరి. 'హరికథామృతసార'మను గ్రంథమొకటి మాత్రము కన్నడములో నున్నది. కానీ అది యంతయు ముక్తకప్రాయములైన భక్తికీర్తనల సంకలనము మాత్రమే. వానిలో ఎచ్చటను పారిజాతాపహరణ ప్రసంగమే లేదు. అదియుగాక దాని రచయితయైన జగన్నాథదాసు 18వ శతాబ్దపు ఉత్తరార్ధమున జీవించినవాడు. 16వ శతాబ్దపు పూర్వార్ధమున రచింపబడిన పారిజాతాపహరణమునకీగ్రంథమెట్లు మాతృక కాగలదు ?

ఈ చిక్కును విడదీయలేక నేను శ్రీ నారాయణచార్యుల వారికే ఒక లేఖ వ్రాసితిని "తాము విజ్ఞాన సర్వస్వమందు పేర్కొన్న "హరికథా సార" గ్రంథమును రచించిన కవి పేరేమి? ఆ గ్రంథము ఎచ్చట లభ్యము కాగలదు? దయచేసి తెలుప గోరెదను."అని శ్రీ ఆచార్యులవారు దయతో వెంటనే సమాధానమొసగినారు. "విజ్ఞాన సర్వస్వమందు నేను తిమ్మన పై వ్యాసము వ్రాసినట్లు గుర్తు లేదు. ఎట్లైనా రుద్రభట్టు రచించిన జగన్నాథవిజయములోనే పారిజాతాపహరణ కథ ఉండేది. హరికథామృతసారంలో పారిజాతాపహరణ ప్రసక్తి లేదు. విజ్ఞాన సర్వస్వంలో అచ్చు తప్పు పడియుంటుంది. రుద్రభట్టువ్రాసిన జగన్నాథ విజయాన్ని ముక్కుతిమ్మన చూచి వుంటాడు"అని.

ఆలోచింపగా, జగన్నాథవిజయ,జగన్నాథదాస —అను పేరులందలి సామాన్యాంశమైన 'జగన్నాథ'శబ్దమే ఈ పొరపాటునకు కారణమని తోచుచున్నది. ఆచార్యులవారు ఎప్పుడో జగన్నాథ విజయమును చూచియుందురు. లేదా అది పారిజాతాపహరణమునకుమాతృకయనుప్రవాదమునువినియుందురు.కాని, 'తిమ్మన' వ్యాసము వ్రాయునసమయమునకు "జగన్నాథ విజయము"నకు మారుగా 'జగన్నాథదాసు"వారి స్మృతి పథమున మెదలియుండును. జగన్నాథదాసు రచించిన గ్రంథపు పేరుకూడ వారి జ్ఞాపకములో కొద్దిపాటి మార్పు చెంది "హరికథామృతసారము' నకు మారుగా 'హరికథాసారము'గా రూపొందినది. దానితో అది పరిశోధింపదగిన అంశముగా ఆరుద్రగారికి పొడగట్టుట సహజమే గదా.

ఏది ఏమైనను "హరికథాసార'మరీచికను సృష్టించిన శ్రీ ఆచార్యులవారే ఇది భ్రమజనితమని అంగీకరించుటతో హరికథాసారవాదము నిర్మూలమైనది.

ఇంకను జగన్నాథ విజయము పారిజాతాపహరణమునకు మూలమను వాదము నందలి సాధక బాధకములను వివరముగా పరిశీలింతము.

(''తెలుగు పారిజాతాపహరణము, కన్నడ జగన్నాథ విజయము: ఒక తులనాత్మక పరిశీలన'' అనునా పి.హెచ్.డి.సిద్ధాంతవ్యాసము ఆధారముగా రచింపబడినది.)

**- శ్రీ చన్నాప్రగడ తిరుపతిరావు.**

# నైషధశైవము

నైషధమొక మహాకావ్యము. సంస్కృత మహాకావ్యములలో దానిని మించిన కావ్యము లేదన్నచో ఆశ్చర్యముగానేరదు. అక్కారణముననది వెలువడిన నాటి నుండి నేటివరకు మహామహులెందరో దాని సౌందర్యమునకు ముగ్ధులై తమ తమ వ్యాఖ్యానముల మూలమున ఎలుగెత్తిచాటియున్నారు. మహామహోపాధ్యాయుడగు మల్లినాథసూరిగారు తమ వ్యాఖ్యానము ప్రకటించుటతో నాంధ్రదేశమునకు ఉపకారమొనర్చియున్నాడు. అంతకుముందే చాలామంది మహనీయులు నైషధ కావ్యముపై వ్యాఖ్యానములు ప్రకటించియుండినను తరువాత నాటిమహిమ సన్నగిల్లి పోవుటయేగాక నేటికి నామమాత్రావశిష్టములుగ మాత్రమే నిలిచియున్నవి. చాలా మంది వాఙ్మయ చరిత్రకారులు తమ గవేషణమున నీ వ్యాఖ్యానములసంగతి నుట్టంకించిరి గాని ఫలితము శూన్యమే. దీనికి తోడు ఆయా ప్రాంతములలో పండితులు వ్రాసిన వ్యాఖ్యలు ప్రబలుటయునున్నది. అట్టి వానిలో నారసింహబేదరక కృతమయిన వ్యాఖ్య మహారాష్ట్రప్రాంతమున ప్రచురముగనున్నది. అంతియేగాక కొందరు శ్రీ హర్షులవారు అద్వైత ప్రచారకులని అద్వైతపు విశేషములెన్నియో నైషధకావ్యమున నున్నవని చెప్పువారును నాటికిని నేటికిని యావద్భారతమున గలరు. ఇట్టివారి ప్రచారములవలన శ్రీహర్ష కావ్యమును చదివి యాదార్థ్యము వ్రాసెడివారి సంఖ్య తగ్గిపోయినది.

కాననివాని నూతగొని కాననివారికి బలె ప్రయాణము సాగించుచున్న సాహిత్య పథికులకు మరియొకసారి ఎలుగెత్తి జాగ్రత్త వహింప వలసినదని హెచ్చరించిన గౌరవము—ఎన్ని శతాబ్దములుగనో నైషధమహాకావ్యముయొక్క తత్వమును వెలువరింప గలిగిన సాహసము —అసాధారణ తత్వ చింతనము నెరపిన మహాగ్రంధము నైషధ సంజీవని. దానిని శ్రీ పెదపాటి నాగేశ్వరరావుగారు రచించిరి. శ్రీవారిప్పటికి ''శ్రీనాథుని పంచ ప్రాణములు'' అను గ్రంథమును రచియించి శ్రీహర్షశ్రీనాథుల హృదయమును ప్రదర్శించిరి. శ్రీనాథుని విషయమున గూడ తెలుగు సాహిత్యమున కవి చరిత్రకారులు, వాఙ్మయ చరిత్రకారులు, శ్రీనాథుని విషయమున నానక్తితో రచనలు సాగించిన వారియొక్క, రచనలు వానియొక్క తత్వదృష్టియు వెలువరించిరి. విశ్వ విద్యాలయములను ఆకాడమీలను అంటిపెట్టుకుని రచనలు సాగించుకొందరు శ్రీవారి గ్రంథముపై బాణములు విడిచిరి కాని అవి తిరిగి వారివారి అమ్ముల పొదినే చేరినవి. ఆచార్య పె. నాగేశ్వరరావుగారి నైషధభాష్యములో వెలువరించిన విశిష్ట విషయములలో శైవ సిద్ధాంత ప్రదర్శనకు సంబంధించిన వివేచనము ముఖ్యమంయినది. శ్రీహర్షుడు, నైషధ కావ్యరచన వలన వెలువరించిన సందేశమేమి? ఆ సందేశమున వెలువరించుటలో శ్రీ హర్షులవారెట్టి మెళుకువ చూపిరి ? దానికి గల విస్తృతార్థము లెయ్యవి?అని ప్రాచీన వ్యాఖ్యాతలు చూపగలిగిరా? ప్రస్తుత వ్యాఖ్య మూలగ్రంథమునకుపకారకమా? కాదా? అవి విచారించి సత్యము నన్వేషించితిమేని నువ్వు ప్రాయమైన ఈ నాటి సంస్కృత వ్యాఖ్యాల్ప ప్రపంచములో వొక సుముహూర్తమేతెంచి ఈ గ్రంథము తయారయినదనియు శ్రీహర్ష భారతికిది అమూల్యాభరణమనియు నంగీకరింతురు. ఎన్నియో శతాబ్దములనుండి నైషధ భారతిలో మరుగుపడి పోయిన తత్త్వరహస్యములు నెన్నిటినో వివిధ వ్యాఖ్యా జటిల వాదములలో మరచి పోయినవాటిని క్రోడీకరించి కవిహృదయమునకు దగ్గరియగు విషయములు ప్రస్తావించుటవలన ఈ వ్యాఖ్య నైషధ భారతికి ఒక అనర్ఘభూషణమగు చున్నది. శ్రీవారు వివరించిన శైవసిద్ధాంతవిషయములను సూక్ష్మముగ పరిశీలింతము.

శ్రీ హర్షుని కథాబీజ నిర్దేశమును వ్యాఖ్యానించుచు చూపిన శ్లోకము

దిగీశ బృందాంశ విభూతిరీశితాం
దిశాంస కామప్రసభావరోధినీమ్
బభారశాస్త్రాణి దృశం ద్వయాధికాం
నిజత్రినేత్రావతరత్వ బోధికామ్!! (1—6)

ఇందులో నైషధ కథాబీజము శైవ సిద్ధాంతపరముగ నున్నదన్న సంగతి వ్యాఖ్యలన్నిటిలోను ప్రస్తావితముకాలేదు. దీనిని మహాకవి తన ప్రతిభా విశేషముచే రత్నమునకువలె పొదిగియుంచినాడు. అందులకే కథానాయకియగు దమయన్తీదేవి యందు పార్వతీ తత్వమును చూపి కథాసందేశమున పాతివ్రత్యమున కుత్తమ స్థానమొసంగినాడు. దీనిని ఏ కొంతగానో గ్రహించినందువలననే శ్రీనాథుడిట్లు పలుక గలిగెనన్న వీరి వాదము పరమసత్యము శ్రీనాథుని పద్యమిట్లున్నది

త్రిదినేత్రుని యపరావతారమగుట
దెలుపు దిక్పాల కాంశావలిర్నడతడు
కామసంచార హరణ ప్రగల్భమైన
శాస్త్రమనుపేరి యధిక లోచనము కలిగి

శ్రీనాథుడను వ్యాఖ్యాతయొకడు శ్రీ హర్షుని నైషధముపై వ్యాఖ వ్రాసినట్లు తెలియుచున్నను అది దొరుక లేదు. కావున దానికిని శ్రీనాథమహాకవికిని ఎట్టి సంబంధము లేదని చెప్పవచ్చును ఇట్లే శ్రీ హర్ష భారతిలో శైవ భావోద్దీపనముగల పట్టులు కోకొల్లలు. ప్రతిసర్గలోను వాడిన ఉపమానములు వాటికి గల శైవకథా సంబంధములు ఈ వ్యాఖ్యలో సూచితమయినవి. ఇవి అన్నియు మల్లినాథవ్యాఖ్యలో ప్రాముఖ్యతనందలేదు. దానికి కారణమొక్కటియే. శైవ సంప్రదాయములో పుట్టిపెరిగిన వారికిని ఇతరులకును ఆయా సందర్భములను హృదయమునకు పట్టించు కొనుటలో గల పట్టు విడుపులు ఇంతవరకు మల్లినాథవ్యాఖ్యపై ఆధారపడిన పఠనపాఠప్రవచనములలో గల విషయమునకు దానికి భిన్నముగ ఆలోచనోద్దీపకముగ వెలువడిన రచనకును భేదము చూడ గలము శ్రీ హర్షుడిది గమనించియే కాబోలు తన వాణిలో ఒక ఎత్తిపొడుపు పొడిచినాడు

అగ్నిహోత్రం త్రయీ తంత్రం
త్రిదండం భస్మ పుండ్రకమ్
ప్రజ్ఞాపౌరుష నిస్స్వానామ్
జీవో జల్పతి జీవికా ॥ (17—38)

అట్లే శైవ సమయములో విశిష్టములైన సంప్రదాయములు నేటి నామమాత్రావశిష్టములునయిన వాటిని గూడ పేర్కొనినాడు. దారిద్ర్య విద్రావణ శబ్దముపై శ్రీ పెదపాటి నాగేశ్వరరావుగారు వ్యాఖ్యానించుచు నన్నెచోడమహాకవి రచించినకుమార సంభవమను కావ్యములోగల దారిద్ర్య విద్రావణస్తవముపై తులనాత్మక దృష్టితో వెలువరించిన వ్యాఖ్యయు గమనింప దగినది. ఈ గ్రంథమున పరిశీలింపబడిన మరియొక విషయము సర్గాంత శ్లోకముల యౌచిత్యమును గూర్చినది. చూడుడు

శ్రీహర్షః కవిరాజరాజమకుటాలంకార హీరః సుతం
శ్రీహీరః సుషువే జితేంద్రియచయం మామల్లదేవీచయం
తచ్చింతామణిమంత్రచింతన ఫలే శృంగారభంగ్యామహా
కావ్యేచారుణి నైషధీయ చరితే సర్గోయమాదిర్గతః

అనుఘోరణిలో ప్రవహించిన సర్గాంత శ్లోకములు చూచినప్పుడు కొన్నిప్రశ్నలెదురగు చున్నవి. ఈ శ్లోకములు శ్రీ హర్షులవారే వ్రాసిరా? వ్రాసినచో సరాంతములలో చూపిన పట్టుదల ఆముఖమున నెందుకు చూపలేదు? మంగళాశాసన పరముగ ఒక్కశ్లోకమును గూడ వ్రాయలేదేమి? ఇప్పట్టుల గ్రంథపాతముగల దనియే యెంచిన శ్రీమదాచార్యులవారి వాదము సమంజసమే! ఈ సర్గాంతశ్లోకములలో ఎక్కడో ఒకచో ఖండన ఖండఖాద్య —గౌడోర్వీశకుల ప్రశస్తుల స్మరణమా ? చివరికి షోడశసర్గలో

శ్రీహర్షః కవిరాజరాజరాజమకుటాలంకారహీరః సుతం
శ్రీహీరః సుషువే జితేంద్రియచయం మామల్లదేవీ చయం
కాశ్మీరైర్మహితే చతుర్దశతయీ విద్యాంవిదద్భిర్మహా
కావ్యేతద్భువినైషధీయ చరితేసర్గోగమత్‌షోడశః (16-130)

అన్న శ్లోకమును చూచినపుడు నానాదేశ వర్ణనలు చూపిన మహాకవి కాశ్మీరదేశమును వదలివేసి ఎక్కడో సర్గాంతరమున మాత్రమే ఎందులకు చూపినాడు? కాశ్మీర్ శైవమునకు కావలసిన సంకేతములనేమియు వాడలేదే? దాక్షిణాత్య శైవ దర్శనమునకు సంబంధించిన విశేషములెన్నియో కోకొల్లలుగా కనిపించుచుండ కాశ్మీరశైవసమయ సంకేతము లెవ్వియు కనుపింపక పోవుటకు కారణమెయ్యది? ఇక నష్టాదశ సర్గాంతమున

శ్రీహర్షః కవి రాజరాజమకుటాలంకార హీరః సుతం
శ్రీహీరః సుషువే జితేంద్రియ చయం మామల్లదేవీచయం
యాత్మోస్మిన్ శివశక్తి సిద్ధ భగినీ సౌభ్రాత్రభవ్యే మహా
కావ్యేతస్యకృతౌ నలీయచరితేసర్గోయమష్టాదశః(18—149)

అను శివశక్తి స్మరణము మాత్రమున్నది. ఇట్లు సర్గాంతములలో వివిధ రీతులలో సాగిన వర్ణనలు శ్రీ హర్ష మహాకవికి ఎంత దగ్గిరివి? అన్న విషయము విచార్యమే! వ్యాఖ్యాతలు మనకు వదలి వేసిన రీతిగానే వీటిని శ్రీ హర్షలేఖినీ జన్యములని త్వరపడి అనలేము. శ్రీమదాచార్య పెదపాటి నాగేశ్వరరావుగారు సూచించిన శైవసంకేతములు ప్రతిసర్గమున నున్నవి. వారు తమ గ్రంథములో నిచ్చిన వివిధ పట్టికలీవిషయమున కతి ముఖ్యములు. దాక్షిణాత్య శైవసాహిత్యమునకు చాల దగ్గరలో-నున్న ఉపమానములు ఉత్ప్రేక్షలు శ్రీ హర్షవాణిలో నున్నవి. కనుక శ్రీ హర్ష మహాకవి వర్ణించిన శైవామృతము ఆంధ్ర మహా కావ్యములలో శ్రీనాథాది మహాకవులు పంచిపెట్టిన దానికన్న నితరముగాదన్న శ్రీవారి సూక్తి సత్యము.

శ్రీనాథుని పంచప్రాణములు అన్న గ్రంథమున శ్రీ హర్షుని అవతారమే శ్రీనాథుని మహాకవియని సిద్ధాంతీకరించిరి. గ్రంథము పఠించినచో శ్రీ హర్ష —శ్రీనాథుల ఆత్మయే మహనీయతగల వాణిలో శ్రీ పెదపాటి నాగేశ్వరరావుగారి లేఖిని నుండి ఈ విషయములను వెలువరింప జేసెనని చెప్పవచ్చు. మహాకవి ఋణమును తీర్చి ధన్యులయినారని చెప్పవచ్చును. త్వరలో వారి సంస్కృత—ఆంగ్ల —ఆంధ్ర భాషలలో గల నైషధవ్యాఖ్య ప్రచురితమై అజరామకీర్తి నందుగాత!

- శ్రీ బండి సత్యప్రసాద్.

# నారాయణుఁడు (గజాంకుశుఁడు)

## (క్రీ. శ. 945 ప్రాంతము)

మడికి సింగన కవి కూర్చిన సకల నీతిసమ్మతము అను సంకలన గ్రంథముయొక్క అవతారిక (వ7) నుండి గజాంకుశ నామము తెలియుచున్నది. అయితే సకలనీతి సమ్మతము పూర్తిగా లభింప లేదు. లభించిన దానిలో గజాంకుశుని పద్యమనియుదహరింపబడలేదు.

కాని గజాంకుశుని కాలమును గురించి చర్చ చేయ వచ్చును. మడికి సింగనకవి క్రీ. శ. 1347 ప్రాంతపు వాడు. కాబట్టి గజాంకుశుడంతకు పూర్వపుకవియని స్పష్టమగుచున్నది. అయితే ఎప్పటివాడు ? గజాంకుశుడు తెలుగులోనేకాక కన్నడభాషలో గూడ గ్రంథ రచనచేసినాడు. కావున అతనిని ప్రశంసించిన కన్నడకవులు అతని కాలనిర్ణయమునకు గొంత తోడ్పడుచున్నారు. క్రీ. శ. 1049 నాటివాడైన శ్రీధరాచార్యుని జాతకతిలకమందును, నయసేనకవియొక్క (క్రీ.శ. 1112) ధర్మామృత గ్రంథమందును, మల్లికార్జునకవి (క్రీ. శ. 1245) కటర్చిన గ్రంథములోను గజాంకుశుని ప్రశంసలున్నవి. దుర్గాసింహుడను కవి (క్రీ. శ. 1145) తన పంచతంత్రచంపూ కావ్యములో గజాంకుశుడు దండనాయకుడని తెల్పినాడు. ఆ విధముగా గజాంకుశుడు క్రీ. శ. 1049 కి పూర్వపువాడని నిశ్చయమగు చున్నది. అయితే అతడు ఎంత పూర్వపు వాడో తెలుసుకొనవలసి యున్నది.

గజాంకుశుడు అనునది ఆ కవి యొక్క అసలు నామముకాదు' అది బిరుదనామము మాత్రమేయను విషయమును తెలుగు కవుల చరిత్ర నిడదవోలు వెంకటరావుగారు బయల్పరచినారు. రాష్ట్రకూటరాజులు దక్కను యొక్కపశ్చిమ ప్రాంతములో పరిపాలించిరి. వారిలో అమోఘవర్షుని కుమారుడగు మూడవ కృష్ణుడు క్రీ.శ. 939—965వరకు రాజ్యమేలినాడు. అతనికి అకాల వర్షుడను బిరుదున్నది. అతడు క్రీ.శ. 945లో శాలోద్గి గ్రామమున సంస్కృత శాసనమును వేయించినాడు. దానిలో నారాయణ మంత్రియొక్క బిరుదు గజాంకుశుడని చెప్పబడినది. మరి కొంత చరిత్ర కూడా తెలియుచున్నది. అతడు మహిష

దేశములో కాంచనముదువోలు గ్రామనివాసి. బ్రాహ్మణుడు. కౌండిన్యగోత్రికుడు, కశ్వాశాఖీయుడు. అతని తండ్రిపేరు దామపార్యుడు. నారాయణుడు మూడవ కృష్ణునకు ప్రధాని, సంధి విగ్రహియు.

అతడు విద్వాంసుడు, కవిముఖ్యుడు, ప్రియవాది, ధర్మరతుడును శాలోద్గి గ్రామశాసనము క్రీ. శ. 945 నాటిది. కాబట్టి గజాంకుశుని కాలము క్రీ. శ. 945 ప్రాంతమని నిశ్చయమగు చున్నది. మడికి సింగనకవి పేర్కొన్న గజాంకుశుడతడే అని మరియొక అంశముగూడ రుజువు చేయుచున్నది. పై శాసనములోనే గజాంకుశుని గురించి ఇంకను ఇట్లున్నది —"కవిప్రముఖః, పారగో రాజవిద్యానామ్" అతడు రాజవిద్య అనగా నీతి విద్యనెరిగి యున్నవాడు. అట్టివాడు రాజనీతి గ్రంథమును రచించుటలో చిత్రమేమియులేదు గదా!

గజాంకుశుడు కన్నడమునలో వ్రాసిన గ్రంథజాలముగాని, పద్యములు గాని బైటపడలేదు. ఇక తెలుగు రచనల విషయము చూచెదము.

తెలుగులో అతని రచనలు లభింపలేదని పండితులు పలుకుచున్నారు. అయితే అది సత్యమా? మడికి సింగన వ్రాసిన వ్రాతయిట్లున్నది '.... యాంధ్ర భాషా కోవిదులగు ... గజాంకుశ నీతిసార ... నీతివిశేషంబు "1—7 పై వాక్యములోని కొన్ని పేర్లను పరిశీలింపవలసి యున్నది, పై పేర్లలో సింగన కొన్ని పేర్లను మాత్రము చెప్పివిడిచినాడు. మనము వాటికి ప్రక్కన నీతియను పదము చేర్చుకొనవలెను ఉదా:—చాణక్యనీతి, విదురనీతి యిత్యాదులు. అయితే 'కామందక' పదమట్టిదికాదు. అది గ్రంథకర్తకును, గ్రంథము పేరునకును (కామందకము) గూడ సరిపోగలదు. ఇక 'గజాంకుశ' పదమును గమనించినచో అది గ్రంథకర్త బిరుదు మాత్రమే. దానిని గ్రంథపరముగా జెప్పదలచినచో గజాంకుశీయమనుట లెస్స. అయితే అట్లు లేదు. ఆ పదమునకు ప్రక్కన నీతిసారమను పదసమూహమున్నది. నీతిసారమనునది మామూలు మాటయె. అది ప్రత్యేక గ్రంథనామముకాలేదు. కాబట్టి ఈ క్రింది రీతిగా చెప్పబడు చున్నది. కామందక నీతిసారము, శుక్రనీతిసారము, బార్హస్పత్య నీతిసారము. అయినను మన విమర్శకులు గజాంకుశ, నీతిసార అను రెండు సంపుటలను విడదీసి వేర్వేరు అర్థములను చెప్పుచున్నారు. అట్లు విడదీసిన యెడల ఆ సమాసము అర్థరహితమై పోవును. ఇతను సకల నీతిసమ్మతముయొక్క లభించిన భాగములో గజాంకుశ పద్యమనియొక పద్యమునుదహరింపబడలేదు. ఇంకనుమన విమర్శకులు నీతిసార పదమునకు రుద్రుని నీతిసారమని చెప్పుచున్నారు. అది సబబా? బద్దెనకవి తన రచనలలో నొకదానిని నీతిసారమని పేర్కొన్నాడు. అయితే సకల నీతిసమ్మతములో బద్దెనకవి పద్యములు బద్దెననీతియను పేరుతో జూపబడినవి. సకలనీతి సమ్మతములో రుద్రునిపేరు చెప్పబడలేదు. కాబట్టి రుద్రుని పద్యములు సకల నీతిసమ్మతములో నుండుటకు సాధ్యముగాదు. అట్లు నీతిసారమను మాట గజాంకుశ శబ్దమునకు సంబంధించినదియే కాని రుద్రుని పేరుతో చేర్చుటకు వీలులేదు. కాబట్టి సకల నీతిసమ్మతములో నీతిసారమని సూక్ష్మముగా తెలుపబడిన పద్యములు గజాంకుశ నీతిసారములోనివేకాని అన్యకములు కావు. ఇట్లే మరియొకటి కూడా తెలుపబడినది. కందనామాత్యుని నీతితారావాళిలోని పద్యములు నుదహరించినప్పుడు గూడ పూర్తిపేరు చెప్పబడక నీతితారావళియని సూక్ష్మముగా తెలుపబడినది. కాబట్టి సకల నీతి సమ్మతములో నీతిసారమను పేరున చెప్పబడిన పద్యములన్నియు గజాంకుశ నీతిసారములోనివే

అయినను అవి రుద్రనీతి సారములోనివై యుండునేమో కూడ వేరొక మార్గమున పరిశీలింపదగును. ఆ విషయమును తెలుసుకొనుటకు ముందుగా కొన్ని విషయములను గ్రహింపవలసి యున్నది.

బద్దెనయొక్క నీతిశాస్త్రముక్తావళియని పిలువబడెడి గ్రంథమొక సంకలన గ్రంథము మాత్రమే. దానిలో మూడు గ్రంథముల యెంపిక లున్నవి.—1 బద్దెననీతులు, 2. బద్దెన నీతిసారముక్తావళి, 3. రుద్రనీతిసారము. రుద్రుత నీతిసారమెంత గ్రంథమో మనకు తెలియదు. కాని దానిలో నలువదియైదని పద్యముల వరకు నిప్పటి నీతిశాస్త్రముక్తావళిలో నున్నది. సకలనీతిసమ్మతములో నీతిసారముపేరున 114 పద్యములున్నవి కదా! పైన జెప్పిన నలువదియైదు పద్యములలో నొక్కటియైనను సకలనీతిసమ్మతములోగల నీతిసారములో గనబడుట న్యాయముగదా! కాని యట్లు కనబడదు. అది చాలదా ఆ రెండు వేర్వేరు గ్రంథములని రుజువు పరచుటకు. అట్లుగాక బద్దెన పద్యములు కొన్ని సకల నీతి సమ్మతములోని నీతిసారము గజాంకుశ నీతిసారమే కాని మరియొకటి కాదు. అట్లు మనకు గజాంకుశ నీతిసారములోని 114 పద్యములు లభించినవి. అదియెంత పెద్దగ్రంథమో మనకు తెలియదు, కాని మానవల్లి రామకృష్ణ కవిగారు నీతిసారమను పేరుగల ఆ పద్యములను పరీక్షించి బార్హస్పత్య నీతిసారమునకు అవి అనువాదముగా గనబడు చున్నవన్నారు. బార్హస్పత్యము మూడువేల శ్లోకముల గ్రంథమట! గజాంకుశుడా గ్రంథమునంతను తెనిగించి యుండడు. ఆ నాటి దేశభాషలలో గ్రంథ రచనా పద్ధతి సంగ్రహీకరణము. కావున గజాంకుశ సంగ్రహ రచనలో నెన్ని పద్యము లున్నవో తెలియదు.

తెలుగు వాఙ్మయములో గజాంకుశమను లక్షణ గ్రంథమున్నది. అది సంస్కృతములోని గజాంకుశమునకు తెలుగని తెలియుచున్నది. సంస్కృత గజాంకుశము మనము చెప్పుకొన్న గజాంకుశునిదేమో మనకు తెలియదు. ఏదైనను గజాంకుశుని గ్రంథమొకటియైనను తెలుగు వాఙ్మయమునందుండుట విశేషమే.

– శ్రీ జేకుమళ్ళ కామేశ్వరరావు.

# గ్రంథ విమర్శలు

## స్వవిషయం (మూడవ భాగం)

### గ్రంథకర్త: శ్రీ లింగం వీరభద్రయ్య చౌదరి

(సోల్ డిస్ట్రిబ్యూటర్స్: త్రివేణి పబ్లిషర్స్, మచిలీపట్టణం—1, మదరాసు—1 మూల్యము: 13 రూపాయలు.)

'మూడు భాగాలుగా శ్రీ చౌదరిగారు వ్రాసిన స్వవిషయంలో మూడవ భాగం ఇది. 767 వ పుటతో ప్రారంభమయే 1248 వ పుటతో పూర్తయింది. గ్రామజీవితం, వ్యవసాయం, పశుపోషణ, లలిత కళలు, సాంస్కృతిక కలాపాలు, సంచారం, గ్రంధరచన, బంధువులు, మిత్రులు మిగిలి పోయినవి—అనే అధ్యాయాలున్నయ్ ఈ గ్రంథంలో. శ్రీ షిరిడీ సాయిబాబాకు అంకితం ఇచ్చారు ఈ గ్రంథాన్ని.

గ్రామజీవితం అనే అధ్యాయంలో "పబ్లిక్ సర్వీస్ కమిషన్"లో తనకు సభ్యత్వం లభించక పోవడాన్ని వస్తు నిష్ఠంగా విశదీకరించారు. పెదననగల్లు చేరుకుని వ్యవసాయం ప్రారంభించిన పరిస్థితులను వివరించుతూ "కుల వృత్తికి సాటిరాదు గువ్వల చెన్నా" అనే పాఠాన్ని ఉటంకించారు. ఇంగ్లండులో విద్యాశిక్షణ పొంది సమిష్ఠి మదరాసురాష్ట్రంలో హెూదాగల ఉద్యోగం చేసి పదవీవిరమణ చేసిన శ్రీ చౌదరిగారు వ్యవసాయాన్ని శేషజీవిత వృత్తిగా స్వీకరించారు. భూమిని సాగు చెయ్యడంతోపాటు సాహిత్య క్షేత్రంలోనూ, లలితకళా రంగంలోనూ కూడా కృషి చేయడం ప్రశంసించదగిన సంగతి అనడంలో అతిశయోక్తి లేదు. పెదననగల్లులో తన భార్యకు లభించిన ఇంటిని బాగుచేయించారు. మదరాసులో అంతవరకూ తనకు ఉండిన సొంత ఇంటిని (61షెనాయ్ నగర్) అమ్మివేసి కుటుంబాన్ని పెదననగల్లుకు తీసుకువెళ్ళారు. ఆ తరువాత 155వ నంబరు య—షెనాయ్‌నగర్‌లోని ఇంటినికొన్నారు. 1911లో గ్రామాల స్థితి ఏవిధంగా ఉన్నదీ వివరించారు 778వ పుటలో. ఈ తరం యువకులు గ్రహించవలసిన అంశాలు కొన్ని ఉన్నాయ్ ఈ అధ్యాయంలో. అంతే కాదు గ్రామాలోని ఈ నాటి జీవితవిధానాన్ని ఇట్లా వ్రాశారు 774 వ పుటలో. "ఒకరితో ఒకరు అన్యోన్యానురాగంతో సహకరించు పద్ధతి లేదు కాబట్టి ఈ యూరిలో స్థిర నివాస మేర్పరచుకున్నా, మా క్రిందున్న భూములుద్వారా ఈ గ్రామానికి సంబంధించినవేమైనా, నా కుమారుల స్థిర నివాసం యిదేమైనా, నేనిక్కడ 20 సంవత్సరాల నుండి స్థిర నివాస మేర్పరచుకొనియుండినా, ఈ గ్రామానికి నేను, నాకీ గ్రామం పరాయివాళ్ళంగానూ, లేక సగం పరిచయమున్న వాళ్ళంగానూ ఉండిపోతున్నాం. ఈ గ్రామంలో ఏ సంఘటన జరిగినా ఏవింత వినోదాలు జరిగినా, ఏ తగాదాలు వచ్చినా నేను లేనట్లే వ్యవహరింపబడు తుంది" ఇది ఈ ఒక్క గ్రామంలోనే కాదు చాలా గ్రామాలలో ఈ పరిస్థితులు ఈ విధంగానే ఉన్నాయ్. పెదననగల్లు గ్రామాభ్యున్నతికి చాలా కృషి చేశారు శ్రీ చౌదరిగారు. పశువుల ఆస్పత్రి కట్టించడంలోనూ, పాల విక్రయ కేంద్రాన్ని స్థాపించడంలోనూ శ్రీ చౌదరిగారి కృషి చాలా ఉన్నప్పటికీ ఎవరూ ఆ సంగతినే ప్రస్తావించరు. పరిస్థితులు ఈ విధంగా ఉండగా 'మన గ్రామాలు ఏప్పటికీ, ఏవిధంగా బాగుపడతాయ్? గ్రామాలలోని ప్రజల స్థితిగతులు మెరుగు పడాలని నిజంగా అభిలషించుతున్న వారెవరయినా అసలు న్నారా? పల్లెటూరి మనస్తత్వం గురించి శ్రీ చౌదరిగారు వ్రాసిన వ్యాక్యాలు (798వ పుట) గమనార్హాలు. ఆలోచించ దగిన అంశాలు.

వ్యవసాయం చెయ్యడంలోని అనుపానములనూ కష్టసుఖాలను చర్చించారు ఈ గ్రంథకర్త. "భర్త వుండిన విధవ మాదిరి (గ్రాస్ విడో) ఇన్ని సంవత్సరాల నుంచి ఈ భూము ఈ విధంగా ఉండిపోయింది. ఈ కాలంలో పల్లెటూరి రైతుల సహకారవిూవిధంగా ఏడు స్తున్నది." అన్నారు 819వ పుటలో. రైతుల నుంచి సహకారం లభించాలంటే అనునయించాలి వారిని. అంతాసవ్యంగా వుంటే ఇక శ్రీ చౌదరిగారివంటి నిపుణుల అవసరం ఏముంటుంది. మన తెలుగు పల్లెలకు? కర్నల్ డి. ఎమ్. హెన్నెసీ (టెక్నికల్ ఆయిల్ వాటర్ మినరల్ రాషి స్పెషలిస్టు)తో శ్రీ చౌదరిగారి అనుభవం (820—823 పుటలు) నిపుణులమని చెప్పుకునే వారి అతిశయాన్నీ దగాకోరుతనాన్నీ, దంభాన్నీ సూచించుతుంది. అయితే మరి నిపుణులందరూ ఇట్లాగే ఉంటారని అనగలమా? ఎవరి స్వార్థం వారిదే."

ఇక గ్రామాలలో నౌకర్లుచేసే అఘాయిత్యాల సంగతిని ఈ గ్రంథకర్త ఇప్పుడు గ్రహించడం వింతగానే ఉన్నది. పరిశ్రమలు పెంపొందించడంతో గ్రామీణ వ్యవస్థ దెబ్బతిన్నది. కదలింది కుదురు. కానీ, కొత్త కుదురు, ఏర్పడ లేదు. అద్యతన భావిలో ఏర్పడగలదన్న ఆశఅయినా లేదు.

యలమంచిలి భాస్కరరావు గారితో శ్రీ చౌదరిగారి అనుభవాన్నించి రైతు సేవకులమని చెప్పుకునేవారి కార్యకలాపాలను విజ్ఞులందరూ వోకంట కనిపెడుతూండవలసిన అవసరం విదితమవుతున్నది. శ్రీ వడ్డే శోభనాద్రిరావుగారిని కలుసుకుంటానని చెప్పిన యీ పెద్దమనిషి శ్రీ శోభనాద్రిరావుగారిని కలుసుకునేలేదట. పైగా శ్రీ భాస్కరరావు వో దినపత్రికలో "సరైన నీటి సరఫరా లేక డెల్టా రైతులు ఇబ్బంది పడు తున్నారని వో వ్యాసం రాశారట! ఎంత మోసం?

పశుపోషణ అనే అధ్యాయంలో అనేక అంశాలను వివరంగా చర్చించారు ఈ గ్రంథకర్త. పశుపోషణ యందాసక్తిగల కర్షకులూ, తదితరులూ గ్రహించవలసిన అంశాలున్నాయ్ యీ అధ్యాయంలో. అయితే అంత వోపికా తీరికా ఎవరికి ఉన్నదీ? తమకు ప్రయోజనంకలిగించే అంశాలనయినా మన రైతు సోదరులు గ్రహించరు. కారణం ఏమిటో తెలియదు? పాల విక్రయ కేంద్రం ఏర్పాటు సందర్భంగా కొంత మందితో కలసి శ్రీ చౌదరి జరిపిన పర్యటనలో వారికి తెలిసి వచ్చిన గుణపాఠాలను ఎంతమంది గ్రహిస్తారూ?

పశువులపోషణపట్ల శ్రీ చౌదరికి గల శ్రద్ధాసక్తులను 872 వ పుటనుంచి 878వ పుట వరకూ వివరించుతూ పశుపోషణ శాఖలోని రాజకీయ కుతంత్రాలనూ ధ్వనిగా చిత్రించారు.

విజయవాడ పాలఫ్యాక్టరీ ఏర్పాటులోని రాజకీయాలెంతమంది రైతులకు తెలుసట? పోనీ ఎంతమంది రాజకీయ వాదులకు తెలుసూ? 879వ పుటలో పిరికినేల అని ప్రయోగించారు. అంత ఔచిత్యంగా లేదు ఈ ప్రయోగం.

భూమిని సాగుచేసే రైతు పశువులను పోషించాలి. కోళ్ళను పెంచాలి. ఇవన్నీ పరస్పరాశ్రయాలు గ్రామీణ వ్యవస్థలో కానీ, అసలు గ్రామీణవ్యవస్థకే వీళ్ళు కొడు తున్నారు గదా?

లలిత కళలంటే యీ గ్రంథకర్తకుగల అభిమానాన్ని 898వ పుట నుంచి 936వ పుటవరకూ వివరించారు. 1961లో ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ లలిత కళల అకాడమీలో ఈ గ్రంథకర్త సభ్యులు. శ్రీ నార్ల వెంకటేశ్వరరావు అధ్యక్షుడుగా పనిచేస్తున్న ఆంధ్ర అకాడమీఆఫ్‌ఆర్ట్స్‌లో కూడా సభ్యుడు ఈ గ్రంథకర్త. ఈ రెండు సంస్థలలోని రాజకీయాలనూ నిర్మొహమాటంగా, సరసంగా వివరించారు శ్రీ చౌదరి. తైలరూప్య చిత్రాలను గురించి ఈ గ్రంథకర్త చేసిన విమర్శతో (901వ పుట) ఏకీభవించలేక పోవడం ఎంతవరకూ సమంజసమో సమకాలీన కళాకారులు పరిశీలించడమవసరం. అదే విధంగా పికాసో చిత్రాలను గురించిన ఈ గ్రంథకర్త అభిప్రాయాలు కూడా పరిశీలించదగినవే.

"ఏమండీ నా పేరు లింగం వీరభద్రయ్య చౌదరి గదా" అంటే "నేననేది" అన్నాడట. (913వ పుట) ఒక డాక్టరు. అదే విధంగా శ్రీ నార్ల కూడా "కులాన్ని సూచించే పేర్లు నాకయిష్టం" అన్నారట. ఒక మనవి అసందర్భం కాదనుకుంటాను. తెలుగు దేశంలో వాడుకలో చౌదరి అనే మాట ఒక కులాన్ని సూచించుతున్నమాట. నిజమే —అయినా 'చౌదరి' అనేది ఒక కులానికి పరిమితమయిన మాటకాదు. "చౌధురి" అనే బెంగాలీ బ్రాహ్మణులున్నారు. ఇంకా కొన్ని రాష్ట్రాలలో కూడా ఉన్నారు.

నీలం సంజీవరెడ్డి గారిని—"నీలం సంజీవ" అంటే సరసంగా ఉంటుందా? ఒకవేళ ఉన్నా అట్లా సంబోధించగలమా?

శిల్పకళ గురించి 914వ పుటలో 926వ పుట వరకూ ఈ గ్రంథకర్త వ్రాసిన అంశాలు ఈ తరం రచయితలలో ఎంత మందికి తెలుసూ?

నటన అనే శీర్షికన "స్త్రీ పాత్రధారణలో శ్రీ సంజీవరావు చిత్రాంగి వేష ధారణలో అచ్చం అప్సరసగా, చిద్విలాసభోగంసానిగా కనపడేవారు (938వ పుటలో) అని వ్రాశారు. ఈ గ్రంథకర్త కళా హృదయానికి, అభినివేశానికీ ఇదో నిదర్శనం.

సాహిత్య సాంస్కృతిక కార్యకలాపాలు అనే శీర్షికన "పోతన భాగవతాన్ని నేటివారు ముద్రాపకులు, ప్రచురణ కర్తలు ముద్రించియున్నారుకదా. ఏవో స్వల్ప పాఠభేదాల సవరణ కని బోలెడు ఖర్చుపెట్టి అకాడమీవారు ప్రచురించటం కంటే ఏ అముద్రిత గ్రంథాన్నో ముద్రింపిస్తే బాగుండేది. శ్రేష్ఠమైన అముద్రిత గ్రంథాలెన్నో వుండగా వానిని విస్మరించి, ఈ పిష్టపేషణ మెందుకని అడిగాను" అన్నారు 943వ పుటలో. సాహిత్య అకాడమీ రాజకీయాలను సుతారంగా విమర్శించారు ఈ గ్రంథకర్త.

969వ పుటలో "క్షేత్రయ్య కృష్ణభక్తుడని, కృష్ణునియందు గల భక్తి పారవశ్యముచేత శృంగార పదాలను రచించాడని, గానం చేశాడని చెప్పే దృక్పథంతో నేను ఏకీభవించను. ఆయన సౌందర్య లావణ్యస్త్రీ మూర్తిని ఆరాధించాడు. ఆయన జావళీలు దైవ భక్తి ప్రేరకములుగాక మానవ జీవితానందాన్ని పెంపొందించేవి" అని ఒక ప్రసంగంలో (969వ పుట) తాను చెప్పినట్లు వ్రాశారు శ్రీ చౌదరిగారు. ఈ వాదనలో ఎంత మంది ఏకీభవిస్తారో మరి 'సంచారం' అనే అధ్యాయంలో వీరు వ్రాసిన అంశాలు, చేసిన స్థల వర్ణనలూ, దేవాలయాల వర్ణనలూ, ప్రకృతి దృశ్యాలూ, చిత్రణా, పాఠకులకూ, పామరులకూ విజ్ఞులకూ రచయితలకూ ఉపయోగపడుతవి.

తన రచనా వ్యాసంగం విశేషాలనూ, తమ రచనలనూ గురించి పలువురు ప్రముఖులు ప్రకటించిన అభిప్రాయాలనూ "గ్రంథ రచన" అనే అధ్యాయంలో పొందు పరచారు.

మొత్తం యీ మూడు భాగాలనూ కలిపి చదవాలి. ఓపిక వుండాలి. అందుకు ఉపయోగపడే ఏపని చెయ్యాలన్నా కొంత ఓపిక అవసరమే గదా? అయితే "స్వ విషయం' అనే పేరు చూడగానే "ఇదేదో సొంత గొడవ. ఎవరి గొడవ వాడికి ఉండనే ఉంటుంది. ఈ గొడవ ఎవరికి కావాలనే వారికి" నమస్కారాలు. తెలుసుకుందామనే దృష్టితో చదివేవారికిఉపయోగపడే గ్రంథ మిది. దేశంలోని క్షేత్రాలనూ ప్రకృతి అందాలు చిమ్మే పట్టణాలనూ స్వయంగా చూడలేని వారికి, ఆయా స్థలాలను స్వయంగా చూసేటంతటి సంతృప్తిని కలిగించే గ్రంథమిది. పార్టీ మార్పిడీలూ, ముఠా రాజకీయాలూ పురాణాన్ని కొంతవరకయినా పరిచయం చేసుకో దలచే రాజకీయవాదులకు ఉపయోగపడే గ్రంథమిది. ఇందుకొక ఉదాహరణ ఆచార్య ఎన్. జి. రంగాగారు స్వతంత్రపార్టీకి గుడ్‌బై కొట్టి ఇందిరా కాంగ్రెసులో చేరడాన్ని గురించి ఈ గ్రంథకర్త వ్రాసిన వాక్యాలు—భూసంస్కరణ చట్టాన్ని గురించి రైతుగా శ్రీ చౌదరిగారు వెలిబుచ్చిన అభిప్రాయాలు మరొక ఉదాహరణ.

గ్రంథాలయాలూ, రాష్ట్రప్రభుత్వమూ ఆదరించి, కొనవలసిన గ్రంథమిది. ఒక తరం కథ ఇది కావడమే అందుకు కారణం. సహృదయులయినా ఆదరించితే పోనీ చదివితే ఎంత బాగుంటుందీ?

**శ్రీ వి. ఎస్. అవధాని.**

## ఏది గమ్యం—ఏది మార్గం (నవల)

(రచన: మాలతీ చందూర్, ప్రచురణ : యం. శేషాచలం అండ్ కంపెనీ. సికింద్రాబాద్, మద్రాసు, మచిలీపట్నం, మూల్యం: 2—50. పేజీలు: 152)

నేటి సమాజంలో యువతీ యువకుల్లో కొందరు ప్రేమించుకొని వివాహం చేసికొంటారు. ఈ వివాహాలు కొన్ని సత్ఫలితాలు సాధించి ఆనందాన్ని కలిగిస్తున్నాయి. మరికొన్ని కారణాంతారాలవలన కలతలేర్పడి దాంపత్యాలు నశించిపోవుచున్నాయి. ఆ విధంగా నశించిపోయిన కుటుంబగాథే 'ఏది గమ్యం—ఏది మార్గం' నవల కాధారమైన ఇతివృత్తం.

మద్రాసులో మెడిసిన్ చదువు చున్నప్పుడు మేరీకి, విశ్వనాథానికి పరిచయం కలిగింది. ఆ పరిచయమే వారిని దంపతులుగా తీర్చింది. ఇదిరువుర గుణమే ప్రధానమని తలచి కులమతాలను వెనక్కునెట్టి ఒక్కటయ్యారు. వివాహానికి స్నేహితులుతప్ప మరెవ్వరూ రాలేదు. పెద్దలమాట కాదని వివాహం చేసికొన్నందుకు సన్నిహితులు సంతోషించారు. ఆత్మీయులు అక్కసు చూపించార్న

ధైర్యంగా జీవితంలో అడుగుపెట్టి ప్రాక్టీసు పెట్టారు. మేరీ జీవితానికి లోటు లేకుండా సంపాదించినను విశ్వనాధం మాత్రం సంపాదింపలేక పోవుచున్నాడు. మద్రాసులో ఉన్నంతకాలం స్వతంగా నర్సింగ్ హోమ్ స్థాపించుకోలేక పోయారు.

విశ్వనాధం చిన్ననాటి స్నేహితుడైన సుబ్బరాజు ప్రోత్సాహంతో స్వంత గ్రామంలో ప్రాక్టీసు పెట్టాలని మద్రాసు నుండి మేరీతో తరలి వచ్చాడు. మేరీకి ఎక్కువ కేసులు వచ్చినట్లుగా విశ్వనాధానికి రాలేదు. ఆమెకు పరపతి పెరుగుతుంది. మేరీనిబట్టి విశ్వానికి ఒక రకంగా పేరు వచ్చింది. ఈ సందర్భం లోనే విశ్వం తన కన్నవారింటికి రాకపోకలు ప్రారంభించాడు. ఇంటి బరువు, భారం అన్న రామ్మూర్తి విశ్వంనెత్తిన వేయాలని భావిస్తాడు. అందుకు అతని భార్య జానకమ్మకూడా అంగీకరిస్తుంది. విశ్వం అనుకొన్నట్లుగా చెల్లెళ్ళు తమ్ముళ్ళపెండ్లిండ్లు చేయిస్తాడు. పెండ్లి పేరంటాలకు మేరీ సంపాదించిన సొమ్ము విశ్వం వాడాడు. కాని మేరీ మాత్రం విశ్వం తల్లిదండ్రులింటిలో అంటరానిదిగానే ఉన్నది. మేరీ మనస్సు చివుక్కుమన్నది. ఆమెకు భర్త పిల్లలు నర్సింగ్ హోమ్‌తప్ప వేరే వ్యాపకాలేమీ లేవు. నిజంగా తన జీవితం గానుగెద్దులా వున్నది.

విశ్వం డాక్టరు వృత్తికి దూరమయ్యాడు. రాజకీయాల్లో దిగాడు. క్లబ్బుల్లో పేకాట ప్రారంభించాడు. పేషెంట్లుకంటే స్నేహితులెక్కువయ్యారు. ఈ పరిస్థితిని చూచి మేరీ భరింపలేక పోయింది. డాక్టరు వృత్తికి న్యాయం చేకూర్చమని అర్థించింది. అయినను ఆమె మాటలను లెక్క చేయ లేదు. విశ్వానికి రాజకీయాలలో రాణించగలననే విశ్వాసం వున్నది. భార్యకు మాత్రం అతని మీద సందేహం కలిగింది. అప్పటి నుండి వారిలో భేదాభిప్రాయాలు పొడచూపుట ప్రారంభమైనాయి. వాగ్యుద్ధం కూడ ప్రారంభమవుతుంది. దీనికంతకూ కారణం ఆ గ్రామమే అని భావించి అప్పటి నుండి మార్చాలని మరిది మోహన్, స్నేహితురాలు రోసీ సలహాలనుబట్టి మేరీ ఒక అభిప్రాయానికి వచ్చి విశ్వాన్ని అడుగుతుంది. అందుకతడంగీకరించడు. విశ్వం ఎలక్షన్సులో పాల్గొని మేరీ నిలువవుంచిన సొమ్ము ఖర్చు చేస్తాడు. ఈ పరిస్థితులతో మేరీ క్రుంగిపోతుంది. విశ్వానికి తెలియకుండ మేరీ వేరొకచోట ఉద్యోగం కొరకు ప్రయత్నిస్తుంది. ఈ ఘట్టమే మేరీ జీవితంలో విషాదం రేపింది. మేరీ తన బిడ్డలను తనతో తీసికొని వెళ్ళుటకనుమతి కావాలని విశ్వాన్ని అడుగుతుంది. అందుకు విశ్వం ఒప్పుకోడు. పిల్లల భవిష్యత్తు కొరకు ఆరాటపడి అడిగితే కాదని అతడు తిరస్కరిస్తే ఆమె కుంచించుకొని పోయింది. భర్తను సక్రమ మార్గంలో ఉంచాలనే ఉద్దేశంతోనే మేరీ ఆ విధంగా చేసింది. చివరకంతా తారుమారైంది. తను నిరాశపడిపోయింది. సామాన్య స్త్రీలాగున ఆమె కన్సల్టింగ్ రూములో ఉండి వంటిమీద కిరసనాయిలు పోసికొని నిప్పంటించుకుని మరణించింది. తరువాత భర్త విశ్వం మానసికంగా వ్యధ చెంది కన్నుమూసాడు. ముగ్గురు పిల్లలు మాత్రం మిగిలారు. రోసీతప్ప తక్కిన వారెవ్వరూ వారిని దగ్గరకు తీయలేదు. మేరీ విశ్వం మరణించారు. పిల్లలు రోసీ పరమైపోయారు. వీరికి ఏదీ గమ్యం, ఏది మార్గం అనేది తెలియలేదు.

ఈ నవలలో ప్రముఖంగా కానవచ్చే పాత్రలు మేరీ, విశ్వం, సుబ్బరాజు కథలో వీరి ప్రాముఖ్యం ఎక్కువ. ఈ పాత్రల్లో కూడా మేరీ పాత్ర పేర్కొనతగింది. మేరీ కేరళకు చెందిన సిరియన్ క్రిష్టియను. తనవారిని ఎదిరించి జీవితంలో అడుగు పెట్టింది. డాక్టరుకు ఉండవలసిన లక్షణాలన్నీ ఉన్నాయి. కాని స్త్రీ సహజమైన ప్రవృత్తి ఆమెలో దాగి వున్నది. డాక్టరుగా ఉన్న ధైర్యం స్త్రీగా పోలేకపోయింది. చదువుకొన్నదే కాని లోకానుభవం తక్కువ. కులాంతరం, మతాంతరం వివాహం గూర్చి మొసలికన్నీరు కార్చింది. అయితే తనను కాదని తిరస్కరించిన తోటికోడలు జానికమ్మకు సహితం వైద్యంచేసి డాక్టరుగా తన విధిని నిర్వర్తించింది. ఒక విధికి కట్టుబడినపుడు దానికి న్యాయం చేకూర్చటమేకాని అన్యాయంచేసి అప్రతిష్ఠ పొందాలనే తలంపు లేదు. వృత్తికి ద్రోహంచేస్తే ఎవరినైనా భరింపలేదు. భర్తఅంటే గౌరవమే కాని అగౌరవం లేదు. తెలియని విషయాలు అడిగి తెలుసుకొని తన వృత్తిలో ముందుకు వెళ్ళింది. అలాగుననే భర్తను నడిపించాలని చూచించిందికాని సాధ్యంకాలేదు. వివాహమునకుముందు వాటిల్లిన పరిస్థితులను ఎదుర్కొన్నది కాని తరువాత జరిగిన పరిస్థితుల ప్రభావాన్ని ఎదుర్కొనలేక పోయింది. ఈ ప్రపంచం నుండి శాశ్వతంగా తిరోగమించింది. అదే ఆమెలో పిరికితనం. తాను చేసిన అన్యాయం కూడ అదే. డాక్టరుగా చేయవలసిన పనిని చేయలేక పోయింది. తనకుతాను ఆత్మహత్య చేసికొన్నది. అది అర్థవంతంగా లేదు. అంత చదివి చివరకు అమాయకురాలులా కన్నుమూసినను ఆ పరిణామం విశ్వం, పిల్లల జీవితాలను దెబ్బ తీసింది. ఆవేశంలో ఆలోచన నశించింది. కర్తవ్యం మరచిపోయింది. పిల్లలు ఏమైపోతారనే భావం లేకుండా స్వార్థంతో సతమతమై హతమై పోయింది. ఈ పాత్రపై పాఠకులకు సానుభూతి కలుగుట తథ్యం.

విశ్వనాధం కోస్తాజిల్లాకుచెందిన బ్రాహ్మణయువకుడు. తాచేసేపనిచేస్తున్నను మంచిది అనుకుంటాడుకాని, దానిలో దోషాలు పట్టిచూడగల్గిన పరిశీలనా శక్తిలేదు. కులాంతర, మతాంతర వివాహం వల్లతానొక ప్రగతివాది అనే భావం మనసులో నిండివున్నది. కులాంతర వివాహం వలన తనవారందరూ తనను వెలివేసేసరికి భయపడిపోయాడు. ఏవిధంగానైనా వారికి సన్నిహితం కావాలని ఉవ్విళ్ళూరాడు. తల్లిదండ్రుల ప్రేమకు దూరం కాకూడదనే తలంపు అధికం.

రాజకీయాల్లో ప్రవేశించాడు. చెప్పుడు మాటలువిని చెడిపోయాడు. ఏ ఆదర్శం కొరకు మెడిసిన్ చదివాడో ఆ వృత్తికి తిలోదకాలర్పించాడు. మనసు మంచిదేకాని చేసే పనులుమాత్రం వైద్య వృత్తికే వ్యతిరేకం అయ్యాయి. తన వారు మేరీని వెలివేస్తున్నను పట్టించుకోక వారి మీద అభిమానం పెంచుకున్నాడు. అతడు ఒకవైపునే ఆలోచింపగలడు. ఒక్క రోజుకూడా తన కుటుంబ సభ్యులు చేస్తున్న అన్యాయాలను చూస్తూ ఊరుకొన్నాడు. మేరీ కష్టపడి సంపాదిస్తున్నది. ఆమెకు నేనిచ్చే చేయూత ఏమిటి? అనే ప్రశ్న రానేరాలేదు. ఎంతసేపూ రాజకీయాలు, క్లబ్బులు, పేకాట, స్నేహితులు మాత్రమే. స్వంతగ్రామం వచ్చిన తరువాత మేరీని భార్యగా చూడలేక పోయాడు. వివాహ అయ్యేవరకు ప్రేమించాడు. ఆ తరువాత అది మరచిపోయాడు. తానొకరకంగా ఆమె జీవితాన్ని పాడు చేశాడు. డాక్టరు చదివాడు. చదివిన దానికి ప్రతిఫలంగా రాజకీయాలబ్బాయి. పోనీ ఆ రాజకీయాల్లో విజయం సాధించాడంటే అదేమీ సాధింపలేని చవట అయ్యాడు. తాను తన భార్యను తనవితీరా పలుకరింపనేలేదు. భార్య కష్టపడుతూంటే చూచి సానుభూతి చూపక ఆమెయొక్క లోపాలను వేలుపెట్టి చూపించాడు. కాని తనలోపం తాను గ్రహింపలేని అసమర్థుడయ్యాడు.

మేరీ మరణం విశ్వనాథంలో మార్పు తెచ్చింది. జీవితంలో రాజీపడలేక పోయాడు. తనవారు తనవే పీల్చిపిప్పి చేస్తున్నారు. ఆదాయం తగ్గిపోయింది.

వ్యతిరేకత సన్నగా కూనిరాగం ప్రారంభించింది. మేరీలేని జీవితం వ్యర్థంగా భావించి తానూ పిల్లలను వదలి లోకాన్ని వీడి వెళ్ళిపోయాడు. అతనిలో గమ్యం లేదు, మార్గం లేదు.

సుబ్బరాజు చదువు అబ్బని రాజకీయవాది. మంచి ఉద్దేశాలున్న వ్యక్తి. మిత్రులంటే ప్రాణం. మేరీ—విశ్వనాథాన్ని గ్రామానికి తరలించుకుని వచ్చాడు. వారిపేరు ప్రతిష్ఠలకు మురిసి పోయాడు. నట్టనడి సముద్రంలో నావమునిగి పోతూంటే చూచి ఏమీ చేయలేక పోయాడు. హాని జరుగు తున్నను దానికి కారణం గ్రహింపలేక పోయాడు. రాజకీయాల్లో తానుమునిగిన కారణంచేత విశ్వనాథాన్ని కూడా ముంచాడే కాని పైకి తీసుకుని రాలేక పోయాడు. ఇతడే కనుక జీవితంలో తారసిల్లకపోతే మేరీ విశ్వనాథం డాక్టర్లుగా స్థిరపడి రెండు చేతులతో సంపాదించేవారు. ఒక రకంగా సుబ్బరాజు వారి భావి జీవితనాశనానికి కారకుడయ్యాడనిపిస్తుంది.

రచయిత్రి మాలతీ చందూర్‌ను వేలాది పాఠకులు ఆంధ్రప్రభలో పరోక్షంగా చూస్తూనే వున్నారు. జవాబుల శీర్షిక నిర్వహించే తీరు చూస్తే ఆమె యొక్క బహుపుస్తక పరనాశక్తి, విషయ వివేచనాశక్తి, సూటిగా సమాధానమియ్యటం వంటి లక్షణాలు కన్పిస్తాయి. ఏమెస్కో ద్వారా ఇంతకు పూర్వం 'లావణ్య', 'మేఘాల మేలి ముసుగు' అను నవలలు వచ్చాయి. ఒక్కొక్క నవలలో ఒక్కొక్క ప్రత్యేకత కాన్పిస్తుంది. కాని ఈ నవలలో పేర్కొనదగిన ప్రత్యేకత ఏమీ లేదు.

సామాన్యంగా ఈ రోజుల్లో కులాంతర, మతాంతర వివాహాలు జరుగుచునే ఉన్నాయి. కొన్ని జీవితాలు హాయిగానే సాగిపోవుచునే ఉన్నాయి. మరికొన్నిపుబ్బలో పుట్టి మఖలో మాయమవు చున్నాయి. మెడిసిన్ చదువుచు ప్రేమించుకొని కులమతాలను లెక్కచేయకుండా వివాహం చేసికొని హాయిగా జీవించే దంపతలను చూడగలమేకాని ఈ విధంగా ఆత్మహత్య చేసుకొని భార్య పోవటం, తరువాత భర్త కన్నుమూయడం వంటి ఘటనలు జరుగడం చాల ఆశ్చర్యంగా ఉన్నది. డాక్టరు అయిన మేరీ కిరసనాయిలుపోసికొని నిప్పంటించుకొని బలవంతంగా చనిపోవటం హాస్యాస్పదంగా కాన్పిస్తుంది. డాక్టరు అయినవారిలా చనిపోవటాని కవకాశం లేదు. ఇందులో అసహజత్వం చాల ఉన్నది. ఈ విషయాన్ని రచయిత్రి మేరీ చదవడమయితే పెద్ద చదువు చదివింది. కాని ఆమె సహజంగా పెద్ద తెలివి మానసికస్థైర్యమూ గల వ్యక్తికాదు. విశ్వనాథం ప్రభావం వలన ఆమెలో కదలికా, సాహసం కలిగాయి. ఆమెకూడ స్త్రీ సహజమైన బాధలకు ముఖ్యంగా మాతృత్వపు ఆదుర్దాలకు గురయింది. ఆ క్షణంలో ఆమె డాక్టరు కాదు. విద్యావతి కాదు. మామూలుస్త్రీ. ఈ పై పొరలు తొలగిపోగా ఆమె బెదరి మామూలు స్త్రీవలె ప్రవర్తించింది. అక్కడ చదువూ విజ్ఞానమూ అనే ప్రసక్తి లేదు అని సమర్థించారు. ఇది కేవలం సమర్థనమేకాని యదార్థం కాదు. మేరీజీవించటం రచయిత్రికి ఇష్టం లేదు గనుకనే నిలువునా నిండు ప్రాణం తీసారు. నవలలో ఇదొక లోపంగా కన్పడుతూ ఉంటుంది.

మేరీని విశ్వనాథం తరపువారు అంటరానిదిగా చూస్తుంటే అదేమిటని భర్త అడుగలేక పోయాడు. భార్యకు అవమానం జరుగు తుంటే భర్త సహింపగలడా అనే సందేహం కలుగుతుంది. పూర్వాపరాలు పరిశీలించి పరిష్కారాన్ని కూడ యోచింపలేక గ్రుడ్డుఅప్పగించి మిన్నకున్నాడు. దంపతులైన డాక్టర్ల జీవితంలో ఈ విధంగా జరుగదు. కాని నవలలో జరిగినట్లుగానే చెప్పారు.

మేరీకి తగినంత ప్రాక్టీసు ఉండటం, విశ్వనాథానికి లేకపోవటం అని చెప్పటం భావ్యంగాలేదు. అటు మద్రాసులో, ఇటు స్వంత ఊరులోను రచయిత్రి విశ్వాన్ని డాక్టరుగా గుర్తింపక పోవుటచేతనే అతన్ని ఈవిధంగా చిత్రించారేమో అనిపిస్తుంది.

మేరీ చనిపోయిన తరువాత విశ్వనాథం మానసికంగా, శారీరకంగా, ఆర్థికంగా క్రుంగినట్లు చూపించి అతడుకూడ కన్నుమూసాడని చెప్పటం అర్థరహితంగా ఉన్నది.

మేరీ విశ్వనాథం పోయిన తరువాత వారి పిల్లలను స్నేహితురాలైన రోసితీసుకొని వెళ్ళటం అసహజంగా ఉన్నది. విశ్వనాథం తల్లిదండ్రులాపిల్లలను చూడకనే ఉన్నారా? సహాయం పొందిన చెల్లెళ్ళకు అన్న పిల్లలు పనికిరాలేకపోయారా? ఎంత సంప్రదాయ పరాయణులైనను ఇట్టి సన్నివేశాలలో సంప్రదాయాన్ని అవతలకు నెట్టి బిడ్డలను గుండెలకు హత్తుకొంటారు. ఆ విధంగా రచయిత్రి చూపింపలేదు. దానికి కారణం పాఠకులే అన్వేషించాలి.

నవలలో రచయిత్రి సందేశమేమీలేదు. అంతేగాక కులాంతర, మతాంతర వివాహం చేసికొంటే హతమేకాని, పైకిరాలేరు, చివరకు పంతాలకు పట్టింపులకు లోనై నిండు ప్రాణాలు బలి చేయటమే జరుగు తుందని మేరి విశ్వం జీవితాలనుబట్టి చూపిస్తున్నారు.

కథను విషాదాంతంచేసి చూపించారు. సుఖాంతం అయితే బాగా ఉంటుంది. మేరీ విశ్వం ఉండి పిల్లలను తమఅంతవారిని చేసి కనుల ముందే బిడ్డల భావి పురోగతిని చూపిస్తే కథకు నిండుదనం వచ్చేది. డాక్టర్ల జీవితాలను విషాదంగా ముగింపు చేయడంలో రచయిత్రి యే ప్రయోజనాన్ని సాధింప లేదు.

సహజమగు భాష కథలో ప్రస్ఫుటంగ ఉన్నది. పరిమిత పాత్రలతో కథను నడిపించారు. జవాబులెంత స్వీట్‌గా ఇస్తారో నవలకూడా అంత స్వీట్‌గా, శ్రీమతి మాలతీచందూర్ వ్రాసారు. ఇంకను మంచినవలలు వారి కలం నుండి రావచ్చునని ఆశింపవచ్చును.

- శ్రీ రామమోహన్.

## ముద్రారాక్షస నాటకమ్

ఆంధ్ర రసాస్వాదిని వ్యాఖ్యతో. వ్యాఖ్యాత శ్రీమాన్ కోటమాగు— రామదాసయ్యంగారు. డెమ్మీ 87 + 396 పుటలు. వెల 10 రూపాయలు. (ప్రకాశకులు— ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవనము, సైఫాబాద్, హైదరాబాదు —4.)

సంస్కృత భాషలో ఉన్న సుప్రసిద్ధ నాటకాలలో ముద్రారాక్షసం కటి. దీని రచయిత విశాఖదత్తుడు. స్త్రీ పాత్రలు లేకుండా కేవలం రాజకీయ తంత్రాలను వివరించే నాటకాలలో ఇది అగ్రశ్రేణికి చెందినది.

స్త్రీ పాత్రలు లేని నాటకాని ప్రదర్శించి, రక్తి కట్టించగలగడం ఉండడం అరుదు. అందులోనూ తలనొప్పి కలిగించే రాజకీయ విషయాలను వివరించేది ప్రజాదరణాన్ని పొందడం మరీ కష్టం. అయినా కవి తన ప్రతిభా

విశేషం వల్లనూ, కవితా పాటవంవల్లనూ రసవంతాలయిన నాటకాలలో అత్యుత్తమ దృశ్య కావ్యంగా దీనిని రచింపగలిగాడు.

ఇది నందరాజ్య పతనాన్నీ, మౌర్య రాజ్య స్థాపననూ వర్ణించే కృతి కాదు. మహా మేధావి అయిన చాణుక్యుడు తన ప్రతినను అనుసరించి నందులను నిర్మూలించి చంద్రగుప్తుణ్ణి మగధ రాజ్యాధినేతగా నిలిపినంత మాత్రంతో తృప్తి పొందక, మౌర్య రాజ్యానికి స్థైర్యాన్ని కూర్చే పద్ధతిని వివరించడమే దీని ప్రధాన లక్ష్యం. ప్రభు భక్తిపరాయణుడైన నందరాజ మంత్రి రాక్షసుడు. శత్రు పక్షంలో ఉన్నంతకాలం చంద్రగుప్తునికి ఆపదలు కలుగుతూనే ఉంటాయని గ్రహించి చాణుక్యుడు ఎంతో నేర్పుతో ఆ రాక్షసుణ్ణి మౌర్యునికి మంత్రిగా ఉండేటట్లు చేస్తాడు. రాక్షసుడే మంత్రి అయితే రాజ్యం స్థిరపడినట్లే! ఇందులో ఉన్నది చంద్రగుప్తుడు రాజైన తర్వాతి కథయే. మౌర్య పతనానికి రాక్షసుని యుక్తులూ, చాణుక్యుని ప్రతియుక్తులూ అత్యద్భుతంగా సరళమైన శైలిలో ఇందు వివరించబడినవి.

ఈ నాటకానికి సంస్కృతంలో వ్యాఖ్యలూ, ఆంగ్ల వ్యాఖ్యలూ, అనువాదాలూ ఉన్నవి. కాని సంస్కృత మూలాన్ని తెలుగువారు అర్థం చేసుకొనుటకు అవి అంతగా ఉపయోగించవు. అట్టివారి ఉపయోగార్థం సంస్కృతాంధ్రాలలో సుప్రసిద్ధ విద్వాంసులు, ఆంగ్లంలోనూ, చరిత్రలోను నిష్ణాతులు. అనుభవజ్ఞులైన ఉపన్యాసకులు అయిన శ్రీమాన్ రామదాసయ్యంగారు "రసాస్వాదిని" అనే ఆంధ్ర వ్యాఖ్యను దీనికి రచించారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు అందంగా ముద్రింపించి ప్రకటించారు.

శ్రీ రామదాసయ్యంగారిదివరకే కాళిదాస మహాకవి అభిజ్ఞాన శాకుంతలానికీ, భవభూతి ఉత్తర రామచరిత్రకూ, ఇట్టి వ్యాఖ్యలనే రచించి కీర్తి గడించారు. వ్యాఖ్యాత చాలా ముద్రణాలను పరిశీలించి రచించుటవల్ల ఈ వ్యాఖ్య అన్యూనా నతిరిక్తంగా అత్యుత్తమంగా తయారైనది. వ్యాఖ్యాత తమ 87 పుటల విపులోపోద్ఘాతంలో కవి దేశ కాలాదులు, కథాంశం, నాటిక విమర్శ, లక్షణం, సంధిసంధ్యంగ వివరణ, కాలగమనం, వృత్తి వివరణ మున్నగు విషయాలను వివరించారు. నాటక తత్త్వ జిజ్ఞాసువులకు ఇది మిక్కిలి ఉపయోగకరమయినది.

వ్యాఖ్యలో విశేషాంశాలతో పాటు ప్రతి శ్లోకానికి అర్థ తాత్పర్యాలియ్యబడినవి. మచ్చున కొక శ్లోకం, దాని తాత్పర్యమున్నూ—

"పదార్థానుష్ఠానే రహయతి నృపం
స్వార్థపరతా,
పరిత్యక్త స్వార్థో నియత మయథార్థః
క్షితిపతిః
పరార్థశ్చేత్ స్వార్థాదభిమతతరో
హంత! పరవాన్
పరాయత్తః ప్రీతేః కథ మివ
రసం వేత్తి పురుషః

పరుల యక్కరలనే తీర్చు రాజు తన యక్కరలను తీర్చుకొన నేరఁడు అట్టివాడు ఏ భోగమును ఎరుంగనేరనివాఁడు రాజు? కేవలము పరాధీనుడు. ఏ సంతోషమును పొంతానకు చెందనేలేడు.

ఇందు అలంకారము అప్రస్తుత ప్రశంస. ఇందు ప్రశంసింపబడిన రాజ వృత్తము ప్రస్తుత వృషలాశ్రయు." (పుటలు 155—156)

సంస్కృత నాటకములను సులభంగా అర్థం చేసుకొనుటకు ఇట్టి ఆంధ్ర వ్యాఖ్యల ఆవశ్యకత ఎంతైనా ఉన్నది. దానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రయత్నించి సంస్కృత నాటకాలను ఉత్తమ రీతిని ప్రకటించగలరని ఆశిస్తున్నాను.

—శ్రీ బులుసు వేంకటరమణయ్య.

## బాబు

(శ్రీ పులిచెర్ల సుబ్బారావు, కవితా సంపుటి. క్రౌన్—45 పేజీలు, వెల రు. 3 ప్రతులకు— గ్రంథకర్త, 7 లైన్, ఆరండల్‌పేట, గుంటూరు—2.)

ఇది కవితా రీతుల కలగలపు. లేక లేక పుట్టి, ముద్దు దీరక ముందే దివికెక్కిన కుమారుని గూర్చిన ఆవేదన పైకుబికిన మధుర—కరుణారస స్మృతులు అక్షరరూపాన్ని పొందిన రచన ఇది. ముప్పురిన ఎం. ఎ. పాసైన వ్యక్తి, ఒక పసికందు మరణానికి ఇంత పరితపించడం— శరీరానికి మనస్సుకు కూడ ఆరోగ్యకరం కానందున, కవితలో గూడ తగినంత బలం లేకున్నది. ఆత్మాశ్రయ బుద్ధిని వదలని యీ రచన సర్వజనీనమైన భావోద్రేకాన్ని ప్రేరేపించలేకున్నది.

"పుత్ర శోకమే నరునికి పూర్వసుఖము" అని వ్రాయఁగలిగిన యీ తండ్రి మనసును చిక్కబట్టుకొనగలిగినచో జీవిత వల్లరిని ఆశతో పోషించి పెద్ద చేయగలడు. కవిత ప్రాథమిక దశలో ఉన్నది. ఒరవడి కుదిరితే సొంపు వాటింపజేసుకునే కళలు అక్కడక్కడా ఆశాజనకంగా ఉన్నవి. ఊరటే జీవితానికి ఊర్పు అని యీ కవి గ్రహించితే ఇందుని అందున మేలు.

## అంతర్మథనం

(శ్రీ వడ్డేపల్లి కృష్ణ: కవితా సంకలనం. డెమ్మీ—70 పేజీలు. వెల రు. 2—50 ప్రతులకు—యువ సాహితీ సమితి, సిరిసిల్ల, కరీంనగర్ జిల్లా,ఎ.పి)

ఇంతకుముందు భావకవులు ప్రేమను గూర్చి ప్రాకులాడినట్లే యిప్పుడు ముందు చూపుగల కవులు కష్టజీవుల కన్నీరు చెమటలను గూర్చి ఆక్రందించి, పరిష్కారం చూపించకపోవడం పరిపాటి అయినది. సరిదిద్దే త్రోవ చూపను యీ కవులందరికీ ఒకే విధమైన భయంగా ఉన్నట్లున్నది. ఈ కవి మంచి ఉద్యోగంలో ఉండి, లేనివారి అగచాట్లకు అంగలార్చడం ఫీజు తీసుకున్న వకీలు వాదం మాదిరి ఉన్నది.

ఈ కవి వ్రాసిన యీ కవితా ఖండికలన్నిటిలోను థీం ఒకటే!లేని వారిపై వగపుతోబాటు ఉన్నవారిపై కన్ను కుట్టడం యీయనలో ఒక విశేషం. నేటి అవినీతిని, అక్రమ వ్యాపారులను గూర్చే వీరి ఆవేదన. స్వరాజ్యం వచ్చిన తర్వాత ఒరగబెట్టినదేమీ లేదంటాడు. ఇదంతా మామూలు రాజకీయ వాదమే గాని, కవితా వస్తువుకు అంతగా గౌరవం గూర్చే సరుకు అంతగా

లేదు. పరుగెత్తే భావాన్ని చాల చోట్ల భాష అందుకోలేకున్నది. కొన్ని చోట్ల కవితాకోరకులు విక్కి చూస్తున్నవి" వల్లకాడు"లో భోగి అభాగ్యుడు అక్కడనే ఒకటిగానే మట్టిలో కలసినారు అన్నది— విషయం మామూలుదైనా, చెప్పిన పద్ధతి బాగున్నది. "పండుటాకుల పరితాపం"— రాలే ఆకు నవవేసే చిగురుటాకును గూర్చి చక్కని శయ్యలో, మర్మ ధోరణినిమాని వేదాంత బాణిలో చెప్పిన భావం చక్కగా ఉన్నది.

దేహాన్ని మనసును అలయించే ఉద్యోగ భారం తీర్చుకోను యువకులు యిట్టి లలిత కళా వ్యాసంగం కల్పించుకోవడం మెచ్చదగిన విషయం. ఈ కవిత అభివృద్ధి మార్గాన నడుస్తున్నది.

## చక్రఘోష

(శ్రీ గిడుతూరి సూర్యం. కవిత. వెల రు. 2 క్రౌన్—80 పుటలు. ప్రతులకు: ప్రగతి ప్రచురణ, వానపాలవారివీధి, ముత్యాలంపాడు, విజ●వాడ 11.)

ఇది నవ్య కవితా రీతుల గద్య కవిత్వం. "హే కవి జనరవి" అని మేల్కొలుపు గీతం పాడుతున్నాడు. ఈయన ప్రారబ్ధవాది. కాబట్టే కర్మను ఎదిరించే శక్తి లేక ప్రార్థనాయత్త చిత్తుడగుచున్నాడు. వేదాంత భావనలతో మనసు పండబారుతున్నది. భావానికి తగిన భాషా విలసంతో లోకపుతీరు చెపుతున్నాడు.

"తాను అలుకొన్న సమాజం అనే సాలెగూడు"లో చిక్కొని, గమ్య దర్శనం లేని నరజాతిపై జాలి చూపుచున్నాడు. "అహంబ్రహ్మోస్మి" మొదలగు కొన్ని శీర్షికలలో పదాడంబర భారం క్రింద భావం అణగి నలిగి పోతున్నది. కొన్ని చోట్ల మర్మ కవిత్వ ధోరణిలో బడి కవిత్వం అయోమయమై పోతున్నది. బాల వితంతువు అశ్రు గాథ చెప్పిన "చక్రఘోష" కవితా రసస్ఫూర్తితో ఉన్నది. కాని, ఇప్పుడు ఇంత చిన్న బాల వితంతువు— హరవిలాస శారదా పుణ్యాన లేరేమో! అండ లేని ఆడుది పతితయై పరిస్థితుల ఒత్తిడితో బిడ్డను కనే ఉదంతం చాలా పరిపాటిదైనా, కవిత్వపాకం నుడికారం, సాను భూతి పూర్ణ గమనం గలిగి బాగున్నది". "పాప పాదాల పారాణిలో ఇంకా ఆరలేదు" "బాల వితంతు బ్రతుకు కత్తి అంచు మీాది నడక, జీవన స్రవంతిలో ఎదురీత" "కాలానికి ఆనకట్ట కట్టడం" "వ్యథ చెలియలి కట్టను ఛేదించింది" మొదలైన ప్రయోగాలు హృద్యంగా ఉన్నవి. "గర్భగుడిలో (తల్లి గర్భంలోని) జీవకణం" "ఆమె పతివ్రత— ఆమె మాతృదేవత" అన్న వాక్యాలు యీ ఖండికకు ఒక పవిత్ర స్థాయిని కల్పిస్తున్నవి.

— శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి.

## గంగామహాదేవి

(గేయకావ్యం రచన : శ్రీ శ్రీనివాసుల శేషభట్టరాచార్యులు. క్రౌను సైజు 100 పుటలు. మూల్యము : రూ. 3.00, ప్రాప్తిస్థానము : యస్.యస్. బి. ఆచార్యులు. ప్రత్తిపాడు (పి.ఒ.) గుంటూరు జిల్లా.)

ఇది అయిదాశ్వాసముల గేయకృతి. అతిలోక సౌందర్యవతి, అభినవ సంగీత సాహిత్య కళా సరస్వతి గంగాదేవి. ఆమె మనఃపద్మమున విహరించు భృంగమైనాడు కంపన.

నవమల్లికలు ముగుదం యెడదలవలె విరిసినవట. జడలలో మల్లీస్మితములే చంద్రికలై చెలగినవట.

గంగ పొంగు లడంగి లోలో కలగి కంపని తలచుచుండును.
ధీరగుణరత్నాకరుని యెదలోన నైక్యము నందగోరును' —ఈయనపై నారాయణరెడ్డిగారి ప్రభావం ఎక్కువగా గోచరిస్తుంది.

'కంపరాయల ఖడ్గమంతట కదలి వచ్చెను పెండ్లికొడుకై
పూజల కనర్హమై పొక్కు కేతకివోలె'— ఈయన సంప్రదాయ బద్ధుడనటానికి ఇదొక మచ్చుతునక.

'కావ్యమున కవితగా కవితలో రసముగా కౌగిళుల నేకమై కరిగిపోవును
రేడు' —కవిగారు రసైక దృష్టితో రచన సాగిస్తారనడానికి ఇదొక ఉదాహరణం.

'కనుదోయి నశ్రువుల్ క్రుమ్మచునుండ తనువెల్ల చిత్రచిత్రముగ
కంపింప కాటుక కన్నీరు గండపాళికల ఆటుపోటుగ పొంగులై చారగట్ట'—

ఈగంగా దేవివర్ణనము శ్లేష చమత్కృతితో మనోహరంగా ఉన్నది. గంగాదేవికి కంప రాయలపై గల ప్రేమము వర్ణించుచు కవి "తన భావమున కంపజనపాలు
డాదిగెనో
తన ప్రాణములు కంపజన విభుండయ్యెనో' — అనుట సముచితముగా ఉన్నది.

'ఒకరొకరి కౌగిళ్ళ నొదిగి ఏకమ్ముగా గంగామహాదేవి కరగి నీరైపోయె'

ఆంద్యంతము సలక్షణమైన భాషలో నున్న యీ పుస్తకమున 'ఎటులైనా నా కిష్టమె'., ఐనా గాని ముందుగ, చేసిరి నద్భుతాను రాగములను '—ఈ వ్యాకరణ దోషము లుండుట శోచనీయము.

'విజయనగర పురాంగణమ్మున పుట్టి పెరిగిన రెల్లు సైతము
గండు మగలై గండరించగ వీరయోధుల నెన్న నేటికి ?'

అట్టి భూమిని పాలించు ప్రభునియాత్మజుడు కంపరాయలు గిరిదుర్గమున తుదపెట్టి అరిరాజులను చెరపట్టి విజయలక్ష్మితో అర్ధాంగలక్ష్మితో విజయనగరమునకు విచ్చేసినాడు. రసవన్మహాకావ్యరమ్య శారద గంగ బుక్కరాయలయనుమతితో తాను రచించిన కంపరాయవిజయమును పఠించి సభను ముగ్ధమొనరించి "తార్కికా బహవ స్సంతి శాబ్దికాశ్చసహస్రశః విరలాఃకవయో లోపే సరసాలాప పేశలాః"అని అందరి ప్రశంస లందుకొన్నది. రచన ఆద్యంతమూ మధురాతి మధురంగా సాగిన మంచికావ్యమిది.

## 27 వసంతాలు

(పురాణం రామచంద్ర కవిత. వెల : నాలుగు రూపాయలు. క్రౌనుపుటలో 68. పూర్ణిమ ప్రచురణ. వేములవాడ (505302)

ఇరవై యేడేళ్ళలో స్వాతంత్ర్యం సిద్ధించిన భారతదేశం స్థితిని కళ్ళకు కట్టే ఇరవైయేడు గేయ రూప ఖండికలిందులో ఉన్నాయి.

"కంటి పీరొత్తుకుంటున్నాను"అనే మొదటి కవిత నేటి సమాజంలోని దైన్యాన్ని హైన్యాన్ని చక్కగా ప్రతిబింబిస్తోంది. అఖిలభారతములో సఖ్యత ముక్కలు కారాదనే సమైక్యవాది ఈ రచయిత.

"కళామతల్లీ! ఇబాలబూజానంతా నీ బుజాలనెత్తుతున్నారు" అని ఆవేదన వ్యక్తంచేసి చెట్టుపేరుచెప్పి కాయలమ్ముజూసే గాంగేయులను నిరసిస్తాడీ రచయిత.

సామాన్యుడయిన వోటరును భస్మాసురునికి వరమిచ్చి బాధపడే బోళాశంకరునితో పోల్చి "పెళ్లిగా మనుట మాని పులివలె చెలరేగు"మని సలహా. ఇస్తారీయన. "స్వేచ్ఛకు సంకెళ్ళు"అనే ఖండిక నేటి సాంఘిక రాజకీయ స్థితికి మణి దర్పణంగా ఉంది.

"అందరి కృషి ఫలితంగా ఆవిర్భవించిన స్వేచ్ఛ కొందరి స్వార్థ ప్రయోజనాలకు కట్టింది రక్ష. ఎందరికో చెందవలసినసౌఖ్యం కొందరి హక్కుగా రూపొందింది"అని కళ్ళముందు కనిపించే అన్యాయాలకు వాపోతాడీరచయిత. "సామాన్యుడా! రక్షించుకో నీ దేశాన్ని" అనే రచన ఈ గ్రంధానికి మకుటాయమానంగా వుంది.

## వెలుగుపూలు

(కవితా సంపుటి, రచన: దిలావర్. సైజు 31 డెమ్మీపుటలు. మూల్యము: రెండు రూపాయలు. ప్రతులకు: దిలావర్, ముత్యాలంపాడు (పి.ఒ.) ఇల్లెందు తాలూకా. ఖమ్మం జిల్లా. 567123)

ఇదొక అభ్యుదయ భావాలు సంతరించుకొన్న వచనాకవితా సంపుటి. సాహసమనే నిప్పురవ్వతో సుప్తచైతన్యజ్యోతి వెలిగించాలనీ, అర్ధరాత్రి గర్భంలో మధ్యాహ్నం సృష్టించాలనీ ఆరాటపడతా డీరచయిత. "ఒకవేపు వాగ్దానాల అతివృష్టి, మరోవేపు ఆచరణల అనావృష్టి" పంచాంగశ్రవణం" అనే శీర్షికలోని యీ మాటలు నేటి రాజకీయ జీవితానికి దర్పణం పడుతున్నాయి."సబ్బుదిళ్ళ"అనే వచన గీతిక నేటి ఆర్థిక సామాజిక స్థితికి ప్రతీకగా ఉన్నది. "చెల్లెమ్మా!"అనే శీర్షికలో జారిణులపట్ల రచయితకున్న సానుభూతి "స్మృతి"లో ఈయన దేశభక్తీ స్పష్టమవుతున్నాయి. ప్రాతమీద వీరికి కలరోతను "రవ్వలు"అనే గీతిక ప్రస్ఫుటం చేస్తుంది.

"చేదుమాత్రలు"లో "సెక్యులరిజమని గొంతుచించుకున్నా కులంగాడి బలం తగ్గలేదు", "ఇరులపొరలు క్రమ్మిన నా దేశంలో ఇంకా తెలవారలేదు" అంటూ ఈ నాటి దేశ దుస్థితికి బాధపడతాడు రచయిత. ఉక్తివైచిత్రి ఉగ్గుపాలతో అలవడ్డ యీకవి నుండి మున్ముందు మహాశక్తిమంతములైన రచనలు వెలువడే అవకాశం ఎంతైనా ఉంది. సోమసుందర్‌గారి సుదీర్ఘమైన సమీక్షా వ్యాసం ఈ రచన కొక ప్రత్యేకతగా భాసిస్తోంది. చక్కని సంస్కారంతో సమకాలీన సమాజంలోని అసమానతలను నిశితంగా నిరసించే సరికొత్తగొంతు ఇది.

## అంతరంగ చిత్రాలు

(గేయ సంపుటి. రచన: డాక్టర్ బి. ఆర్. శాస్త్రిగారు. క్రౌన్ సైజు. పుటలు 36. మూల్యము: రూ. 1—80. ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికిందరాబాద్—మదరాసు.)

కవిగారి అంతరంగంలో పొంగిన ముప్పైమూడు గేయ తరంగాల సంపుటి ఇది. ఈ కవి మంచి భావుకుడు. ఆధ్యాత్మిక దృష్టితో ప్రకృతిలో అణు వణువూ పరిశీలించే అలవాటు కలవాడు. డాక్టరు సి. నారాయణరెడ్డిగారు తమ "సువర్ణ పుష్ప"లో పేర్కొన్నట్లు వీరి రాగభావనం తత్వచింతనం నయనద్వయం లాంటివి.

"అద్దమ్ములు బ్రద్దలౌట ఎన్నిసార్లు చూడలేదు?
ఎంత ఛాయమో కాయము ఎన్నిమార్లు తెలియలేదు?"

అంటూ తనువుయొక్క అస్థిరత్వాన్ని ఎలుగెత్తి చాటుతాడు ఈయన. వేరుకాని యెడబాటిది. వింత వింత యెడబాటిది'— జీవేశ్వర సంబంధాన్ని గురించి వీరి యభిప్రాయ మిది.

'దేవు డంటే వ్యక్తి కాదోయ్! దేవు డంటే శక్తిలేవోయ్!'— అని ఈయన మతం. 'పేరన్నది లేకుండగనే పేరు గన్న పెద్దవు నీవు!' భగంతుని గురించి ఇలా చెప్పడంలో ఉన్న చమత్కారం సహృదయైకవేద్యం. పరమేశ్వరుడు 'పరిధిలేని కేంద్ర' మట. ఎంత చక్కగా చెప్పారో!

'ఎవడు బ్రాహ్మడు? ఎవడు మాల? ఎందుకో యీ పాడు గోల!
భరతభూమిని క్రుంగదీసిన పాడుజబ్బీసామ్య నిరసన'

అని ఆవేదనపడి "అందరం ఆ ఋషుల సంతతి" అంటూ సర్వసమత్వాన్ని చాటే సౌజన్యం వీరిది.

"నీకు ప్రతిమ లేకుండుట నిక్కచ్చిగ పలుకు బుక్కు
గుడిలో నిను ఖైదు చేస్తి చిమ్మ చీకటికి నీకూ

బలవంతపు చెలిమి చేస్తి" అంటూ విగ్రహారాధకుల ఆశా న్ని నిరసించి 'మతి మైకం పేరే మతమా?' అని నిలదీసి అడుగుతున్నాడీ అభ్యుదయవాది.

చిత్రకారుడు లేనిచిత్రం లేనట్లే సృష్టికర్త లేని సృష్టి ఉండదని వీరి సిద్ధాంతము.

'గతంలోని మంచి నెంచి పాత బూజు దులిపేస్తా
కొత్తదనం సాధిస్తా సత్యాన్నే వెలిగిస్తా' అన్న కవిగారు తన ప్రతిజ్ఞను ఈ రచనలో చాలవరకు నెరవేర్చుకొన్నారనే చెప్పాలి. గ్రంథం ఆద్యంతాలలో సంస్కృత శ్లోకాలు సంతరించడం ఒక ప్రత్యేకత. మానవతావాదియైన కవిగారు తన కృతిని మానవతకు సమర్పించడం సముచితంగా ఉంది.

## చిక్కవీరరాజేంద్ర

(చారిత్రక నవల. సైజు 384 క్రౌను పుటలు. రచన: మూలము—శ్రీనివాస, అనువాదము: అయాచితుల హనుమచ్ఛాస్త్రి. వెల రూ. 7—50 పై. ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతిరోడ్, సికిందరాబాదు.)

ఇది ఒక చారిత్రక నవల. దక్షిణ భారతంలో మైసూరు సంస్థానానికి సమీపంలోని కొడగు నేలిన చిక్కవీరరాజేంద్రుని విషాదాంత కథ ఇది. క్రౌర్యమూ వ్యభిచారమూ, తొందరపాటూ మొదలయిన దుర్గుణాలు మూర్తీభవించినవాడు చిక్కవీరరాజు. రోగికి పథ్య పదార్థము రుచించనట్లుగా రాణి వీరమ్మాజీ, మంత్రులు బోపణ్ణ, లక్ష్మీనారాయణయ్య, శ్రేయోభిలాషులైన ఉత్తయ్యతక్క మొదలైనవారి హితోపదేశాలను త్రోసిపుచ్చడమే కాక అవినీతిపరుడైన కుంటి బసవయ్యను మంత్రిగా నియమించి అతని చెడు సలహాలను పాటించి ప్రజాకంటకుడై చెల్లెలిని చెరపట్టి ఆమె కన్న పసికందును చంపి బంధు ఎరా

ధియ్యై కంపెనీ పాలకులయిన తెల్ల దొరలు తన రాజ్యమును చేజిక్కించుకొనుటకు అవకాశమిచ్చిన నిర్భాగ్యుడు చిక్కవీరరాజు. కంపెనీ ప్రతినిధులను బంధించి రాజ్యభ్రష్టుడై పతివ్రతయైన భార్యను కోల్పోయి కూతురుతో ఇంగ్లాండుకు పోయి ఆ కూతునొక క్రైస్తవునకిచ్చి పెండ్లి చేసి నామరూపములు లేకుండ తెరమరుగైపోయిన చిక్కవీరరాజేంద్రుని కథ అయిన ఈ నవలలో శ్రీనివాసగారు ప్రతి పాత్రను సూక్ష్మాతి సూక్ష్మ రేఖలతో రూపు కట్టించారు. ఈ నవలలోని పాత్రలు చాలవరకు బందీలే. రాణి సంప్రదాయమునకును, పతివ్రతా ధర్మమునకు బందీ. రాజు వ్యసనములకు బందీ. మంత్రులు ధర్మమునకు బందీలు. పీఠికలో శ్రీ యల్. ఎన్. శేషగిరిరావుగారు నుడివినట్లు "మొత్తం కొడగు రాజ్యమే ఒక పెద్ద చెరసాల" కనుక చెరసాలతోనే కథను ప్రారంభించడం, రాజు చెరపెట్టబడడంతో అతని రాజకీయ జీవితం అంతమైనట్లు రచించడం సార్థకంగా, సాభిప్రాయంగా ఉన్నాయి. ఇందలి పాత్రలు సహజంగా, సజీవంగా చిత్రింపబడ్డాయి. పాపాత్ముడయిన ద్రోహియైన లింగరాజునకు భగవతియందు పాపఫలంగా జన్మించిన బసవప్ప రాజైన వీరరాజును పాపపు దారినే నడిపించి పతనోన్ముఖుని చేయడం సమంజసంగా ఉన్నది. చిక్కన్న శెట్టి కోడలిని అనుభవించాలనే ఉద్దేశ్యంతో ఉన్న కాముకుడైన రాజుతో సంభాషించునప్పుడు శెట్టి చూపిన తెలివి అద్భుతంగా చిత్రించబడింది. రాణి ప్రశాంత గంభీర స్వభావమూనూ, దుష్టులైన రాజు మంత్రులను వారి సమక్షంలోనే నాటకం మిషతో అవహేళన చేసిన నూరప్ప యుక్తినీ, హిందూమతాన్ని అర్థరహితంగా నిరసించిన పాదరీయొక్క క్రైస్తవమతాన్ని ఖండిస్తూ భగవతి చేసిన యుక్తి వాదమునూ, ప్రాణత్యాగానికైనా సిద్ధపడిన సోమన్న ప్రభు భక్తినీ, ఆంగ్లేయుల కుతంత్రాలనూ, అమాయకులైన దేశ ప్రజలకు వారి పట్ల ఉండిన గౌరవ భావమునూ, తన కొడుకును రాజుగా చేయబోయి అతని చావును కన్నులారా చూడవలసి వచ్చిన భగవతి దయనీయ గాథనూ అతనిపుణంగా రూపొందించారు రచయిత. సన్నివేశాల ప్రభావం పాత్రలపైనా, పాత్రల ప్రభావం సన్నివేశాలపైనా ప్రసరించి ఈ నవలలో కథ తనంతతానుగా ముందుకు సాగిపోతుంది. పురుష పాత్రల మానసిక దౌర్బల్యమూ, స్త్రీ పాత్రల త్యాగవున్నత్యమూ, రచయిత సానుభూతితో పరిశీలించడం చూస్తాము. బాహిరమైన జగత్తును నడిపే ఆంతర వ్యాపారం అడుగడుగునా కొట్టవచ్చినట్లు కనిపించే రచన ఇది. స్వల్పమైన శబ్ద దోషాలు అక్కడక్కడ దొరలినా మొత్తము మీద చక్కని జాతీయాలతో, చిక్కని కథాసంవిధానంతో, ఒక్కసారిగా గ్రంథం ఆమూలాగ్రమూ చదవాలనే ఔత్సుక్యాన్ని పాఠకులలో రేకెత్తిస్తూ హృదయంగమంగా సాగిన ఈ నవలను రచించిన రచయితా, అనువాదకుడూ, ప్రచురణకర్తలూ ప్రత్యేకంగా అభినందనీయులు.

## హరివిల్లు

(కావ్యము, రచన: శ్రీకన్నెకంటి రాజమల్లాచారి. పుటలు 46. మూల్యము: రెండు రూపాయలు. ప్రచురణ: టానిక్ రైటర్స్, మార్కాపురం ప్రకాశంజిల్లా.)

ఇది గేయఫణితిలో సాగిన ఒక చిన్న ప్రేమ కథ. పలురకాల గేయాలతో పద్యాలతో వచనములతో నున్న ఈ రచనకు "హరివిల్లు" అనుపేరు సార్థకంగా ఉన్నది. రుక్మిణిని కృష్ణుడెత్తుకొని పోతున్న ఘట్టమును చిత్రకారిణియైన కథానాయిక చిత్రించినట్లు చెప్పడం భావికథాసూచకంగా ఉన్నది. ఒకపసిపిల్లవచ్చి ఆమె గీసిన బొమ్మను పాడు చేయగా వర్ణ సంకరం కావడం (రంగులు కలిసిపోవడం) ఈ కథలోని వర్ణాంతర వివాహాన్ని సూచిస్తోంది.

కథానాయకుడు కంఠములో ఘంటసాల —కవిత్వంలో నారాయణరెడ్డి — అందంలో తారకరాముడు (ఎన్. టి. ఆర్,) కథానాయికకు ఉన్న సినిమాలమోజు ఇది. వెంటనే "అమ్మకచెల్లా! నామనసీతని కమ్మకచెల్లను" అనుకొంటుంది ఆమె. ఇది ప్రబంధాల వాసన. అంటే ఆ పిల్ల తెలుగు కావ్యాలు చదువుకొన్న నవనాగరికురాలన్న మాట. ఇద్దరు తోటలో విహరించడానికి వెళ్ళారట. ఇలా కథ కొంత ముందుకు సాగుతుంది.

"అది ఆమెది. ఇది అతనిది —దానిలోన అతడు దూరె—దీనిపైన ఆమెచేరె" ఇదే వారి క్రీడావర్ణనం. ఆమె తెరచాప ఎత్తితే అతడు చుక్కాని తిప్పాడట. "ఉన్నది నా కొక్కటి —అది ఇచ్చితి మన సిచ్చితి నా కున్నది ఒకటే ఇచ్చితి నీకిచ్చితి"అని ఆమె అనగా "ఒకటె కాదు ఆపై రెండిచ్చితివి"అంటాడతడు. "ఎంతదీర్ఘమోయీ! నేనెట్లు మోతునోయీ! నాలో ఎట్లు మోతునోయీ"అని ఆమె పలుకగా "ఎంతలోతు ప్రేమ నీది ఎంత విశాలం! అంతు చిక్కునా చెలీ !అడుగు చిక్కునా?"అంటాడు అతడు. యువకులలో ఉద్రేకాన్ని రెచ్చగొట్టే ఈలైంగిక ధ్వని ఈనాటి సినిమా సాహిత్యాన్ని తలదన్నుతోంది.

సూర్యోదయకాలంలో తూర్పుదిక్కు మాంసం అమ్మే అంగడివలె ఉన్నట్లూ "అర్ఘ్యమిస్తున్న ఆచార్యులు అర్ధనిమీలిత నేత్రుడై గుడ్లు తినేదాని ఊరువుల గురించి ఊహలు చేస్తున్నట్లూ వర్ణించడం జుగుప్సావహంగా ఉంది.

నాయికా నాయకులు అనురాగం చూచిన "ప్రక్కవారి కన్నులు కుట్టినవి. ఆకన్నులు కొన్ని చెవులను కొరికినవి. ఆ చెవులే నోళ్ళయి అరచినవి."ఈ చెప్పడంలో క్రొత్తఅందం ఉంది. అక్కడక్కడ అంత్యానుప్రాసలు చోటు చేసుకొన్నాయి.

శకట ప్రవేశపత్రము (టిక్కెట్టు), రాకపోకల సూచి —ఇలా నూతనపదాల సృష్టికూడా ఉన్నది. ఒకవంక సినిమాబాణీలతో మరొకవంక పలయూనిం చంద్రదూషణలతో ఉన్న ఈ చిరుపొత్తం ఉదాత్తానుదాత్త భాషాభావసాంకర్య స్థానంగా ఉండిపోయింది. పీఠికలో శ్రీ విశ్వనాథవారన్నట్లు "అటు ప్రబంధ మార్గాన పోయే కవులున్నారు. ఇటు అభ్యుదయ విప్లవ దిగంబర కవులున్నారు. ఈయన ఈ నడిమివాడు" ఇతరుల ప్రభావానికి లొంగకుండా ఔచిత్యాన్ని పాటిస్తే

ఈ రచయిత నుండి శిల్పప్రధానమైన రచనలు వచ్చే అవకాశం ఎంతైనా ఉన్నది.

## వెలుగులో ఈ నేలపై

(వచన గీతికలు, రచన : శ్రీ మాదిరాజు రంగారావు, డెమ్మీ సైజు పుటలు 56. వెల : నాలుగు రూపాయలు. ప్రతులకు : సాహితీబంధు బృందం 2—4—30 పోలీసు క్వార్టర్స్ వెనుక, హనుమకొండ, వరంగల్.)

"అటు దేవాలయ గోపురాలు గత స్మృతుల మొగలిరేకులు ఇటు కర్మాగార శిఖరాలు వర్తమాన ప్రగతి సూచికలు"అంటూ భారత దర్శనం చేసిన ఈకవి "ప్రతివ్యక్తి అవాలి ఉన్న మజ్జుల తరంగం"అని ఆకాంక్షిస్తాడు. "ఈనాటి ఆతపజ్వాలలు రేపు తెస్తాయి వర్షధారలు"అని ఆశాభావం ప్రకటిస్తాడు. "నా కళ్ళనుండి రాలే అగ్నికితప్త మౌతుంది గ్రీష్మం. నాకళ్ళనుండి జారేనీటికి ఆర్ద్రమవుతుంది అవని. అనంతం ఉంది నాలో బీజంవలె ఒదిగి —అంతమూ ఉంది నాలో దిక్కుల్లోవలె నిలిచి" —ఈ విధంగా విశ్వరూపప్రదర్శనం చేస్తాడీకవీశ్వరుడు.

"క్రియాశీలానికి ఇస్తూ ఉత్తేజం రావాలి ఉదాత్త సంస్కారం కావాలిజాతికి ప్రస్తుతం వాస్తవాన్ని ఎదుర్కొనే తత్త్వం"అని ముందు నిలిచి కర్తవ్యాన్ని ఉపదేశిస్తాడు.

"ఈ గడ్డపై కణకణంలో బింబిస్తోంది ఒకే ఆత్మరూపం

ఈ నేలపై పదపదంలో పరిమళిస్తోంది ఒకే సంస్కృతీ పద్మం" భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించగల భావుకుడీయన. "తాబేళ్ళవలె వెలసిన పరిశ్రమలూ, భుజగాలవలె సాగిన ఆనకట్టలూ"ఈవర్ణన వర్తమాన భారతాన్ని ప్రతిబింబిస్తోంది.

"ఇక్కడ నిజంగా ఎవడూ మేల్కొని లేడు సంపూర్ణంగా"—ఎంతయదార్థ కథనమిది !

"కలుగుల్లో గాదెల్లో ఎలికలూ పందికొక్కులూ కంటికి కనిపించని బంధువులు" ఈ చెప్పడంలో ఉన్న చమత్కారాన్ని గురించి వేరే చెప్పనక్కరలేదు.

"అరచేవాడికీ, పాడిచేవాడికీ దొరుకుతోంది అగ్రతాంబూలం"—నేటి సమాజానికి ఈ మాటలు అద్దం పడు తున్నాయి.

"ఏమీ ఎరగనట్లు సూర్యుడు ప్రక్కకు తప్పుకునే ప్రయత్నంలో ఉన్నాడట. అస్తమించే కర్మసాక్షిని నిజం చెప్పకుండా మొగంచాటేసుకొనే సాక్షిలా చిత్రించడం అందంగా వుంది.

"లేని వస్తువులు చూపించడానికై ఉన్నస్థితులు మరపించడానికీ అడపా తడపా దండంత్రిప్పుతూ ప్రయత్నిస్తున్నా"డట మంత్రగాడు ! ఈ మాటల మాటున వంచకులైన నాయకుల సొముగరిడీలూ, ఆర్భాటమట రూపుకట్టుకొనడం ఉంది. ఎంతోవాడీవేడి ఉన్న రచన ఇది.

"మృగంకన్నా హీనం అయినా మానవుడు చిత్రం నాగరికతకు శిఖరం" ఎంత నిశితమైన పరిశీలన ! (ఈ నాటి దేశస్థితిని) "తలచుకుంటే భయం కంపిస్తుంది మరచిపోతే మనసు త్రవ్వుతుంది" —ఇజాలకతీతుడుగా నిలిచి నిజాన్ని చూడగల నిజమైన కవి శ్రీ రంగారావుగారు. కలాన్ని కత్తిగా ఉపయోగించి కాలుష్యాన్ని ఖండించగల కవి ఈయన. ఉక్తివైచిత్రితో ప్రతిపంక్తి ఈయన రచనా పాటవాన్ని పట్టియిస్తోంది. రసహృదయులు తలలూచే లాగ చేస్తూ ప్రశాంత గంభీరంగా సాగిన రచన ఇది.

## శే ష క వి త

(కవితా సంకలనం. రచన : శ్రీ గడియారం శేషఫణిశర్మ,42 క్రౌను సైజు పుటలు, మూల్యము : మూడు రూపాయలు., ప్రతులకు : రచయిత, 25/6 రవీంద్రనగర్‌కాలనీ, సీతాఫల్‌మండి. సికింద్రాబాద్—25.)

అంత్యానుప్రాసలతో అంతరంగాలను ఆకట్టుకొంటూ నవతకోరేయువతకు నచ్చేకవితలు పుష్కలంగా ఉన్న పుస్తకం ఇది. అశ్రువర్షాగమం సూచించే వీరికలం ఒక శక్రధనుశ్శకలం.

కలంలో నిలువని గళంలో పలుకని మెరుపుతీగల్లాంటి భావాలను పట్టుకొనే ఒడుపు తెలిసినకవి ఈయన.

ఎంత కన్నీరు పారినా అంతు తెలియని మనసుతో మృదురీతిలో కల గీతికలు పలికిరాంచేయాకవి నిట్టూర్పుగాలి సోకినా నిలువెత్తునా జ్వలించే ఆశలని కన్నీటి చుక్కరాలినా క్షణంలో కుసుమించే ఆశలని చంపుకోవద్దంటాడు. కనుకనే చీకటి కుత్తుకని నొక్కి వెలుగురేకలని వెలిగ్రక్కించాలంటాడు.

మతంకోసం మమతలు బలైనప్పుడు మరణిస్తూ మమతకట్టలు తెరచుకొన్నప్పుడు మనిషి మళ్లీ బతుకుతుంటాడనీ, జీవన మరణాలు మనిషి ఉచ్ఛ్వాస నిశ్వాసలనీ యీ మానవతావాది మతం. ఈయన మంచి భావుకుడు. శరణార్థులని చూసి జాలిపడుతూ వాళ్ళు ఎగిరేశక్తి నశించి పిల్లలలో వ్రాలిన పక్షులంటాడు. బంగ్లాదేశ్ ను భారతశస్త్ర చికిత్సతో పాకిస్తాన్ ప్రసవించిన శిశువుగా భావిస్తాడు. 'స్వీకారం' అనే శీర్షికలో కృతిభర్త శ్రీభాష్యం శ్రీరామమూర్తిగారి పలుకులు ఈ కవితా సరస్వతికి కపురపుటారతిగా పరిమళిస్తున్నాయి. ఆశలకి వూపిరిపోస్తూ ఆశయాలకోసం అక్షర రచనచేసే ఈకవి మరిన్ని మధుర కవితా మరందాలు మనకు అందిస్తాడని ఆశిద్దాం.

— శ్రీ వక్కలంక లక్ష్మీపతిరావు.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 75226.

# భారతి

## ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | | కాజువల్ రేట్లు | కాంట్రాక్టు రేట్లు |
|---|---|---|---|
| 4 వ కవరు పేజి | ... | రు. 210/- | రు. 180/- |
| 2 లేక 3వ కవరు పేజి | ... | | |
| ఒకే (నలుపు) రంగు | ... | రు. 180/- | రు. 150/- |
| **లోపలి పేజీలు** | | | |
| పూర్తి పేజి | ... | రు. 150/- | రు. 120/- |
| అర పేజి | ... | రు. 78/- | రు. 66/- |
| పావు పేజి | ... | రు. 48/- | రు. 42/- |

ప్రత్యేక స్థానములకు 25% అదనం.

సం. నకు వరుసగా 6 ప్రకటనలు చేయువారికి కాంట్రాక్టు రేట్లు వర్తించును.

## చందా వివరములు

| | ఏజంటు ద్వారా | పోస్టు ద్వారా |
|---|---|---|
| విడి ప్రతి | రు. 1-50 | 1-60 |
| 6 మాసముల చందా | రు 9-00 | 9-60 |
| సంవత్సర చందా | రు. 18-00 | 19-20 |

మేనేజరు, భారతి

విజయవాడ-520003.